ఆంధ్రగ్రంథమాలిక 3.

# శివపురాణము

(మూఁడవసంపుటము.)



సంపాదకుఁడు

నడకుదుటి వీరరాజుపంతులు.

# శివపురాణము.

(మూఁడవ సంపుటము.)

మూ[illegible]తము.



నడకుదుటి వీరరాజు పంతులు

సంపాదకుఁడు.

వెల రు ౧-౮-౦ లు.]

# పీ ఠి క.

మనపూర్వుల పవిత్రవీరధర్మములు, పావనవిబుధచారిత్రములు, విమలసాంఘికనియమములు, విశుద్ధవిజ్ఞానవిషయములు సవిమర్శముగ, సులభముగఁ దెలియునట్లు మహాపురాణములు, ఉపపురాణములు, ఇతిహాసములు, శాస్త్రములు మొదలగు నుత్తమగ్రంథములు వ్యాసాది మహర్షులచే సంస్కృతభాషను రచియింపఁబడియున్నవి. కాని, గీర్వాణభాషాప్రచారము తగ్గియున్న యిక్కాలమున మనయాంధ్రదేశమునం దట్టియుద్గ్రంథములు దుర్గ్రాహ్యములై నామమాత్రావశిష్టములై యున్నవి. కావున మిత్రసమ్మితములును, పురుషార్థచతుష్టయసంపాదకములును, భుక్తిముక్తిమార్గప్రదర్శకములును, సకలతత్త్వరత్నాకరములును, అవశ్యపఠనీయములును నగునిట్టిసద్గ్రంథములను సులభశైలిని వచనరూపమున నాంధ్రీకరించి యాంధ్రమహాజనులకుఁ గరతలామలకము లగునట్లు చేయుటకై యీయుద్యమము ప్రారంభింపఁబడినది.

ఇంతకుమున్ను ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయమువారు, ఇట్టియుద్దేశముతోనే అష్టాదశపురాణాంతర్గత మగుశివపురాణమున మొదటిరెండుసంపుటములనుమాత్రము తెలుఁగునఁ బ్రకటించియున్నారు. వారియనుమతి ననుసరించి యారెండుసంపుటములను ఈగ్రంథమాలికకుఁ బ్రథమ ద్వితీయకుసుమములుగా నంగీకరించి మంగళప్రదమును, శివతత్త్వప్రతిపాదకమును నగు నిమ్మహాపురాణమును ప్రప్రథమమున సంపూర్తి గావింప నెంచి యీమూఁడవభాగమును బ్రకటించితిమి.

ఈసనత్కుమారసంహిత యించుకంత పెద్దది యగుటచే అది యంతయు నిందు ప్రకటింప వలనుపడదయ్యెను. ఇందు మిగిలినభాగమును, వాయవీయసంహితలోని పూర్వభాగమును జేర్చి రాఁబోవు సంపుటముగాఁ బ్రకటింతుము. ఇది మూఁడుసంపుటము లగును.

ఇట్లే యింతటినుండి రెండుమాసముల కొకసంపుటముగా సంపుటము 1 కి 200—250 పుటలవంతున డెమ్మీసైజున పదునెనిమిది పురాణములను, ఉపపురాణాదులను గ్రమముగా వచనరూపమున నాంధ్రీకరించి సంవత్సరమున కాఱుసంపుటములుగాఁ బ్రకటించుచు నాంధ్రదేశమున మాయోపినకొలఁది భాషాసేవ నొనర్ప సంకల్పించితిమి.

కొందఱు మిత్రులయాలోచనము ననుసరించి చందాదారులకు సుకరముగ నుండునట్లు మనీఆర్డరుకమ్మిషన్ సయితము మేమే భరించి అన్నివ్యయములతోను ఒక్కొక్కసంపుట మొక్కొక్క రూపాయకు మాత్రమే చందాదారుల కందించునట్టు లేర్పాటునుగూడఁ జేసితిమి. కావున శివపురాణము మొదటిరెండవసంపుటములను గోరుచందాదారులకు పోస్టేజి మనీఆర్డరుకమ్మిషనులు మేమే భరించి రు 2-0-0 లకు మాత్రమే యిచ్చుచున్నాము.

ఇందులమాయుద్దేశము సాధ్యమైనంతవఱకు దేశభాషాసేవ సేయుటయు, మనపురాణధర్మములను మనవారు సులభముగఁ దెలిసికొనునట్లొనర్చుటయుమాత్రమే యని పాఠకమహాశయులు గ్రహింపకపోరని తలంచెదము.

ఇట్టిసదుద్యమములు దేశభాషాభిమానులగు నాంధ్రమహాజనుల నిరంతరసాహాయ్యప్రోత్సాహములవలనఁగాని నిరంతరాయముగఁ గొనసాగనేరవు. కాఁబట్టి యాంధ్రసోదరసోదరీమణు లెల్లరును మాసదుద్యమము నాదరించి చందాదారులుగను, సహాయులుగను, పోషకులుగను, రాజపోషకులుగను నుండుట కంగీకరించి మాకెల్లవిధములఁ జేయూఁత నొసగఁగోరుచున్నాము.

పురాణగ్రంథమాలిక
పిఠాపురము.

నడకుదుటి వీరరాజుపంతులు,
సంపాదకుఁడు.

# విషయసూచిక.

శ్రీయైనమః.

# శివపురాణము.

## సనత్కుమారసంహిత.

సర్వజ్ఞు విశ్వతోముఖు
సర్వేశ్వరు సర్వభూతసంభవహేతున్
శర్వు నభవు నపరాజితు
సర్వమయు భజింతు మిష్టసంసిద్ధులకున్.

వేదాదుల కాదిస్వరం బని చెప్పంబడినయోంకారమే మహేశ్వరస్వరూపము. సర్వమంగళమయుం డగునామహేశ్వరదేవుఁడే పంచభూతములమూలంబున నిఖిలజీవులను సృజియించును. ఆయాదిదేవుఁ డగునుమాపతి సర్వజ్ఞానసంపాదకుఁడు. పరమతత్త్వస్వరూపుఁడు. స్వయంప్రకాశుఁ డగునాపరమేశ్వరుఁడు తనమూర్తిత్రయవికారముల వలన నవతారసమూహమును సృష్టించుచుండును. అభవుండగునాతఁడు నిఖిలజీవరక్షణంబునకై తన్ను మూఁడుభాగములుగా సృష్టించుకొనును. భగవంతుం డగుమహేశ్వరుఁడు స్వయముగా నేకస్వరూపుఁడయ్యును బ్రహ్మాదిసంజ్ఞావశంబునఁ ద్రివిధంబుల విరాజిల్లుచుండును.

అవ్యయుం డగుశివుండు నిత్యముక్తుండు. మఱియుఁద్రిభువనహితాభిలాషి. ఆదేవుఁడు జ్వాలామయుం బగుమహాశూలము, భీమనాళనిసమూహము మొదలగుక్రీడాపరికరములచే యోగమాయతోఁ గ్రీడించుచుండును. అమ్మహాదేవుఁడు తాండవసమయమునఁ దనశరీరమునం దర్ధభాగమును బల్లిగాఁ జేసి జగంబులకు స్థితిని, లోకానుగ్రహంబును గావించుచుండును. నిరంతరశివచింతానిమగ్ను లగువారిహృదయముల కవిదితం బగునది యీజగంబునం దెద్దియును లేదు. కావుననే నేనును సర్వేశ్వరునియెడలం గలభక్తిబలంబుచేతనే తత్కథితం బగుశివపురాణమును జెప్పఁగలుగుచున్నాఁడను.

పూర్వము నాచేఁ జెప్పంబడిననైమిశారణ్యమునందలి పవిత్రాశ్రమంబునఁ గాలయోగవేత్తలలో నగ్రగణ్యుండును, జగద్గురుండును, దపస్వియు, బ్రహ్మచారియు, ధర్మాత్ముండును, సుబుద్ధియు, లక్షశ్లోకసమంచితమహాభారతప్రణేతయు, సత్యవతీనందనుండును, బరాశరతనయుండును, బ్రహ్మర్షియు నగువ్యాసభగవానుండు దేవగణపరివృతుం డగుబ్రహ్మదేవునివలెనే ఋషిగణపరివేష్టితుండై బ్రహ్మకథితంబును, బ్రహ్మపదప్రతిపాదకంబును, బ్రహ్మనామాభిహితంబును నగువేదమును జతుర్భాగములుగా విభజించి శిష్యులచే వేర్వేఱుగా నధ్యయనముసేయించుచుండెను. వారందఱును సుఖోపవిష్టులై యుక్తమసంభాషణంబులు గావించుచున్నయవసరంబున నచ్చటికధ్యాత్మధర్మాశ్రయుండును, బ్రహ్మపుత్త్రుండును, శుభనిదానుండు నగుసనత్కుమారుండేతెంచి పరమానుగ్రహంబున వారికి దర్శనం బిచ్చెను. అనంతరము ధర్మజ్ఞుం డగు నమ్మునివరుండు మహర్షు లర్పించిన యర్ఘ్యాచమనీయంబులను యథావిధిగఁ బరిగ్రహించి ప్రశంసితవ్రతుం డగు నాతఁడు వేదోక్తవిధిచే నాబ్రహ్మర్షులను బూజించెను. అనంతర మమ్మహర్షుల

యనుజ్ఞం గాంచి సనత్కుమారుండు కుశాసనంబున నాసీనుండై యుండెను. అప్పు డమ్మునులు లింగపూజావిధి, దేవదేవారాధనము, శివమందిరనిర్మాణఫలము, సంవత్సరవ్యాప్తం బగుశివపూజాఫలము, ఆవర్తకవిధి, పునరావర్తకవిధి, మూర్తివిభాగము, మంత్రవిధి, మహాత్ముండగురుద్రునియష్టస్థానములుమొదలగువిషయములంగూర్చి సనత్కుమారునిఁ బ్రశ్నించిరి. భగవంతుండును, బ్రహ్మనందనుండు నగుసనత్కుమారయోగీంద్రుండు తపోబలానురూపంబులగు నాసనంబులపై నుపవిష్టులైయున్న మునిగణంబులచేఁ బరివృతుండై బ్రహ్మర్షిపరివృతుండగువనజాసనుంబోలి యధికతేజోవిరాజితుండయ్యెను. అట్లు సాధుగణమధ్యస్థితుం డగుసనత్కుమారయోగీంద్రుంగూర్చి మహర్షు లందఱు నంజలిబద్ధులై యిట్లు ప్రశ్నించిరి.

## సృష్ట్యారంభవర్ణనము.

మహాత్మా! మేము నీవలనఁ బవిత్రంబును నవినశ్వరంబునగు శివపురాణమును వినఁ గుతూహలముతో నుంటిమి. మాకు శివచరిత్రమును బోధింపుము. త్రిభువనములయందలిసకలవిషయముల నెఱింగియున్న నీకుఁ దెలియని దేదియును లేదు. అనుటయు బ్రహ్మపుత్త్రుండగు సనత్కుమారుండు బ్రహ్మర్షిగణంబులచే నిట్లు ప్రార్థింపఁబడి యిట్లని చెప్పందొడంగెను. మునివరులారా! వినుఁడు! దేవతాదుల యెదుటఁగూడ గోపనీయం బగు నీసనాతనశివపురాణమును నేనిప్పుడు యథార్థరూపమున ననువదించెదను. సాధుజను లీపురాణశ్రవణంబు గావించి శివునియందుఁ జిత్తసమర్పణంబు సేసి శివపరాయణులును, శివచింతానిమగ్నులు నై విశేషరూపమునఁ గృతార్థు లగుచుందురు. వేదతుల్యంబగునీపురాణ మతిపవిత్రంబును, యశస్కరంబును, నాయురారోగ్యకరంబును, స్వర్గప్రదంబును, సర్వాభీష్టదాయకంబు నైనది.

దేవదేవుం డగుమహేశ్వరుని సంకీర్తనము పరమమంగళజనకంబును, విశేషించి శ్రద్ధావంతు లగువారి కైహికాముష్మికశుద్ధివిధాయకంబు నై యున్నది. తపోధనులారా! నేనిప్పుడు పరమార్థానుసారంబుగ నమ్మహాదేవునిచే భాషింపఁబడినశివపురాణమును మీయెదుట సంకీర్త నంబు గావించెదను. తొల్లి నేను సర్వజ్ఞుం డగు దేవదేవునింగూర్చి వినిన దంతయును సంక్షేపముగ ననువదించెదను. ఏమనిన—నూఱేం డ్లకైనను దీనిని సవిస్తరముగఁ జెప్పఁజాలము. ఇందు బ్రహ్మవిష్ణూత్ప త్తియు, హరివిరించిసంవాదంబును, సప్తద్వీపంబులయు సప్తవర్షంబు లయు నాఖ్యానంబును, నూర్ధ్వాధోలోకకధనంబును, సూర్యచంద్రాది గ్రహవిషయంబును, సనత్కుమారవిక్రమంబును, దదారాధితుం డగు మహాదేవుని వర్ణనంబును జెప్పంబడును. మఱియు వరదానసంబంధం బును, మునిశిష్యసమాగమంబును, మేరుశృంగంబున బ్రహ్మవిష్ణు మహేశ్వరభవనంబులును, రుద్రవిభీషణసంవాదంబును, సకలతీర్థఫలం బును, శివలింగపూజనంబును, శివలింగోత్పత్తియుఁ, దల్లింగంబునుండి ప్రళయోత్పత్తియు, లింగపూజావిధానంబును, వర్షవ్యాప్తం బగుమహా దేవార్చనంబుచేఁ గలుగునుత్కృష్టఫలంబును, ఆవర్తనప్రవరావర్తనాది వ్రతవిధియు, ముక్తిభేదానుసారంబుగ మహాదేవపూజావిధానంబును, మహేశ్వరుని స్థానరూపాదులప్రాధాన్యంబును, పరమాత్ముం డగు శివునిపరమదివ్యతత్త్వంబును, నతిపవిత్రరహస్యంబును, శివాష్టకంబును, బ్రహ్మవిష్ణుసమ్మోహనంబును, లింగస్థాపనఫలంబును, బుష్పదాన ఫలంబును, ధూపవిధియు, మాసఫలంబును, నుపవాసనియమంబును, నుత్తమదానవిధియు, అష్టమీచతుర్దశీవ్రతాదులయనుష్ఠానఫలంబును, నామాష్టమీవిశిష్టాష్టమీవ్రతఫలంబును, నతిలోకవిజ్ఞానసంపన్నుండగు మహేశ్వరునివిభూతియు, విశుద్ధాచారవిధియు, నుత్తమయోగవిధియు,

యోగనాడీకథనంబును, గాశీధామమమాహాత్మ్యంబును, నోంకారదర్శనంబును, యక్షేశ్వరమాహాత్మ్యంబును, దీర్థవర్ణనంబును, నందీశ్వరుని శివారాధనంబును, సంద్యాభిషేకంబును, మహాదేవమాహాత్మ్యంబును, త్రిపురాసురవధయు, శ్రీకృష్ణదేవమాహాత్మ్యంబును, శ్రీకృష్ణారాధనంబును, సకలధర్మాశ్రియుం డగుమహాదేవునిసంకీర్తనంబును, జ్ఞానప్రశంసయుఁ, బరమంబగు మోక్షవిచారంబును, వస్తువిచారంబును నీమొదలుగాఁగలయెల్లవిషయంబులను వరుసగా వర్ణించి చెప్పెదను. నేనిప్పుడాశ్చర్యజనకం బగుమహేశ్వరము క్తివిభాగమును సవిస్తరంబుగ సంకీర్తనంబు గావించెదను—

ప్రథమమం దీవిశ్వ మంతయు నజ్ఞానంబును, నలక్షణంబును, నంధకారమయంబునై యుండెను. అందు సర్వాకారణుండును, మహాయోగీంద్రుండు నగురుద్రుం డేకమాత్రుండై యుండెను. ఆపరమేశ్వరుండు స్వయంబుగ నాత్మభావనంబు గావించి తనయిచ్ఛానుసారంబుగ మొట్టమొదట మనంబును, దరువాత నహంకారంబును సృజియించెను. అహంకారమునుండి పంచభూతంబులు నుత్పన్నంబు లయ్యెను. శబ్దస్పర్శరూపరసగంధంబులును, ప్రాణాపానవ్యానోదానసమానాదినాయువులును, సత్వరజస్తమోగుణంబులును, నాభగవంతుం డగురుద్రునుండియే సంభవించెను. బ్రహ్మయు, విష్ణుండును నాతనియందే జనియించిరి. బ్రహ్మవిష్ణువిమోహనార్థంబుగా శివుఁడే మహాత్స్వరూపంబుగా సంభూతుం డయ్యెను. నిరాకారుం డగుశివుం డుత్పత్తిశూన్యుండు. ఆతనికిఁ గారణు లెవ్వరును లేరు. ఆతనికంటె నధికులుగాని, మంగళకరులుగాని మఱియెవ్వరును లేరు. హరిబ్రహ్మలాతనినుండియే జనించి ప్రతికల్పంబునను జగన్మోహనంబు గావించి సకలంబును సృష్టించుచుందురు. తచ్ఛ్రేష్ఠుం డగునడుమ జనేకవిధ

బుల నఖిలజీవసంహారంబు సేయుచుండును. డెబ్బదియొక్కయుగం బులు మన్వంతరం బనంబడును. పదునాల్గుమన్వంతరము లొకకల్పం బు. ఇట్టియొకకల్పంబు బ్రహ్మ కొక్కదివం బగును; మఱియొక కల్పంబు రాత్రి యగును. ఈవిధముగా ముప్పదిదినంబులు బ్రహ్మ కొకమాసంబును, నిట్టిపండ్రెండుమాసంబు లొకవత్సరంబు నగును. ఇట్లు బ్రహ్మయువు శతవర్షంబులు. ఇట్టిశతవర్షంబులును మహాదేవున కొక్కనిమేషం బగును. బ్రహ్మమొదలుగ నల్పకీటంబువఱకును గల సకలజీవాయువులును నమ్మహాదేవునినిమేషమధ్యమునందే యిమిడి యున్నవి. సర్వగ్రహంబులయు, సర్వదేవతలయు జీవనంబులుగూడ నింతలోనివే. స్థావరజంగమస్వరూపంబును, సప్తలోకాత్మకంబు నగు నీవిశ్వ మంతయుఁ బరమేశ్వరుని నిమిషలీలామాత్రంబు. భూలో కము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, సత్య లోకము, బ్రహ్మలోకమునను నీసప్తలోకంబులకును, సుతలము, తలము, తాలము, వితలము, పాతాళము, రుక్మసౌవర్ణికము, శర్కరాభూమి, విజయము నను నీయష్టవిధపాతాళంబులకును నాదిమధ్యాంతరంబులయం దు రుద్రుం డవస్థితుండై యుండును. మహేశ్వరుండు తనక్రీడార్థమై యీలోకములను సృష్టించి యున్నాఁడు. బ్రహ్మలోకపరిమాణగతివిశే షంబుల ననంతరంబు వర్ణించెద. పృథివియు, నంతరిక్షంబును, దిక్కు లును, విదిక్కులును, బర్వతంబులును, సముద్రంబులును, స్థావరంబు లును, జంగమంబులును, దేవతాసమూహంబును, జతుష్పాదద్విపాద సమూహంబును మొదలగువానిపరిమాణంబులఁ జెప్పెదను. స్థావరం బులపరిమాణంబు సహస్రగుణాధికంబు; తక్కినవాని పరిమాణంబు క్రమంబుగఁ బాదపాదహీనంబు. సర్వజ్ఞుండును, స్వయంభువు నగు నీశ్వరుం డీదేవమానవాదులకంటెఁ బరుండు. ఈదేవమానవాదులకు

శివభక్తిమూలంబున యథాసమయంబున, యథోచితంబుగ బ్రహ్మ సాక్షాత్కారం బగుచుండును. అవ్యయం బగుశివస్వరూపజ్ఞానము నుండియే లోకంబునఁ గర్మప్రవృత్తి యగుచున్నది. అట్టిజ్ఞానంబును గూర్చియే యెల్లరును నమస్కరించు చుందురు. ఉత్పత్తివిహీనుం డయ్యు నుత్పన్నసంజ్ఞకుండును, గుణాతీతుండును, నిర్మలుండును నగు శంకరునుండియే జ్ఞానం బుత్పన్నం బగుచున్నది. శ్రోత్రకాములగు మహర్షులకును, భక్తులకును, సకలజీవులకును, విశేషించి బ్రహ్మపరా యణులకును హితార్థమై మహేశ్వరునిచేఁ జెప్పఁబడినయీజ్ఞానము పురాణములయందు సవిస్తరముగా వర్ణితమై యున్నది. ఈశ్వరుండు తన కిష్టసాధనేచ్ఛగలిగినప్పుడు సృష్టికార్యంబునఁ బ్రవృత్తుం డగుచుం డును. నే నాదిమధ్యాంతస్థితుండ ననుజ్ఞానముతోనే యవ్యయుండును, బురాణపురుషుండును, నేకమాత్రుండు నగుశివుండు బ్రహ్మాండలీలలఁ గావించుచుండును. ఆయీశ్వరునుండియే కాలం బుత్పన్నం బయ్యెను. ఈవిశ్వం బంతయును గాలస్వరూపమే. ఇందు గాలవ్యతీతం బగున దేదియును లేదు. భగవంతుం డగుకాలుండు ధ్యాననిమగ్నుండై శివాజ్ఞానుసారంబుగ సృష్టికార్యంబునకు సంకల్పించి ప్రప్రథమంబునఁ బ్రకృతిదేవిని సృజియించెను. ఆప్రకృతినుండి బ్రహ్మయు, విష్ణుండు నుదయించిరి. అనంతరము బ్రహ్మదేవుండు మహేశ్వరాదేశంబున బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులను సృజియించెను. మఱియు, భూమి, అంతరిక్షము, సముద్రములు, శైలములు, దిక్కులు, మానవులు, నదులు, తీర్థములు, మెఱుములు, ఉఱుములు, రోహితములు, ఇంద్ర ధనుస్సులు, ఉల్కలు, ధూమకేతువులు, జ్యోతిష్పాతములు, సహస్రా ధికవిధంబు లగుస్వేదజంబులు:-యూకమక్షికమత్కుణములు మొదలగు వానిని సృష్టించెను. ఇట్లుత్పన్నం బైనయీసకలంబును మరలఁ గ్రాలు

నిచే నిర్మితంబగుచుండును. అనుటయు వ్యాసుండు బ్రహ్మ యెట్లుదయించెనో, సృష్టి యెట్లయ్యెనో, పృథ్వీధరుం డగు దేవునకు బ్రహ్మత్వం బెట్లుసిద్ధించెనో సవిస్తరంబుగఁ దెలుపవలయు ననుటయు సనత్కుమారుండు మరల నిట్లనియెను.

ప్రథమమునందీసకలంబు నంధకారమయంబై, యేదియు నప్రత్యక్షంబై యుండెను. అప్పుడు పరమేశ్వరుం డగుశివుండు యోగావలంబనంబున నెల్లయెడలఁ గ్రీడింప సంకల్పించి దుర్లభం బగుసత్త్వస్వరూపతేజంబును సృజించి తనయందున్న రజోగుణస్వరూపం బగు వహ్నిచే ధారణంబు గావించెను. ఆసత్త్వగుణసహితం బగురజోగుణంబువలనఁ దమోగుణం బుత్పన్నం బయ్యెను. ఆగుణత్రయమువలన జలంబును, దానినుండి పృథ్వీతన్మాత్రయు, దానినుండి సూర్యస్వరూపుఁ డగుకాలుండును నుదయించిరి. ఆసూర్యతేజమునందే సర్వంబును బ్రకాశితం బయ్యెను. మహేశ్వరుఁడు ప్రథమంబున జలస్వరూపియై యాతమంబును విదారితంబుఁ గావించెను. అప్పుడు సృష్టిప్రవృత్తుం డగుజలరూపశంకరునుండి యొకయండంబును, దానినుండి నారాయణుండు నుదయించిరి. మఱియు నాజలానలసంయోగంబున వాయుతేజంబు లుత్పన్నంబు లయ్యెను. వికృతం బగువాయువువలన నాకాశంబును, జలాగ్నిమారుతాకాశంబులనుండి విశాలం బగుపృథ్వియు సంభవించెను. ఇదియే మహేశ్వరుని యన్యతమమూర్తి. మహాభూతసృష్ట్యనంతరమున మహాదేవుం డర్ధనిమేషకాలము జలంబులఁ బ్రవేశించెను. జలనివాసంబువలననే యాతనికి నారాయణనామంబు గలిగెను. అప్పు డాజలంబులనుండి సహస్రసూర్యప్రభావంతంబును, సువర్ణమయంబు నగునొకయండం బుదయించెను. భగవానుం డగుబ్రహ్మదేవుండు దానియందు బహువత్సరంబులు వసియించి యనంతరము

మహాదేవాదేశంబున యథాకాలంబున నావిర్భూతుం డయ్యెను. అనంతర మాతఁడు సృష్టికాలమధ్యంబున నాకాశంబును, అష్టదిక్కులను, నిత్యజలాధారంబు లగుసాగరంబులను సృజియించెను.

## సప్తద్వీపవర్ణనము.

ప్రకృతినుండి యవ్యక్తం బగుమహత్తత్త్వ ముదయించెను. మహాజసం బగునదియే బ్రహ్మాండస్వరూపము. మహత్తునుండి బ్రహ్మ యుదయించుటచే దానికి బ్రహ్మాండనామంబు గలిగెను. ఆబ్రహ్మకు సముద్రసమూహము శోణితము ; ఆకాశం బుదరంబు ; పవనంబు నిశ్వాసంబు , ఆకాశతిమంబులు శ్రోత్రంబులు ; చంద్రసూర్యులు నేత్రంబులు; ఊరుయుగళంబు సుమేరువు, పృథ్వి వక్షస్థలంబు—రసాతలంబునకువెనుక జలంబును,దానివెనుక నాగగణంబును, దదనంతరము మరల నాకాశంబును, దానివెనుక మరల జలంబును, జలాంతంబున నంధకారంబును, దానివెనుక నగ్నియు, దానివెనుకఁ బృథ్వియుం గలవు. ఈపృథ్వి సముద్రంబులు, నంధకారము, తేజము, జలము, రసాతలము, నాగగణము, నంధకారము ననుసప్తపదార్థంబులచేఁ బరివృతంబై యున్నది. అండధారణంబగుటంజేసి మహాత్ముం డగుబ్రహ్మదేవుని భవనము బ్రహ్మాండం బనియు, మహాధారణంబనియుఁ జెప్పంబడుచున్నది. ప్రధానపురుషునిచే సృజింపఁబడినదగుటచే జలంబునకు నారంబను పేరు గలిగెను. పూర్వమం దాజలంబుల వసించుటచేతనే పురుషోత్తమునకు నారాయణనామంబు గలిగెను. ఈవిశ్వంబున క్షరుండును (జీవుఁడు) నక్షరుండు (ఆత్మఁడు) నను నిరువురే పురుషులు. బహుసహస్రయుగపరిమితంబు లగునేకకల్పంబులు గడచినవెనుకనే భూరాది లోకసృష్టియైనది. అనంతరము పంచభూతాత్మకం బగుజీవసృష్టియయ్యెను. జరాయుజములు, అండజములు, ఉద్భిజ్జములు, స్వేదజములు

నని జీవులు చతుర్విధంబులు ; దేవయోను లష్టవిధంబులు. మనుష్యయో నేకవిధమాత్రుడు. మానవజాతి యేకప్రకారంబయ్యును జతుర్వర్ణ భేదంబుచే నానావిధంబులఁ దోఁచుచున్నది. పృథివియు, నాకాశంబును, స్వర్గంబు ననునివి భువనంబులు. నదులు, సముద్రంబులు, పర్వతంబులు మొదలగుస్థావరజంగమపదార్థంబుల పరిమాణంబునకు భూపరిమాణంబు సమానంబు. మఱియు దివ్యంబగుభువనం బొకటి కలదు. దానిని మూఁడుభాగములుగ విభజించుకొని దేవత లందు నివసించియుందురు. ఆత్రిభువనంబులును గోటియోజనవిస్తీర్ణంబులు. ఆభువనమధ్యంబున నుండి బ్రహ్మయు, విష్ణుండును మహేశ్వరోపాసనంబు గావించుచుందురు. శివక్రీడాస్థానంబులు స్వయముగా శివునిచేతనే కల్పింపఁబడియెను. ఆయాస్థానంబులయందు శివలింగపూజ గావించుట సర్వోత్తమకార్యంబు. సార్ధపంచాశీతి (8550) శతయోజనవిస్తీర్ణం బగుజంబూద్వీపము మొదలగుద్వీపంబులయందలి జీవులు తమయభీష్టసాధనంబునకై శివపూజలం గావించుచుందురు. ఆపరమేశ్వరుండు జంబూద్వీపంబున మహాదేవనామంబునను, గోమేదద్వీపమున గిరిజేశ్వరనామంబునను, శాల్మలిద్వీపమునఁ బశుపతినామంబునను, కుశద్వీపంబున హరనామంబునను, క్రౌంచద్వీపంబునఁ వృషధ్వజనామంబునను, శాకద్వీపంబున శంకరనామంబునను, పుష్కరద్వీపంబున ఫాలలోచననామంబునను, విఖ్యాతుండై యుండును. ఆయాద్వీపములం దాయానామంబులతో శివపూజం గావించినచో శివానుగ్రహంబున నక్షయభోగంబులును, మహాపదవీప్రాప్తియు నగును.

జంబూద్వీపము, గోమేదద్వీపము, శాల్మలిద్వీపము, కుశద్వీపము, క్రౌంచద్వీపము, శాకద్వీపము, పుష్కరద్వీపము ననునివి సప్తద్వీపంబులు. జంబూద్వీపంబు లక్షయోజనంబులవఱకును జంబూ

వృక్షంబులు వ్యాపించియుండును. వానిఫలంబులరసం బమృతమువలె రుచికరమైయుంది. ఆజంబూవనంబునకు ద్విగుణపరిమాణంబగు నాద్వీపము లెనపరిమాణంబునకు ద్విగుణితం బగులవణసముద్రముచే నావరింపఁబడి యున్నది. జంబూద్వీపమున సప్తవర్షంబులు (ఖండములు) గలవు. పుణ్యాత్ము లగువా రిచ్ఛామాత్రంబున సప్తవర్షంబులను గమనాగమనంబులు సేయఁగలుగుచుందురు. ఆవర్షసప్తకంబున భారతవర్షంబు ప్రధానంబు. భారతవర్షముకూడఁ దొమ్మిదిభేదంబులచే నొప్పారుచున్నది. దానికి సప్తకులపర్వతంబులును సప్తవర్గంబులు. ఇవి మధ్యమవర్షంబునకుఁ బూర్వపశ్చిమంబుల విరాజిల్లుచున్నవి. భారతవర్షంబునకు దక్షిణంబున నపసవ్యముగా నిలావృతవర్షంబు (క్రౌంచవర్షము) గలదు. అది యుత్తరదక్షిణంబుల నిందధనురాకృతిం గలిగి ద్రోణరూపభూవిన్యాసంబుగలవర్షచతుష్టయంబుచే విరాజిల్లుచున్నది. హిమవర్షంబును, రమ్యవర్షంబును, క్రౌంచవర్షంబును, భవవర్షంబును, గిరివర్గంబును, భారతవర్గంబును, గింపురుషవర్షంబునునివి సప్తవర్షంబులు. భారతవర్షంబునకుఁ బూర్వభాగంబున మాల్యవంతంబును, బశ్చిమంబున గంధమాదనంబు ననుపర్వతంబులు గలవు. పిమ్మటఁ జతుర్ద్వారసహితంబును, జతురస్రంబు నగుమధ్యమమండలంబుగలదు. సుమేరుశృంగంబున నుత్తరంబుగా నీలశ్వేతంబులగు పర్వతరాజంబు లంతటను వ్యాపించి యున్నవి. కాలజ్ఞానవిశారదులగువా రీశైలంబులను సహస్రసంఖ్యగాఁ బరిగణించి యున్నారు. జంబూద్వీపంబున జంబూఫలరసమయం బగుజలంబున దేవభూషణంబగు కాంచనం బుత్పన్న మగుచున్నది. దాని నుత్తరంబున మేరునామకంబగు మహామహీధరంబు గలదు. అది యాద్వీపంబునకు మధ్యభాగంబునఁ గర్ణికవలె విరాజిల్లుచున్నది. అమ్మహాశైలంబు చతురశీతిసహస్రయోజనంబుల (84000)

పొడవు గలిగి పాదప్రదేశంబున దశసహస్రయోజన (10,000) పరిమితంబై, పార్శ్వప్రదేశంబుల షడ్వింశతిసహస్ర (26000) యోజనపరిమాణంబు గలదై యుండును. ఆమేరువును బ్రదక్షిణించి పోయినచో దానివెనుకనే కైలాసపర్వతంబు గలదు. ప్రకృష్టం బగునాపర్వతంబు చతురశీతియోజనంబుల (84) వ్యాసముగలదై యుండును. అందలి చిత్రసానువులయందుఁ గాని, కందరంబులయందుఁ గాని, దరులయందుఁగాని సూర్యసంతాపము గలుగ నేరదు, చంద్రతారాప్రకాశము వ్యాపింపనేరదు. ఆగిరిప్రభావంబుఁ [illegible] వర్ణింపఁజాలఁడు. జితక్రోధులును, జితలోభులును, జితేంద్రియులును, జితక్లములును, శివచింతానిమగ్నులును, శివపూజాపరాయణులు నగు పుణ్యాత్ములుమాత్రమే యాపుణ్యశైలమునఁ బ్రవేశింపఁగలుగుదురు. స్వధర్మపరాయణులగు గృహస్థులును, గోబ్రాహ్మణహితక్రియానిరతులు నగువారు పరమేశ్వరానుగ్రహంబున నీకైలాసధామంబును జేరుచుందురు.

ఈకైలాసంబునకు దక్షిణంబున శతసహస్ర యోజన (1,00,000) విస్తీర్ణంబులును, పంచవింశతిసహస్రయోజనోన్నతంబులు నగునీలనిషధహేమకూటహిమవంతంబులు వ్యాపించి యున్నవి. పశ్చిమంబునఁ బర్వతత్రయసంభూతం బగుసింధునది ప్రవహించుచుండును. పూర్వభాగంబున నలిని, హ్లాదిని, ప్లావిని యనునామంబులచే మూఁడునదులు ప్రవహించుచుండును. జంబూద్వీపంబునఁ బ్రధానంబైనది గంగానది. అది యన్నినదులకంటెను బవిత్రంబైనది. ఆగంగానది శతసహస్రంబులగునుపనదులచే విలసిల్లుచున్నది. ఈభూమియందు గంగానదీసమానంబులగుపవిత్రతీర్థములును, బర్వతంబులును, బరమపావనంబు లగు దేవతీర్థంబులును గూడఁ గలవు. వానిం

గూర్చి యనంతరము వర్ణించెదను. ఇప్పుడు జంబూద్వీపయథార్థస్వరూపమును వర్ణించితిని. ఇఁకఁ దక్కినయాఱుద్వీపంబులంగూర్చియుఁ జెప్పెదను. అవియాఱునుం గలసి జంబూద్వీపపరిమాణంబునకు ద్విగుణపరిమాణంబు గలవై యుత్తరదిగ్భాగంబున విలసిల్లుచున్నవి. జీవులు స్వర్గభోగంబుల ననుభవించి యనంతర మవశిష్టపుణ్యఫలభోగార్థమై యీద్వీపంబులయందుఁ బ్రవేశించుచుందురు. లవణము, ఇక్షురసము, సుర, సర్పి, దధి, క్షీరము, శుద్ధజలము ననునీసప్తసముద్రంబులును ప్రత్యేకముగ సప్తద్వీపంబులను బరివేష్టించి యుండును. ఈవిశ్వంబునందు సహస్రసహస్రద్వీపంబులు మన కవిదితంబులై యున్నవి. ఈసప్తద్వీపములనుమాత్రము నేను సంక్షేపముగా వర్ణించుచున్నాను. ఈ సకలద్వీపవిషయంబులను నూఱేండ్లకయిన సవిస్తరంబుగఁ జెప్పఁజాలము. ప్లక్షద్వీపంబునఁ బ్లక్షవృక్షంబును, శాల్మలిద్వీపంబున శాల్మలివృక్షంబును, కుశద్వీపంబునఁ గుశగుచ్ఛంబును, క్రౌంచద్వీపంబునఁ గ్రౌంచపర్వతంబును, శాకద్వీపంబున శాకవృక్షంబును, పుష్కరద్వీపంబునఁ బుష్కరవృక్షంబును గలవు. ఈద్వీపంబులఁ గలవృక్షంబులన్నియుఁ బరిమాణంబున నుత్తరోత్తరద్విగుణితంబులై యుండును. ఆవృక్షంబుల ఫలరసం బమృతోపమానంబు. తదాస్వాదనంబు దీర్ఘాయుష్కరంబు. ఆద్వీపంబులయందు జరారోగశోకాయాసంబు లేమియును లేవు. ఆషడ్ద్వీపంబులవారును నిత్యయౌవనులై యుందురు. వారు యౌవనముతోనే జననమరణంబులఁ గాంచుచుందురు. వారికి యౌవనావస్థకంటె నితరావస్థానుభవము లేనేలేదు. అందలిసతీమణులు చక్రవాకసధర్మిణులై యాత్మేశ్వరులకంటె నన్యులయెడఁ బ్రియత్వంబు నపేక్షింపకుందురు. అందలిభూమి మణిమయమైనది, వాలుకాప్రదేశము కాంచనరజోమయమైనది. అచ్చటివృక్షంబులు సర్వకాలంబుల

యందును బుష్పసుగంధఫలాశ్రింబులై యుండును.

ఈసప్తద్వీపములయందును సప్తకులాచలంబులు గలవు. ఆకుల పర్వతంబులఁ బరివేష్టించి శతిసహస్రింబులగు నదులును నుపనదులును బ్రివహించుచుండును. ఆపర్వతరాజంబులఁ బరివేష్టించి శృంగవంతంబు లగు ననేకమహీధరంబు లంతటను వ్యాపించియుండును. వానియందు విద్యాధరులును సిద్ధులును, మహర్షులును, గంధర్వులును, దానవులును, విహంగులును, నురగులును, యక్షులును విహరించుచుందురు. పర్జన్యుం డందు వర్షింపఁజాలఁడు. అందు గాలవిపర్యయంబు లేదు. కాని కల్పాంతంబునందుమాత్రిము వానికిని నాశంబు గలదని మహాదేవుండు చెప్పియున్నాఁడు. ఆద్వీపంబులయందలి పర్వతపంక్తులు నిజప్రిభావంబుననే సముజ్జ్వలంబులై యుండును. ఇఱువదివేలపర్వతంబులు మాలికారూపంబున నందలికులపర్వతంబులచుట్టును బరివేష్టితంబులై యుండును. అవిగాక యింకను సహస్రిసహస్రాధికంబులగు పర్వతంబు లందుఁగలవు. అవి గణనాతీతంబులు. అందు శుక్లదంతులును, బ్రియంవదులు నగుపురుషులు విరాజిల్లుచుందురు. వారల కెట్టిదుఃఖాయాసంబులును లేవు. వారి నెవ్వరును బీడింపఁజాలరు. ఆద్వీపంబులయందు జనించినపురుషులు తపోధనులును, దీర్ఘాయుష్మంతులు నై యుందురు. వారికిఁ గామగమనంబు గలదు.

ఇఁక జంబూద్వీపంబునఁ గాలపరిమాణంబు వర్ణించెదను. కృ త యు గం బు ను, త్రే తా యు గం బు ను, ద్వా ప ర యుగంబును, గలియుగంబు ననునివి చతుర్యుగంబులు. మానవాబ్ద సంఖ్యచే నీసకలయుగపరిమాణంబును బురాణవాక్యానుసారంబుగఁ జెప్పెదను. పదునేడులక్షలయిరువదియెనిమిదివేలవత్సరంబులు గృతయుగంబునకును, బండ్రెండులక్షలతొంబదియాఱువేలవత్సరంబులు త్రేతాయుగం

బునకును, ఎనిమిదిలక్షలయెనిమిదివేలవత్సరంబులు ద్వాపరయుగంబున
కును, బదిలక్షలయిరువదియెనిమిదివేలసంవత్సరంబులు కలియుగంబున
కును బరిమాణంబులు. ఈరీతిగా డెబ్బదిరెండుయుగంబులకొకమన్వం
తరం బగును. పదునాలుగుమన్వంతరంబు లొకకల్పంబు. ఇట్టికల్పం
బులు రెండైనచో బ్రహ్మ కహోరాత్రిసమన్వితం బగు నొకదినం
బగును. అట్టి దినపరిమాణానుసారంబుగా శతవత్సరంబులు బ్రహ్మ
యుష్కాలం బని నిర్దిష్టంబయ్యెను. బ్రహ్మయుష్కాలము మహేశ్వ
రున కొకనిమిషమాత్రంబు. ఈశ్వరుండు తననిమిషమధ్యంబుననే
బ్రహ్మమొదలు సూక్ష్మకటంబవఱకును గలసకలజీవులను సృజించు
చుండును. ఆసృష్టియంతయు నాదేవునినిమిషమధ్యముననే నశించు
చుండును. చంద్రసూర్యాదిగ్రహగణంబులజీవితంబులుగూడ నట్లే—
మహాదేవునినిమేషకాలము మహాకల్పనామంబునఁ బ్రసిద్ధంబు:-ఇప్పుడు
ద్వీపవర్షంబులంగూర్చి సంక్షేపంబుగఁ జెప్పితిని. ఇతరద్వీపంబులవివి
ధావస్థలంగూర్చియుఁ దెలిపితిని. అందు భారతవర్షము నవఖండసమ
న్వితంబని చెప్పితిని. ఇంద్రద్వీపము, కశేరువు, తామ్రపర్ణము, గభ
స్తిమంతము, నాగద్వీపము, సౌమ్యము, గాంధర్వము, చారణము,
స్వాదూదకము, నను నివి నవఖండంబులు. అందు నవమంబగుస్వా
దూదకద్వీపము సాగరంబున కుత్తరతటంబున మహత్తరమై విలసిల్లు
చున్నది. అది పృథ్వి కాదిభూతంబగుటచే సర్వశ్రేష్ఠము. పృథ్వికి
ద్విగుణపరిమితంబు లగులోకాలోకపర్వతంబులు భూమిచుట్టును బరివే
ష్టించి యున్నవి. ఆస్థానముండియే లోకపరిమాణంబును, లోకవి
స్తారంబు నగుటంజేసి వానికి లోకాలోకపర్వతనామంబు గలిగెను.
అచ్చటిజీవులు మనస్సిద్ధిసంపన్నులును, నీరోగులును, చిరజీవులును,
సువర్ణమయసుందరాకారులు నై యుందురు. సముద్రాధిదేవతలును,

దిక్పాలురు నాపర్వతంబులపై నుందురు. ఈలోకాలోకపర్వతసహితం బుగా భూపరిమాణంబు త్రిగుణంబు.

## —♦ పాతాళవర్ణనము. ♦—

ఇఁకఁ బాతాళంబునుగూర్చి వర్ణించెదను. పాతాళంబున వివిధ రత్నసంశోభితం బగుభోగవతీనామకసుందరనగరంబు గలదు. అందు పరమానందంబున నాగరాజగణంబు నివసించి యుండును. మఱియు సిద్ధగణంబులును, భరతాదిమునిగణంబులును, వాసుకి, తక్షక, కర్కోటక, ధనంజయ, కాళియ, పవన, పూరణ, మణిమాల, భద్ర, కౌశిక, వసు, ధుందుమార, కంబళ, అశ్వతర, తిత్తిరి, హరిభద్రి, బలాహక, కరవీర, పుండరీక, సంవృతాదినాగగణంబులును, అనంతాది నాగరాజగణంబులును నందు నివసింతురు. ఆనగరంబు విచిత్రంబు లగుధ్వజసహస్రంబులచేఁ బరిశోభిత మైయుండును. అందమూల్యవసనభూషణాలంకృతలును, బరిపూర్ణమనోరథలు, నప్సరస్సుందరీసమానలు నగుయువతీమణులు నిరంతరమును, హాస్యనాట్యగీతావాద్యవిలసితలై యుందురు. ఆభోగవతీనగరప్రజలకు జరాశోకసంతాపంబులు లేవు. పరస్పరాసూయాభయంబులు లేవు. అందలివారందఱు నన్యోన్యసాహాయ్యనిరతులును, బ్రహృష్టహృదయులును, మనోరథసిద్ధులునై యుందురు. ప్రభామయం బగునానగరంబునకుఁ, జతుర్దిశలను వజ్రవైడూర్యాదిమణిమయప్రదేశంబులు నింద్రనీలమహానీలరత్నాదులచే నలంకృతంబు లగుస్వర్ణమయస్తంభసహస్రంబులు విరాజిల్లుచుండును. అందలినదులు నిరంతర జలప్రవాహపరిపూర్ణంబులు. పాయస కర్దమకలితంబులగుకృత్రిమనదులును, ఘృతపూర్ణంబులగుకుల్యలును, కుందేందుచంద్రసన్నిభంబు లగు నన్నపర్వతంబులు, నిరంతరపుష్పఫల శోభితంబు లగువృక్షంబులు నందు విరాజిల్లుచుండును. అందలిబహు

జలాశయంబులు దుగ్ధపూర్ణంబులును, మధుపూర్ణంబులు నై యుండు. తాంబూలరాగాధరలును, ప్రియంవదలు నగునచ్చటియువతీమణులు తఱచుగ భర్తృభోగినులయ్యు నక్షతలై, బహుప్రసూత లయ్యును నిత్యయౌవనలై యుందురు. అచ్చటిపురుషులు సర్వదా నిజభార్యాను రక్తులు. పారదార్యము వారెఱుఁగనే యెఱుఁగరు. సర్వాభీష్టసిద్ధు లగునాత్మీయులతోఁ గూడియుండు నందలిస్త్రీపురుషు లూర్ధ్వతిర్యగ్గ తులు గలిగి యుందురు. ఆనాగలోకమునం దొకభాగము కోటియో జనంబులవ్యాసంబు గలిగియుండును. నాగలోకంబంతయు దానికి ద్వి గుణప్రమాణంబు.

ఇఁక హిరణ్యపురముంగూర్చి చెప్పెదను. హిరణ్యపురంబు కోటియోజనంబులచే జతురస్రంబై యుండును. అందు నిరంతరపుష్ప సుగంధవిలసితంబులును, ఫలసహితంబులు నగుననేకోద్యానంబులును, విచిత్రశబ్దకలితంబులగు ననేకపర్వతకందరంబులును గలవు. అందలి రమణీమణులు మధురభాషిణులును, సుకుమారిణులును, నిత్యయౌవన లునై యుందురు. పురుషులు రూపసంపన్నులును స్వదారనిరతులు నై యుందురు. అందు సుధాధవళితంబులగు కుడ్యంబులచే నలంకృ తంబు లగుస్వర్ణమయమందిరమ్ములు గలవు. అందలిజీవు లందఱును విమానచారులును, స్థిరయౌవనులు నై యుందురు. అవికలాంగులును, శుక్లదంతలును, శుక్లాంబరలును, చంద్రికాసమానశుక్లవర్ణలును, అప్స రస్సమానసుందరీమణులు నగునందలిరమణీమణులు చక్రవాకసధర్మిణు లై యుందురు. ఉద్వేగంబును, నీర్ష్యయు, గోపంబును, నసూయయు వారి కెంతమాత్రమును లేవు. ముక్తామణీమాలికావిశిష్టంబును, సురు చిరబహిర్ద్వారశోభితంబు నగునప్పురమ్మునఁ దత్సుందరీమణులు నిరతా నందులగు సిద్ధులంగూడి యానందానుభవమ్మునఁ జెలంగుచుందురు.

ఆపురశ్రేష్ఠంబును సంపూర్ణముగ వర్ణించుటకు బహువత్సరంబులు పట్టును. అచ్చట విష్ణుభక్తిపరాయణు లగుప్రహ్లాదాదిదైత్యులు నివసించి యుందురు. వారియనుగ్రహంబుననే లోకమ్ములన్నియును నిలిచి యున్నవి. పరాపరలోకసముదయమ్ములవహించు లోకధారకగణమ్ములు బ్రహ్మాదిదేవతలను ధరించియుందురు. ఈసమస్తమును సురభి వహించి యుండును. సుధన్వుం డీభూమిని వహించియుండును. సర్వాంగ, సుసర్వాంగ, సులభా, చషకాదులు గ్రమంబుగఁ బూర్వపశ్చిమోత్తరదక్షిణమ్ముల సర్వదా వహించి యుందురు. ఈసురభిప్రభృతులయనుగ్రహమ్మువనే బ్రహ్మాదిదేవతలు జీవించి యున్నారు. ఇచటిక్షుద్రమందిరమ్ములును, ప్రాసాదమ్ములునుగూడఁ జిత్రవిచిత్రమ్ము లగుధ్వజమ్ములచే నలరారుచుండును. సర్వాభీష్టప్రదములగు కల్పవృక్షములును, మఱియుఁ జిత్రవిచిత్రమ్ము లగునితరవృక్షములును, స్వర్గమునందలి వానికంటె నతిరమణీయమ్ము లగుజలాశయమ్ములు నిందుఁ గలవు. పూర్వంబున బ్రహ్మదేవుండు యథేప్సితగుణసమంచితమ్మగు నీనగరమును సృజియించెను. అందలిప్రజలు నిరంతరము నఖిలాభీష్టసిద్ధులై యుండుటచే నానగరీలలామమ్మునకుఁ గామనామము విఖ్యాతమయ్యెను. అందుఁ బాయసపూర్ణమ్ము లగుబహుసహస్రపాత్రమ్ములు గలవు. అచ్చటి సామాన్యగృహంబులఁగూడ సకలపదార్థమ్ములును సుఖజనకమ్ములై యుండును. అందలి ప్రతిగృహశ్రేణియు శరత్కాలహ్రదమ్ముఁ బోలి నిర్మలంబై యుండును. అందెల్లకడలును దేవాధిష్ఠితములై, సహస్రాధికంబు లగునమృతకుండంబులు, పాయసభాజనములుమొదలగువానిచే విలసిల్లుచుండును. అచ్చటిజలం బమృతతుల్యంబు. నానావిధాలంకృతం బగునానగరమ్మునం దొక్కభాగమును వర్ణించుటను బహువత్సరంబులకైనను దేవతలకైనను సామర్థ్య

మ్మలేదు—నాగగణమ్ములు మొదలగుపాతాళవాసులు సూక్ష్మజీవు లగుటంజేసి వారిభవనము లతిసూక్ష్మములు నతిచిత్రములు నై యుండును. అందుచే వానిని సంపూర్ణముగ వర్ణించుట శక్యము గాదు. నాగరాజగు ననంతునకు బ్రహ్మవిష్ణుపురమ్ములకును, స్వర్గపుర మ్మునకును సమానమ్మును, సర్వాభీష్టదాయకమ్మును, నసామాన్యంబు నగుపురమ్మగలదు. అది యనేకగుణపరిపూర్ణంబై దేవతలచేఁ బ్రశం సింపఁబడుచుండును.

—♦ నరకవర్ణనము. ♦—

ఇఁక నేకమన్వంతరస్థితంబును, దివ్యంబును నగుయమపురం బునుగూర్చి చెప్పెదను. రౌరవంబును, రోధంబును, వాలంబును, శూకరంబును, కుంభీపాకంబును, గళగ్రహమ్మును, అసిపత్రవనమ్మును యమశూలియు, భైరవమ్మును, ఏకపాషాణమ్మును, అసితాళవన మ్మును, ఊర్ధ్వకమ్మును, శూలమును, వైతరణియు, కరంభవాలు కయు, శృంగాటకవనమ్మును, ఘోరమ్మును, అంధకారమ్మును, మొదలుగాగల యనేకనరకమ్ములు యమాధీనములై యుండును. జీవులు తమతమకర్మానుసారముగా నాయానరకములయందుఁ, బాప ఫలముల ననుభవించుచుందురు. పాములచేఁ గఱపించుటయు, అంప ములచేఁ గోయించుటయు, నతిదుస్సహంబులగు వైతరణీ దుర్గంధజలమ్ములఁ ద్రోయించుటయు, శాల్మలీవృక్షమునుండి యాక ర్షించుటయు, యంత్రసూత్రములచే బిగించి లాగించుటయు, కుంభీ పాకమ్మున మర్దించుటయు మొదలుగాగలపీడనములీస్థానమునందే జర గుచుండును. కూటసాక్ష్యము లిచ్చినవారు రౌరవనరకమ్మునను, పర హింసానిరతు లగువారు రోధకనరకమ్మునను, బ్రహ్మస్వహారణులు శూకరకుంభీపాకాది నీచనరకములను గూలి పాపఫలముల ననుభవిం

చుచుందురు. పరధనాపహారియగుపాపాత్ముండు గళగ్రహనరకమునం గూలి బహుసహస్రవర్షమ్ములు పీడితుండగుచుండును. స్త్రీహంతకుం డగువాఁడుపూతిమాంసనరకమునం ద్రోయఁబడి లక్షవర్షంబులు మాటి మాటికిఁ బీడింపఁబడుచుండును. ధనధాన్యములను, సువర్ణంబును దొంగిలించినవాఁడు భయంకరయమశూలనరకమునం బడును. మాతృ హంతకుండు శతవర్షములు శూచీముఖనరకపతితుండై పీడింపఁబడును. పితృహంతకుఁడు యాతనామయంబగు నధోముఖనరకంబునఁ బీడితుం డగును. దేవద్రవ్యవినాశకుం డగువాఁడు సర్వమయం బగునై తరణి యందుఁ బతితుండై యేకవింశతివర్షంబులు ఘోరనరకంబునను, గ్రామధ్వంసకుం డతిదారుణం బగునసిపత్రవనంబునను, ధర్మమూల మ్ములగు తపోవ్రతాచరణాదులను ద్వేషించినవాఁడు చిరకాలమధో ముఖపతితుండై కఠోరంబగు భైరవనరకమ్మునను, మిత్రదారా పహారి యతిభీషణం బగునేకపాషాణనరకమ్మునను, శరణాగతున కభ యం బొసంగియు మరలనపకారమ్ము సేసి ఘాతుకుండగువాఁడు నిస్సంశ యమ్ముగ నసితాళవననరకమ్మునను, బరదారరతులును, బరద్రవ్యాప హారులు నగునారు భయంకరం బగునసిపత్రవనమ్మునను బీడింపఁబడు చుండురు. సాక్షియై యసత్యముచెప్పినవానిని శూలనరకమ్మున నూర్ధ్వ పాదుంగావించి బంధించి యాతనినాలుకం గోయుదురు. మఱియు నాతని దేహమ్మును సుతీక్ష్ణాగ్రంబగుహలమ్ముచే దున్నింతురు. బ్రాహ్మణో త్తములశిఖాయజ్ఞోపవీతాదులను నిందించినవారు యమశాసనమ్మున శృంగాటకవననరకమ్మున కొనగ్నింపఁబడి మహావైతరణీనదియందుఁ బీడింపఁబడుదురు. స్త్రీపురుషహస్తచ్ఛేదమ్ము గావించినకూరులు ఘోరంబగుకిరంభవాలుకానరకమ్మునను, గృహదాహకులగునశోధ కులు దుఃఖసాగరమ్ములకుఁ బ్రధానస్థానమ్ము లగుమహాఘోరారాధ

కౌరమక్షికాదిభీకరనరకంబులఁ బతితులై బహుసహస్రవర్షమ్ములవఱకును యాతనల ననుభవించుచుందురు.

యాతనామయంబు లగునిట్టినరకస్థానంబులే కాక యమపురంబున నింకను నానావిధంబులగుశుభ్రప్రదేశంబులుగలవు. అవి పాపాత్మ్ముల కతిదూరస్థంబులు ననవగతంబులు నై యుండును. ఆశుభస్థానంబు లన్నియుఁ బుణ్యాత్మ్ములకు క్షణమాత్రగమనయోగ్యంబులు. అందు సత్పురుషవిహారంబులగుసుందరరాజమార్గంబులును గలవు. మునీంద్రా! దుస్తరంబగునరకమునుగూర్చి సంక్షేపముగ వర్ణించితిని. జననమరణగర్భక్లేశములును, అజ్ఞానభయమును, అవిద్యాదుఃఖమును, వనవాసకష్టమును, హింసాయాజ్ఞికులపరితాపమును, సాంఖ్యయోగసంతాపమును, రాగద్వేషాదులఁ బరిత్యజింపనసాధ్యంబగుటం జేసి మోక్షాభిలాషు లనుభవించుదుఃఖమును నీమొదలగుదుఃఖమ్ములన్నియు నరకవిషయములనియే యెఱుంగునది. కావున బహువిధప్రయత్నములచే సకలదుఃఖవిషయములును బరిత్యజింపవలయును. మఱియు సిద్ధాన్నముచే యజ్ఞము సేయవలయును. పంచమహాయజ్ఞముల నాచరింపవలయును. ఏదిదుఃఖవినాశకం బగునో యట్టియజ్ఞ మాశ్రయణీయం బగును. విద్వాంసుఁ డగువాఁడు జాత్యహంకారవినాశకం బగుజ్ఞానమును సాధించి యాశ్రయింపవలయును. ఏమనిన—భవకారణం బగునహంకారమునశించిన వో సకలదుఃఖములును నశింపఁగలవు. కూటసాక్షులకు రౌరవపతనమును, జీవఘాతుకులకు నైతరణీపతనమును, బరహింసాపరుల కసిపత్రపతనమును, నిశ్చితములు. శివశాస్త్రానుసారముగ శివోపాసనము సేయువారి కహింసాధర్మమును, శివసాక్షాత్కారఫలమును, లభించును. శివమాయామోహితు లగుదుర్వృత్తులంగూర్చి పూర్వమే చెప్పంబడియెను. అవిద్యామూలంబునసే

జీవులకు స్వర్గనరకభోగములగుచుండును. అవిద్యచేతనే వారు మహాంధకారనిమగ్నులగుచుందురు. ధర్మవిదులగువారు విద్యాధర్మఫలోదయంబగు మోక్షము నధిగమింతురు. బ్రహ్మాండంబుల కధిపతులగు దేవతలుగూడ స్థావరాదులను సృష్టించుచు ధర్మజ్ఞులయ్యు నవిద్యామూలంబున సుఖదుఃఖంబుల ననుభవించుటయే గాని కేవలసుఖంబునందఁజాలరు. అట్టిమహాదుఃఖము కామతత్పరులగువారి కలంఘ్యంబు. వేదోపదిష్టధర్మవిధులగు బ్రాహ్మణులు మోక్షమునే సారభూతముగా భావింతురు. యమలోకమున సుఖదుఃఖభోగానంతరమున జీవులీయిహపరలోకముఁజేరి స్వర్గనరకము లెట్లనుభవించునదియు, మానవజన్మం బెట్టిక్లేశకరంబైనదియు సమస్తమును వర్ణించెదను. గర్భవాసభోగానంతరము నరకభోగమును, దదనంతరము తిర్యఙ్మానవదేవత్వములును గలుగును. తిర్యఙ్మానవదేవత్వములు పరిణామశీలములు. కాలక్రమమున విహంగము మానవుఁడుగను, దేవతగను బరిణమింపఁగలదు. దేవమానవులు, పక్షులుగను, దేవతలుమానవులుగను, మానవులు దేవతలుగను బరిణమించుచుందురు. కావుననే యీపరిణామాదు లన్నియు నరకములని చెప్పంబడియెను. అట్టినరకమును దరింపఁగోరుబ్రహ్మనిష్ఠులగువారు సుఖలాభముకొఱకు సర్వజ్ఞుండును, సర్వసమదర్శియు నగుసర్వేశ్వరు నాశ్రయించుచుందురు. గర్భవాసమునకుమూలకారణంబగుదుఃఖమును, గర్మమును నశియించినచో నరకభయము దూరము గాఁగలదు. సంసారచక్రారూఢు లగుజీవులు యంత్రచక్రములవలెఁ బరిభ్రమించుచుందురు. కావున సంసారచక్రవినాశము కొఱకు శివచక్రము నాశ్రయింపవలయును. శివచక్రారూఢు లగుజ్ఞానులకు దోషము లంటఁజాలవు. అట్టివారు మాయాధీనంబగు కర్మకృతదోషసమూహామునుండి విడివడి యుందురు. శివజ్ఞానమున శివభక్తి

సంపన్నులగువారియెడల శివుండు ప్రియుండై యుండును. వారిపాప పుంజంబు లగ్నియందలి తృణంబులవలె దగ్ధములై పోవును.

—♦ భువనకోశవర్ణనము. ♦—

ఓద్విజవరులారా! నేనిప్పుడు పృథ్వీతలమ్మునకుఁ జతుర్దిశలను గలద్వీపసముద్రాదులంగూర్చి వర్ణించియుంటిని. ఇఁకబ్రహ్మలోకపర్యంతమును గలయూర్ధ్వలోకములను వర్ణించెదను. ఈభూమికిఁ బైని లక్షయోజనములదూరమున సూర్యలోకమును, దానికి లక్షయోజనములమీఁదఁ జంద్రలోకమును, దానికి లక్షయోజనములపైని గ్రహతారాగణనివాసంబును నీరీతిగా మీఁదమీఁద నితరజ్యోతిర్గణలోకములును గలవు. అంతరిక్షంబునం గలగ్రహతారకాదిగణంబు లన్నియు నేకమన్వంతరకాలంబువఱకును, వెలుంగుచు, సంచరించుచు ననంతరము పతితంబు లగుచుండును. మన్వంతరభేదంబుల ననుసరించి యాకాశంబున మేఘంబులును, గ్రహంబులును వేఱువేఱువిధంబులఁ దోఁచుచుండును. మేఘస్థానము దశసహస్రదశయోజనము లున్నతంబై యుండును. అందు నవవిధంబు లగుమేఘంబు లాగ్నేయంబు లనియుఁ దక్కినవి వారుణంబు లనియుఁ గీర్తింపఁబడుచున్నవి. వాని కూర్ధ్వంబున సూర్యలోకంబుగలదు. సూర్యలోకంబున కవ్వల దేవగణపూజితంబును, మహిమాత్మాసహపూర్ణంబునగు ప్రధానస్థానంబుగలదు. సూర్యలోకంబున ననేకములగు దేవవిమానములు గలవు. అందలివారెల్లను సూర్యసమతేజులై యుందురు. సత్కర్మనిరతులును, ఆత్మచింతకులు నగునఱువదివేలమందిమహర్షులు సుప్రశస్తం బగుసూర్యభగవానునిదివ్యరథంబును సేవించుచుందురు. ఆయుపాసకులతోఁ గలసి యఱువదివేలమంది మహాత్ములగునాగులును, హాహాహూహూప్రభృతిగంధర్వులును, రాక్షసగణములును, అఱువేలమందియచ్చరలును

విరాజిల్లుచుందురు. మఱియు గీతవాద్యమధురనాదమ్ములచేఁ బూర్ణములును, ఘంటాసమన్వితములును, వివిధరత్న విభూషితములును, విచిత్రధ్వజ శోభితములును, రత్నకింకిణీనాద కలితములును, నానారత్నోజ్జ్వలములును, సర్వకామ సమృద్ధములును, గావ్యశబ్ద సమన్విత ములును, సుందరీసహస్రవిలసితములును, గల్పవృక్ష సమంచితములు నగుశతసహస్రవిమానము లందుసంచరించుచుండును. మఱియు గగనచరములును, వాయురథకలితములు నతిసుందరములు నగుమేఘములు సర్వత్ర సంచరించుచు జలముల వర్షించుచుండును. సూర్యలోకమున జలదసమూహము సప్తవిధముల విభక్తంబై నిర్మలజలములతో నిండి వివిధాంశములతో స్వర్గపథము నాశ్రయించి యప్సరలు, దేవతలు, సిద్ధులు మొదలగువారితోఁ గలసి సంచరించుచుండును. సూర్యలోకమునఁ బుణ్యాత్ములకు నివాసములును, ప్రకాశమానములును, విచిత్రములు నగు దివ్యగృహములు బహుసహస్రమ్ములు గలవు.

ఆస్థానమున దేవగణమ్ములు విహారేచ్ఛచే విమానస్థులై వచ్చి క్రీడించుచు భోగసంపన్నులై యంతరిక్షమున విరాజిల్లుచుందురు. ఆకాశసంబంధమగుజలమంతయు సూర్యతేజస్సంభూతమైనదియే. సంసారమునుత్తరించినమహాత్ములు సూర్యలోకమున నివసించుచుందురు. ఆసూర్యలోకమున నూర్ధ్వమున నైవస్వతలోకము గలదు. అందు శుచిమంతులగు దివ్యులు శతసహస్రవిమానపరిశోభితులై సంచరించుచుందురు. దానికూర్ధ్వమున నంతకంటెను సుందరమును విశాలము నగుసోమలోకము గలదు. అందు యజ్ఞకర్తలును, మంత్రారాధన తత్పరులును, సోమయాజులును, ధనధాన్యవస్త్రప్రదాతలగుక్షత్రియగణమ్ములును నివసించియుందురు. దాని కూర్ధ్వమ్మున మహాత్ములకు

ఋషులకు నివాసమును, సముజ్జ్వలము నగులోకముగలదు. యజ్ఞమ్ములం గావించినబ్రాహ్మణులు దివ్యవిమానారూఢులై యందు విహరించుచుందురు. అచ్చటివా రందఱును దివ్యవసనధారులును, దివ్యాలంకారభూషితులు నై యుందురు. అదియే యాకాశగంగకును, సకలగ్రహములకును స్థానము. దానికవ్వల మహర్షిపూజితం బగు నొకలోకము గలదు. మహారణమున వీరమరణము గాంచినమహాపురుషు లందు నివసించుచుందురు. అది స్వర్గమునం దింద్రునియమరావతీపురమును బోలి శోభిల్లుచుండును.

ఋషిలోకమున కూర్ధ్వమున నింద్రలోకమును, దానికూర్ధ్వమునఁ గోటిసూర్య ప్రభావంతమును, లక్షకోటిసాధ్య పరివృతమును, దేవలోకమునకుఁ జతుర్గుణపరిమాణము నగుధ్రువలోకమునుగలవు. అది సనత్కుమార, కార్తికేయ, నందనప్రభృతులకు నివాసము. శయ్యావస్త్రహిరణ్యాదిదానములఁ గావించినవా రందు సుఖభోగము లనుభవించుచుందురు. దాని కూర్ధ్వమునఁ బ్రశంసనీయం బగుజనలోకంబు గలదు. తారాలోకంబున కుపరిభాగంబున బ్రహ్మలోకంబు గలదు. అందు సిద్ధగణంబులును, మునిగణంబులును, స్వయముగఁ జతుర్ముఖుం డగుబ్రహ్మయు, సప్తర్షిగణంబును, ధ్రువుండును, మహామతి యగువిష్ణుదేవుండును విహరించుచుందురు. దానికవ్వల సత్యలోకంబును, దదుపరి విష్ణులోకంబును, గోలోకంబును గలవు. భూలోకంబున కుపరిభాగంబున నీలోకంబు లన్నియు యథాక్రమంబుగా నున్నవి. బ్రహ్మాండమున కూర్ధ్వభాగంబున బ్రహ్మలోకంబు గలదు. దానికి శతకోటియోజనంబులమీఁదఁ గేవలము జ్ఞానులకు మాత్రమే గమనయోగ్యంబగు నొకలోకంబు గలదు. అందుఁ బ్రవేశించినంతనే జ్ఞానోదయం బగును. శివానుచరుఁబుదక్క

నితరు లెవ్వరును నాస్థానమును జేరఁజాలరు. శివానుగ్రహం బును, యోగంబును, నైష్ఠికబ్రహ్మచర్యంబును ఆలోకప్రాప్తికి సాధనంబులు. భగవంతుం డగుశివుఁడే యందు బ్రహ్మమై విరాజిల్లుచుండును. ఒకప్పు డింద్రాదిసకలదేవతలును, సమస్తమహర్షిగణంబులును, నచ్చటికి వచ్చి యీబ్రహ్మదేవుని పాదకమలంబులకుఁ బ్రణమిల్లి తదీయాదేశంబున నందుఁ బరమానందముతో యథాస్థానములం దుపవిష్టులై యుండిరి. అప్పుడు బ్రహ్మదేవుఁడు "ఓమహాభాగులారా! మీకుఁ గుశలమే కద! మీకోరిక యేమి? మీరెందుకొఱకువచ్చితిరి?" అని ప్రశ్నించెను. అప్పుడు దేవతలు "ఓదేవదేవా! మాకు వరంబులతోఁ బ్రయోజనంబు లేదు. ఈజగమంతయును సృజించినమీచే మేమిట్లునుగఁబడితిమి. ఇంతకంటె మాకేమికావలయును? సహస్రవరంబులకంటె మాకు మీదర్శనమే యధికమైనది. మహాత్మా! మాకొక ప్రబలసంశయము గలిగినది. దానిని మీరు నివారింపవలయును. అతిదుర్లభంబును, గోపనీయంబును, ఉత్తమంబు నగునొకప్రశ్నముం గావించెదము." అని ప్రార్థించిరి.

ఇట్లు చెప్పి సనత్కుమారుండు "వ్యాసమునీంద్రా! ఇచ్ఛాద్వేషవివర్జితులును, జితక్రోధులును, జితేంద్రియులును, ధ్యానయోగపరాయణులును, ఈశ్వరజ్ఞానసంపన్నులును నగునైమిశారణ్యమునిపుంగవులు భృగ్వంగిరాదివృద్ధర్షులను మున్నిడుకొని బ్రహ్మసభయందు నేనిదివఱ కొకప్పుడు పరమాత్ముండగుశివునియొద్ద నేవిషయముంగూర్చి యడిగితినో యావిషయమునే ప్రశ్నించిరి. నే నాపురాతనేతిహాసంబు సర్వంబును సంకీర్తించెదను. దివ్యప్రభామయం బగు బ్రహ్మసభ కామమయాభిధానంబున విరాజిల్లుచుండును. పరమాత్మైక్యసంపన్నులగుపురుషులుమాత్రమే యాసభ నవలోకింపఁగలరు. అచ్చట సూర్య

రశ్మిగాని, చంద్రకాంతి గాని, తారకాప్రకాశము గాని యేమియుసు లేదు. తమోతీతుం డగుశివుఁడుదక్క నాప్రదేశము నితరు లెవ్వరును బ్రకాశింపఁజేయఁజాలరు. పాపంబును, సదాచారవిహీనతయు శివ భిన్ను లగునెల్లవారికిని గొలఁదియో, గొప్పయో యుండకపోదు." తమోగుణప్రకాశమే పాపంబును, దమోగుణాప్రకాశమే పుణ్యంబు నగుచున్నవి. కేవలయోగమే మహామాయను, సర్వపాపములను నశింపఁజేయును. యోగధ్యానమువలననే జన్మాంతరకిల్బిషంబులుగూడ నశించును." అనిచెప్పుటయు వ్యాసుండు విశుద్ధచిత్తుండై వినయభక్తి పూర్వకంబుగ సర్వజ్ఞుం డగుసనత్కుమారుం గాంచి యిట్లనియెను.

## మహాదేవస్వరూపవర్ణనము.

పరమయోగీంద్రా! నీయనుగ్రహమువలన సంశయనివారణం బుఁ గావించుకొనవలయు నని యిచ్ఛగించుచున్నాఁడను. మునీంద్రా! నాయీసంశయమును నివారింపుము. ఇట్టి సందిగ్ధాంశంబులకు సదు త్తరంబు లీయఁగలవా రీమూఁడులోకంబులందును నీకంటె నధికు లెవ్వరున్నారు? మహేశ్వరానుగ్రహబలంబున మీ కట్టిసామర్థ్యంబు గలదు. కావున మీ రిప్పుడు మహాదేవుం డగు రుద్రుని మాహా త్మ్యంబు వర్ణింపుఁడు. అనుటయు సనత్కుమారుం డిట్లనియెను. పరి దృశ్యమానం బగునీచరాచరప్రపంచము పూర్వమునం దిట్లే యున్నది. ఒకప్పు డిదియంతయును జలార్ణవమైపోయెను. అప్పు డగ్ని, వాయువు, సూర్యుఁడు, దశదిశలు, చంద్రుఁడు, నక్షత్రములు, ముహూర్తములు, కరణములు, దేవతలు, రాక్షసులు, గంధర్వులు, పిశాచగణంబులు, నసురులు మొదలగువా రందఱును మహేశ్వరతేజంబుచే నాచ్ఛన్ను లై యుండిరి. ఆకస్మికముగ నిట్లగుటం గాంచి మోహితుండనై నేనొ క్కించుకసేపు నిశ్చేష్టభావంబుతో నుంటిని. అనంతరము భగవానుం

జగురుదౖదేవుండు లక్షకోటిసహస్రజీవులహితంబుకొఱకు సుదర్శనీయంబును, మనోహరంబును నగుతనసుందరవదనకమలమును వికసింపఁజేసి మేఘదుందుభిస్వరంబున హాసంబు సేయుచు నిట్లు ప్రిబోధించెను.

నేను గేవల మేకమాత్రస్వరూపుండను. నాకంటె రెండవవాఁడెవ్వఁడును లేఁడు. ప్రితియుగంబు నీసమస్తంబును నన్నునుండియే యుత్పన్నం బగుచుండును. ఓమూఢులారా! మీరేల శుష్కవిచారంబు సేయుదురు? మాయాదేవిసాహాయ్యంబుకొఱకు నేను రుద్రుని సృజించితిని. ఆతఁడీసమస్తప్రపంచమును సృజించెను. స్థావరజంగమాత్మకంబగునీప్రిపంచము పూర్వమెట్లుండెనో నూతనసృష్టియందు నట్లేయుండును. ప్రజాపతి యన్నాధిదేవత. అన్నమే జీవులకు జీవనము. సకలజీవసముదాయంబు నన్నంబునుండియే యుత్పన్నం బగుచున్నది. యజ్ఞోత్పత్తిగూడ నన్నమునుండియే. యజ్ఞము నిఖలకర్మంబులకు నుత్పత్తిస్థానము. సకలయజ్ఞంబులును బ్రిహ్మయజ్ఞంబున కంతర్భూతములు. ఋగ్యజుస్సామవేదంబులును, గల్పోపనిషత్తులును, మంత్రంబులును, అరణ్యకంబును, రహస్యాథర్వణంబులును బ్రహ్మయజ్ఞంబునఁ బ్రితిష్ఠితంబులై యుండును. ఏకాక్షరంబగునోంకారమే పరబ్రహ్మంబని షడంగప్రస్తావంబున సాంఖ్యయోగవిశారదులు చెప్పుదురు. బ్రహ్మాక్షరాత్మకం బగునీయోంకారము సావిత్రినుండి యుత్పన్నమైనది. శక్తియు, బ్రహ్మయు,విష్ణుండును నేనుఁగూడ నాయోంకారమును బూజించుచుందుము. ఓంకారమే యజ్ఞప్రదర్శకమైనది. అని యుపదేశించి మహాదేవుం డంతర్హితుం డయ్యెను. కమలగర్భుం డగుబ్రహ్మదేవుండావాక్యంబుల నాలకించి యనాయాసంబుగ నిత్యముక్తుం డగుమహేశ్వరునిం బొందఁగలిగెను. మహేశ్వరుండు పంచమూర్తులచే విరాజిల్లుచుండును. అందుఁ బ్రథమమూర్తి యూర్ధ్వరోమవిశిష్టమై భయంకర

మై యుండును. ద్వితీయమూర్తి సూర్యకిరణోపమంబై ప్రదీప్తంబై యుండును. పరమాత్మ యగుచంద్రమూర్తియే యాతనితృతీయమూర్తి. కుబేరునిమహితనువు పరమేశ్వరుని చతుర్థమూర్తి. ఆదేవునిపంచమమూర్తి పరమపదం బగుబ్రహ్మస్వరూపమే. ధ్యానసమగ్ను లగు విజ్ఞానులా బ్రహ్మస్వరూపము నవలోకించుచుందురు. భగవానుండగు రుద్రుం డీపంచవిధంబుల నుదయించుచుండును. ఆదేవునిప్రథమమూర్తి నిరంతరమును క్రీడించుచుండును. ద్వితీయమూర్తి తపశ్చరణంబు గావించుచుండును. తృతీయమూర్తి లోకసంహారంబు సేయుచుండును. చతుర్థమూర్తి ప్రజాసృష్టి సేయుచుండును. పంచమమూర్తి విజ్ఞానభావంబున సర్వజగంబు నావరించియుండును. ఆతఁడె సర్వేశ్వరుండును, సర్వజీవావస్థితుండును, సృష్టిప్రళయసంపాదకుండును, సకలజీవరక్షకుండును, ఈశానుండు నని కీర్తింపఁబడుచుండును.

మఱియు నాతఁడు జీవులయుత్పత్తిప్రళయంబులను, గతిసంగతులను, విద్యావిద్యలను నెఱింగినవాఁడగుటచే భగవానుం డనియు, మహాత్ములకంటె మహాత్స్వరూపుఁడును, మహాత్ములగు బ్రహ్మాదులచేఁ బూజితుండును, మహత్పదార్థం బగుజగంబునకుఁ గారణుండు నగుటం జేసి మహాదేవుండనియు, సచరాచరపూర్ణం బగుత్రైలోక్యంబునకు సంహారకరుండును, పశుస్వరూపు లగుజీవులకుఁ గర్మబంధమోచకుండును నగుటచేఁ బశుపతి యనియుఁ, దల్లియుఁ, దండ్రియుఁ, బ్రియుండును స్వయముగఁ దానేయై స్వయముగ నవతరించినవాఁడగుటచే స్వయంభువనియు, నేకమస్తకచ్ఛేదనంబు గావించి దానిని ధరించుట కారణంబుగా బ్రహ్మాదిబుధులచేఁ గపాలి యనియు, ఈలోకత్రయంబును బ్రళయకాలంబున నాతనియందు నిలయంబు నందుటంజేసి శంకరుం డనియు. తనయందే విశ్వమంతయు నుత్పన్నంబగుటయు.

దనకంటె నెవ్వరు నధికులు లేకుండుటయుఁ గారణంబుగా విశ్వేశ్వరుం డగునీశానుండనియు, మహాత్ములకంటె మహాత్ముండును, లోకంబులకు మహైశ్వర్యప్రదాయకుండును, బ్రహ్మాదిమహావ్యక్తులచేఁ బూజితుండు నగుటచే మహేశ్వరుం డనియు, సచరాచరంబగుప్రపంచమున సకల జీవులు నాతనియనుగ్రహామువనే బ్రిహ్మజ్ఞులగుటవలనను, బృహాత్స్వరూపుఁడును, స్వయంప్రకాశుఁడు నగుటవలనను నాతఁడు బ్రిహ్మ యనియుఁ గీర్తింపఁబడుచుండును. అతిగుహ్యాతమం బగుబ్రహ్మపదార్థ మప్రత్యక్షవిషయము గాదు. కాని ప్రకృతిసంబంధవశంబున నా బ్రహ్మము నీలలోహితనామంబున వ్యవహారింపఁబడుచుండును. ఆ బ్రహ్మము జీవులప్రాణమయకోశంబువలనను సంఛన్నంబై యుండును. ఏదేవదేవేశ్వరునిసాక్షాత్కారంబునఁ జిరానందలాభంబు గలుగునో యట్టికేవలుం డగురుద్రుండు ప్రకృతిభిన్నుండై యుండును. మన మందఱమును బ్రాకృతికులము. రుద్రుండు మనకు దేవుండు. మనము దేవగణంబులకు దేవతామూర్తులము. దేవగణంబులు బ్రాహ్మణులకు దేవతలు. బ్రాహ్మణులు తక్కినయందఱకును దేవతలు. ఈరీతిగా రుద్రుఁడు దేవదేవేశ్వరులకును బరమదైవతమై యున్నాఁడు.

ఈసత్యము నెవ్వఁడు గ్రహించి నిత్యమును గీర్తించుచుండునో యాతనివిపత్సమూహా మంతయు నిశ్చయముగా వినష్టంబు గాఁగలదు.

## —: రుద్రమాహాత్మ్యకీర్తనము. :—

పంచభూతంబులును, దత్కారణంబులును, సమస్తప్రపంచము ను విరూపాక్షునుండియే యుత్పన్నంబగుచుండును. విష్ణుదేవుం డాతని పార్శ్వమునుండియు, దక్కినదేవతలందఱు నాతనిలింగస్వరూపమునుండి యు నుత్పన్నులగుచుందురు. అనాదియు, నక్షయుండును, భగవా

నుండును నగుశివుండే లింగస్వరూపము. వేయిమాట లేల? అతిగుహ్యతమంబగుతత్త్వమును సంక్షేపించి చెప్పెదను. బ్రహ్మయు, విష్ణుండును ఇంద్రుండును, సకలదేవతాగణంబులునుగూడ నాతనినిమేషకాలమాత్రావస్థితులై యుందురు. బ్రహ్మాదులకుంగూడఁ జేయశక్యముగాని కార్యములును, వారికెఱుంగరానిపరమరహస్యతత్త్వములును నాతనికి సులభములై యుండును. మహాదేవుం డగురుద్రునినియమంబు లచింతనీయములై నవి. సర్వవ్యాపి యగునాతఁ డసమానబలపౌరుషములు గలవాఁడు. ఆదేవునిమాయ నెవ్వరు నెఱుంగఁజాలరు. భక్తిమాత్రప్రియుం డగునాతని నెవ్వరును భక్తిమూలంబునం గాక పడయఁజాలరు. రుద్రుఁడు నిత్యసంస్మరణీయుఁడు. రుద్రునియందే పరమపదము నిలిచి యున్నది. రుద్రునివంటిదైవమును మేమెందును జూచి యుండలేదు. నిరంతరభక్తిభావంబున మహేశ్వరచింతానిమగ్నులగువారు దురాచారులయ్యును భావితాత్ములగుపరమమునీంద్రులతోఁ దుల్యులై యుందురు. వివిధపాపవిలిప్తు లయ్యును మహేశ్వరశరణాగతులై నిత్యము నాతని భజించువారు సంసారదుఃఖంబుల నుత్తరించి సర్వోత్కృష్టులై యుందురు. నిరంతరము నశ్వమేధాదియజ్ఞంబులు సేయువారుగూడ వారియున్నతపదంబును బడయఁజాలరు. దేవదానవగంధర్వయక్షరాక్షసాదులు నిరాఘాటముగ సకలలోకసంచారు లయ్యును, గేవల భక్తగణమాత్రలభ్యంబగురుద్రలోకమున రుద్రానుమతంబు లేక ప్రవేశింపఁజాలరు. ఆరుద్రుండు సంతుష్టుం డైనచో విష్ణుత్వంబును, ఇంద్రత్వంబును, అమరత్వంబును, దేవతాగణసహవాసంబును, త్రిభువనాధిపత్యంబునుగూడఁ బ్రసాదించును. ఆపరమేశ్వరునియందు నిశ్చలభక్తులై యుండువారికి శివలోకంబున నున్నతపదలాభంబు గలుగును. నిరంతరపాపకార్యానుష్ఠానంబులచేఁ గలుషితచిత్తులగువారు

గూడ భగవంతుండగురుద్రుని భక్తిపూర్వకంబుగ ధ్యానించి మహేశ్వరసాక్షాత్కారంబును బడయఁజాలుదురు. దేవతాగణంబులకును ప్రభుండును, ఆదిదేవుండును మహాదేవుండు నగురుద్రు నసమానభక్తి భావంబున సర్వదాస్మరించువారి కెట్టిభయంబులును గలుగవు. నిరంతరము మహేశ్వరసంకీర్తనంబు సేయువారిని మోహమావేశింపఁజాలదు. దేవదేవసంకీర్తనంబునఁ జండాలాదులైనను దేజస్విలగుబ్రాహ్మణులై సర్వపాపవినిర్ముక్తులై రుద్రలోకంబు నధిగమింపఁగలరు. అక్షరద్వయ సమంచితం బగురుద్రనామమును నిరంతర ముచ్చరించువిచక్షణులు నీలకంఠసంకీర్తనవశంబున బాపవిముక్తు లగుదురు. స్వధర్మభ్రష్టులును సకలపాపకలుషితులు నగువారుగూడఁ గేవలధ్యానపరాయణులై మహేశ్వరు నాశ్రయించి తమపాపంబులనుండి యుత్తీర్ణు లగుదురు.

ఈప్రపంచమున నిత్యంబును నూతనంబుగాఁ బెక్కుగర్భంబుల జన్మించి నశించుచుండు జీవులు భక్తిభావంబున మహాదేవు నాశ్రయించి ధ్యానించుచుండుటవలన భవదూరులై గర్భవాసదుఃఖమునుండి విముక్తు లగుదురు. అంతరంగంబు శివాధీనంబు గావించినమానవులు సకలపాపవిముక్తులై దేవతాగణంబులతోఁ జేరి విహరించుచుందురు. నిత్యాగ్నిహోత్రులును, బహుదక్షిణాన్విత యజ్ఞానుష్ఠానపరులును గూడ శివభక్తులషోడశాంశమునైనను బోలఁజాలరు. శివచింతాతత్పరు లగువారిలో ముముక్షులగువారికి మహేశ్వరానుగ్రహంబునఁ బరమపదలాభంబు గలుగును. సాంఖ్యయోగసంభవకరుండును, సర్వవ్యాపకుండును, అవ్యయుండును, నిత్యుండును, మహాదేవుండు నగువిరూపాక్షునియనుగ్రహంబులేక సిద్ధుండగుట కెవ్వఁడు సమర్థుండు కాఁగలఁడు? తీర్థంబులలో దివ్యమంగళస్వరూపుండును, పవిత్రంబులలోఁ బరమపవిత్రస్వరూపుఁడు నగువాఁడెవ్వండు సర్వజనశరణ్యుఁడు. సర్వభూతేశ్వరుం

డగువిరూపాక్షుండు సర్వజీవాంతర్గతుండై యోంకారము నధిగమించి యుండును. నిష్కళుండును, బ్రధానపురుషుండును, మహాలింగలక్షణుండును, దుస్తరతాపోపశమనుండు నగునాతనిఫలస్వరూపమును దెలిసికొనుట యెట్లు? క్షీరంబులయందు ఘృతంబును, గాష్ఠంబులయందగ్నియు, భూమియందు జలంబును, జలంబులయందు శైత్యంబును నెట్లుండునో యట్లే యీశ్వరునియందు దేవతలును, ఋషులును, బ్రహ్మమానసపుత్త్రులును విలీనులై యుందురు. స్తుతిహోమచిహ్నితుండయ్యును ననిర్దేశ్యుం డగునయ్యీశ్వరుం డనామయంబును, నిష్కళంబు నగులింగస్వరూపముచే విరాజిల్లుచుండును. ఏకముహూర్తమధ్యంబున మహాసాగరోద్భూతం బగుహాలాహలంబు జీర్ణము గావించుకొన్నవిభుం డగునమ్మహేశ్వరునిదివ్యస్వరూపమును దేవగంధర్వభూతసిద్ధయక్షపన్నగాదు లెవ్వరును గనుంగొనఁజాలరు. పార్థివలింగస్వరూపంబున విరూపాక్షు నర్చించువారికి బితృమానుషనాగభయంబులు గలుగవు. వారివంక యముండు తేఱిచూడఁజాలఁడు. వారికి గుంభీపాకాదినరకపతనంబు లేదు. వారు కామగమనంబు లగువిమానంబుల నధిరోహించి యింద్రిలోకంబునఁ దేవతలతోఁ గూడ విహరించుచుందురు.

## రుద్రారాధనవిధి.

రుద్రు నెట్లారాధింపవలయునో, యాతఁ డెట్లు ప్రసన్నుం డగునో యానతీయవలయు నని మహర్షులు ప్రశ్నించుటయు బ్రహ్మయిట్లుపదేశించెను. మునీంద్రులారా! పూర్వ మొకకోటియిరువదివేలయిరువందలవత్సరములు విష్ణుదేవుండు శూలపాణియగు మహాదేవు నారాధించెను. అనంతర మమ్మహేశ్వరుండు సంతుష్టుండై, విష్ణునకు

సాక్షాత్కరించి శాంతిస్వరంబుతో "హరీ! సకలయుద్ధంబులయం దును నీకు విజయం బగును. సుదర్శనమహాచక్రధారణంబున నీవతి బలశాలి వయ్యెదవు. నాయందు భక్తిగలనీకు మత్సమానబలంబు లభించును." అని వరం బిచ్చెను. అదిమొదలుగ విష్ణుదేవుండు శివానుగ్రహంబున నజయ్యుండును, బరమతేజోమయుండునునై సమస్తప్రపంచమును బరిపాలించుచుండెను. మహాదేవుం డగువిరూపాక్షుండు తొల్లి బ్రహ్మనగునాచే నారాధితుండై పరమానుగ్రహంబున నన్ను విశ్వతోముఖునిగను, సంహారకర్తగను గావించియున్నాఁడు. అందుచే నేను ప్రతియుగంబునను దాతను, సమాహర్తను, గోప్తను, సంహర్తను నగుచుందును. ఆదేవునిప్రసాదంబుచేతనే నాకు సురాసురపితామహత్వంబును, వేదాధిపత్యంబును, శాశ్వతత్వంబును, భావివర్తమానవిశ్వంబునకుఁ బ్రభుత్వంబును లభించెను. మఱియు నేను షడంగసహితంబగు వేదచతుష్టయంబును, పారిభాషాసహితం బగుసాంఖ్యంబును, నిష్కళత్వంబును, దివ్యం బగుబ్రహ్మలోకంబును బడయఁగలిగితిని. ఇట్లు పూర్వ మింద్రుండు జలానిలమాత్రభోజనుండును, జర్మవసనుండునై దివ్యంబును, గష్టసాధ్యంబు నగుపాశుపతవ్రతంబు నాచరించెను. అప్పుడు పినాకపాణి యగువిరూపాక్షుండు ప్రసన్నుండై యింద్రునకు మహావజ్రప్రదానంబు చేసి బలవంతునిగను, గణాధిపతిగను గావించెను. మరలఁ దపశ్చరణమువలననే శక్రునకు స్వర్గపురంబు లభించెను. వృత్రవైరి యగునింద్రుం డాస్వర్గంబున విరాజిల్లుచుండెను.

మునివరులారా! పూర్వము మానసపుత్త్రుం డగుసనత్కుమారుండు సప్తసహస్రసంఖ్యాకంబు లగువిమానంబులతోఁ జంద్రసూర్యప్రభావంతంబు లగువిమానంబుల నధిరోహించి కమనీయతేజస్సంపన్నుండై సుందరీజనసహస్రంబు తన్నుఁ బరివేష్టింప విహరించు

చుండెను. ఆతం డీశ్వరదత్తబలగర్వంబున ననుపమానంబులును, సువర్ణమణిఖచితంబులు నగునందలిసుందరమందిరంబులయందు సూర్యతేజోమయు లగుపురుషగణంబులతోఁ గలసి నృత్యగీతవాద్యకుశలు లగు గంధర్వాప్సరోగణంబులు దన్నుఁ గొలువ శివశైలంబును బాదంబులచేఁ బీడించుచుఁ గ్రీడించుచుండెను. ఆతనియనుగ్రహముచే ననేక రాజన్యులు శివపూజాధురంధరులై సకలలోకసంచారలాభంబు గాంచిరి. ఆతఁడు దుష్టశిక్షణంబును, శిష్టరక్షణంబును గావించుచుండెను. ఆతనిగృహారామమునందలి సకలవృక్షములును సకాలముఁ బుష్పఫలవిలసితంబులై యొప్పారుచుండెను. ఆస్థానమున ద్వారరక్షకులును, శైలవాసులును, పాతాళవాసులును, అంతరిక్షసంచారులును, స్వర్గవాసులును, నక్షత్రగణాశ్రితులును, స్థావరజంగమాకృతు లగుసకలజీవులును బరమేశ్వరుం డగురుద్రదేవునిపార్శ్వంబున సుస్థిరులై యుండిరి. ఆదేవు నాశ్రయించి పరివేష్టించియున్న వారందఱును నిర్భయంబుగా నుష్ణనిశ్వాసంబుల విడుచుచుండిరి. ఆపార్శ్వంబునం గలగృహంబులును బాదపంబులును దివ్యములైనవి. రుద్రపార్శ్వంబునం దధివసించియున్న ప్రమథగణంబులు కుందేందుసదృశంబు లగుకమలకుసుమమాలికలనాఘ్రాణించుచుండిరి. ఆగణంబులశరీరవర్ణంబులును, బరిణామంబులును దరగతి కొక్కవిధంబుగా నుండెను. ఇట్లు మేరుమందరపరిమాణంబున నొప్పారుప్రమథగణసమూహంబుచేఁ బరివృతుండై, గ్రహగణపరివృతుం డగుసూర్యదేవునిం బోలి దేవేశ్వరుం డగుసనత్కుమారుండు గణాధీశుం డగుమహాదేవు నారాధించుచుండెను. శివారాధనబలంబున భీషణపరాక్రమశాలియు, నమితతేజస్వియు నగుసనత్కుమారునివిషయమున నేను గాంచినదానిం జెప్పితిని.

ఈగణసమూహవర్ణనము నా [illegible]

రించువారును, ప్రతిపర్వంబునను బఠించువారును, సర్వాభీష్టసిద్ధులై యమృతత్వంబు నంది రుద్రలోకంబునఁ గోటివత్సరంబులు పూజితులై యుందురు. దీనిని సతులబుతుకాలంబునఁ బఠించువా రపత్యసంపన్ను లగుదురు; యుద్ధకాలంబునఁ బఠించువారు విజయు లగుదురు. జితేంద్రియులును, శ్రద్ధాపరాయణులునై యాహారసమయంబుల బ్రాహ్మణసాన్నిధ్యమున నిత్యమును దీనిని బఠించువారికి నూఱుసారులు రుద్రాధ్యాయపఠనంబును, గోటిసారులు వేదపఠనంబును గావించిన ఫలంబు లభించును. అట్టివారు పాపాత్ములైనను రుద్రలోకంబు నధిగమింపఁగలుగుదురు. ప్రభాతకాలంబున భక్తిపూర్వకంబుగ దీని నాకర్ణించువాఁడు పాపవిముక్తుం డగును.

అప్పుడు సనత్కుమారుండు సమాగతుం డగుబ్రహ్మదేవు నుద్దేశించి యిట్లనియెను. తండ్రీ! పూర్వులగుపితృపితామహాదు లెల్లరును భగవానుండగురుద్రునిదేవతేజోమయంబగునూర్ధ్వనయనంబు నవలోకించుచు సర్వభూతంబులయందును మాన్యులై యీశ్వరానుగ్రహంబున నుత్తమలోకవాసంబు గాంచి యున్నారు. పూర్వంబున సిద్ధగణంబులుగూడ నిట్లే మహాదేవప్రసాదంబున సిద్ధిలాభంబు నంది గర్వితులై యుండుటయేగాని శ్రేష్ఠత్వంబు నెఱుంగకయేయున్నారు. అకృతకార్యుం డగుబాలకునివలె విమానంబులను, రత్నంబులను, వివిధంబులగునుత్తమగృహంబులను గాంచి నేనును ముగ్ధుండనై యున్నాను. ఇట్టివానిచే నిర్బంధితుండ నైతి నని నాకు బోధయగుచున్నది. అందుచే నాకతిదుస్సహం బగుసంతాపంబు గలుగుచున్నది. కావున దేహపరిత్యాగంబు సేయువలయు నని సంకల్పించుకొంటిని. అనుటయుఁ బుత్త్రునియీవాక్యంబుల నాలించి బ్రహ్మదేవుండు క్షణకాలంబు ధ్యాననిమగ్నుండై చింతాబలంబున శివసాక్షాత్కారంబు గాంచి తన

కుమారుండగుసనత్కుమారుని బరమభక్తాగ్రేసరునిగా నెఱింగి యాస నమునుండి సముత్థితుండై సర్వజీవోత్పాదకుండును, సంహారకుండును, శాశ్వతుండును, భూతనాథుండును, నీశ్వరుండు నగుమహాదేవునకు నమస్కరించి యిట్లని చెప్పందొడంగెను.

వత్సా! ఎవ్వనినుండి స్థావరజంగమాత్మకంబగునీవిశ్వమంతయు నుత్పన్నం బయ్యెనో యట్టిమహాదేవుండు ప్రభువులకు మహాప్రభుండు ను, యోగీంద్రులలోఁ బ్రధానయోగీంద్రుండు నై యున్నాఁడు. అంబికానాథుండగుసద్దేవుండు పూర్వ మొకప్పుడు శోకార్తుం డగునందీ శ్వరుంగాంచి "పుత్త్రా! శోకించుట యుచితము గాదు. జన్మగ్రహ ణంబు గాంచిన యెవ్వఁడు జరామరణములు గాఁగలిగియున్నాఁడు?" అని యూఱడించి దయాళుండై యాతని కఖిలలోకంబులను జూపించె ను. ఆత్మసాక్షాత్కారమమాత్రము సుదుర్లభమైనది. కుమారా! ప్రమథులందఱు నీరీతిగా విష్ణుదేవునిచే గాణపత్యలాభంబు నందిరి. అకృతమతు లగువారిలో బ్రహ్మనిష్ఠుం డొక్కండును లేఁడు. ఎవ్వఁడు జ్ఞానియై మహాదేవుని భజించునో యాతనికి గాణపత్యమన నెంత? ముక్తి పర్యంతము నాతేఁడధిగమింపఁగలఁడు. కావున నవశ్యంభావి యగునీ సుఖంబు నెడల నీవన్యవిచారంబు సేయక పోయి యాపరమేశ్వరుని భజింపుము. దయాళుం డగునాతఁడు నీకాత్మదర్శనసాధనం బగుయో గంబును బ్రసాదింపఁగలఁడు. మున్ముందుగా సుదుర్లభంబగుగాణ పత్యంబును బ్రసాదింపు మని యద్దేవునిఁ బ్రార్థింపుము. పూర్వము భగవానుండగువిష్ణుదేవుండును బ్రథమంబున గాణపత్యంబునే యభ్య ర్థించి యనంతర మాత్మదర్శి యయ్యెను. కావున గాణపత్య మొక్కటి యే యాత్మదర్శనంబునకుఁ బ్రధానోపాయంబు. ఇప్పుడు నీవు శివ

మంత్రజపంబునకుఁ గడంగి క్రమంబుగ సద్దేవునిసాక్షాత్కారంబుం బడయుము.

అని యిట్లు బ్రహ్మదేవుం డుపదేశించుటయు సనత్కుమారుండు మానసజపంబుచే మహాదేవుని ధ్యానింప నారంభించెను. అనంతరము సభక్తికంబుగ నాతం డొనరించిన ఋగ్యజుస్సామవేదోక్తంబులగు వివిధమంత్రజపంబులచేతను, వివిధస్తవంబులచేతను, వివిధారాధనంబుల చేతను మహాదేవుండు సంతుష్టుండై ప్రసన్నుండయ్యెను. అప్పుడు సనత్కుమారుండు ధీమంతుండగు నమ్మహాదేవునకుఁ బ్రదక్షిణంబు చేసి యిట్లని స్తుతింపందొడంగెను. మహాదేవా! నీవు చరాచరప్రీతికరుండవు. ధర్మాత్ముండవు. వరదాతవు. సర్వశ్రేష్ఠుండవు. సర్వభూతపోషకుండవు. సర్వతేశ్వరుండవు. యముండవు. భూతసంసారకారణుండవు. గోపతివి. త్రిదశేశ్వరుండవు. సాంఖ్యయోగేశ్వరుండవు. కర్మకుమారుండవు. కమలేక్షణుండవు. శతసూర్యాగ్నినేత్రుండవు. చారునేత్రభూషితుండవు. చతుర్ముఖుండవు. చతుర్దంష్ట్రుండవు. చతుర్బాహుండవు. చతుర్వ్యూహుండవు. చతుర్మూర్తివి. చతుర్వక్త్రుండవు. చతుర్నేత్రుండవు. చతుష్పథుండవు. వాయుకాలాగ్నిరుద్రస్వరూపుండవు. దిగ్వాసనుండవు. మేఘవాహనుండవు. జలాధారుండవు. అనంతుండవు. ధర్మాధర్మయుక్తులగుజీవగణంబుల కధీశ్వరుండవు. శుభకరుండవు. శ్రీకంఠుండవు. కలినాశకుండవు. విష్ణువరదుండవు. సముద్రబడబానలుండవు. దేవాసురుల కజయ్యుండవు. దేవాసురపరాయణుండవు. కపర్దివి. శూలహస్తుండవు. అజుండవు. పరమగతివి. తాపసులకుఁ బరమశ్రేయంబవు. పరమపదుండవు. జీవగణంబులయల్పాధిక్యంబు లెఱింగినవాఁడవు. సూర్యస్వరూపుండవు. అసితాంగుఁడవు. సితాంగుఁడవు. అసితాయతలోచనుఁడవు. నీవు బ్రహ్మచేఁ బ్రస్తుతుండవు. నీనాభిపంకజంబున బ్రహ్మ

దేవుండు నివసించియుండును. నీవు నీలంబులు నుగ్రంబులు నగు జటలను ధరించితివి. శంఖచక్రగదాధరుండవును, లక్ష్మీయుతుండవగుట చే విష్ణుస్వరూపుండవు నగునీకు నమస్కారము. మఱియు గృహస్థుండవును, బ్రహ్మచర్యుండవును, వానప్రస్థుండవును, భిక్షుండవును, వేదకల్పోపనిషన్మంత్రాదులకుత్పత్తిస్థానుండవును, విభుండవును, సర్వలోకంబుల కీశ్వరుండవును, గారణుండవునగునీకు నమస్కారము. దేవా! నీవు పశుపతివి. బ్రహ్మాండసహస్రంబుల ధరించితివి. శతసహస్రయోజనవిస్తృతుండవగుభగవంతుండవు. భూతభవిష్యద్వర్తమానస్వరూపుండవు. శాశ్వతంబులగుభూర్భువస్స్వర్లోకములు నీయందే యుత్పన్నములైనవి. నీమార్గములను, నీవాక్యములను నెవ్వరు నెఱుంగఁజాలరు. మహాయోగివి. యోగేశ్వరుండవు నగునీకు నమస్కారము.

అని యిట్లు సనత్కుమారుండు ప్రస్తుతించుటయు నమ్మహాదేవుండు కమండలుదండధరుండును, చంద్రచూడుండును, వ్యాఘ్రచర్మపరిధానుండును, సింహచర్మోత్తరీయుండును, రుద్రాక్షమాలావిభూషితుండును, నాగయజ్ఞోపవీతుండును, గణసమూహపరివృతుండును నై జటాశిఖండ, పట్టస, ఖట్వాంగ, వజ్ర, శూల, బాణ, హలాయుధంబులను, చంద్రకళామృగచర్మకపాలభీకరచాపంబులను ధరించి వృషభవాహనారూఢుండై సనత్కుమారునియెదుటసాక్షాత్కరించెను.సూర్యచంద్రాగ్నినయనుండగునమ్మహాదేవుని సనత్కుమారుండు పరమానందంబున సందర్శించెను. అనంతరమమ్మహాదేవుండు "సనత్కుమారా! నేను నీయెడల సంతుష్టుండ నైతిని. నన్నవలోకింపుము. దృఢవ్రతుండవును, విశుద్ధుండవు నగునీకు శుభమగుఁగాక! నేను ప్రసన్నవదనముతోఁ జెప్పుచున్నాను. నీవభీష్టం బగువరంబును బ్రార్థింపుము. నీకు క్షేమంబగుఁగాక" అని యనుగ్రహించెను.అప్పుడు సనత్కుమారుండు

"మహాదేవా! మహేశ్వరుండ వగునీదర్శనంబు లభించుటయే నాకు వరంబు. పూర్వము బ్రహ్మదేవునివలన నేను మీదివ్యతత్త్వంబంతయు నెఱింగితిని. మీరు నాయెడలఁ బ్రసన్నులై వరంబు ననుగ్రహింపఁ దలంచితిరేని నాకు మీయెడల నిరంతరభక్తి వర్ధిల్లునట్లు వరంబు దయ చేయుఁడు. మీకంటె నన్యులను నేనెన్నఁడైన ధ్యానించితినేని నా యపరాధంబును క్షమింపుఁడు. నామానసికంబులగుకామలోభంబులను, సర్వేంద్రియలోభంబుచేఁ గలుగు హా్షణంబును క్షమింపుఁడు. ప్రాణాపానవ్యానోదానసమానంబులును, సర్వేంద్రియంబులును, మనంబులును నీవేగదా. ప్రభూ! నీచే నఖిలభూతంబులును యథాకాలంబున సృష్టిస్థితిలయంబులఁ గాంచుచుండును. ఎవ్వనిమనంబు నీభక్తిచే నిర్మలంబు గాకుండునో యాతనిచేఁ బ్రదత్తంబులగువస్తువులను దేవతలు పరిగ్రహింపరు. బ్రహ్మయును మీసృష్టియే. కావున నేను బ్రహ్మపదంబును వాంఛింపను. దేవా! నీవు నాగగంధర్వపిశాచరాక్షసాదిస్వరూపుఁడవై యుండియు మరల వారికిఁ బ్రభుండవై విరాజిల్లుచుందువు. ఈవిశ్వమంతయు నీయదియే గావున నేను త్రికరణశుద్ధిగా నీకంటె నన్యులను భజింపఁజాలను." అని సపత్న్యకుమారుండు ప్రార్థించుటయు భూతేశ్వరుండును, ఉమాపతియు, నగుమహేశ్వరుం డిట్లనియెను.

పరమయోగీంద్రా! నీకు శుభ మగుఁగాక! ప్రధానమునిగణంబులయందు శ్రేష్ఠుండవగు నీకు నానామంబు లన్నియును గోచరింపఁ గలవు. నాలోకమునందలి సకలవ్యక్తులకునుగూడ నవేద్యములగుసకల నామంబులును నీకు సువిదితంబు లగును. దీని కెట్టిసంశయమునులేదు. భవిష్యత్కాలంబున మహాతపస్వి యగుపరాశరనందనుం డుదయింపఁ గలఁడు. ఆధర్మాత్ముండు జ్ఞానియు, సూక్ష్మదర్శియునై వేదవిభాగంబు సేయఁగలఁడు. కమలదళలోచనుండగునాతఁడు నీశిష్యుఁ డగును. నీవు

నిర్మలంబును, విశుద్ధంబును, జ్ఞానమయంబును, కామగమనంబును, అమూల్యరత్నఖచితంబును, ముక్తాజాలాచ్ఛన్నంబును, హేమమయంబును, హేమవేదిసమంచితంబును, దివ్యధూపసురభిళంబును, సుందరకేతనాన్వితంబును, సురాసురసేవితంబును, సూర్యసంకాశంబును, సర్వలోకోజ్జ్వలంబును నగుదివ్యవిమానంబు నధిరోహించి దేవదానవగణపూజితుండవై నాలోకంబునకు రాఁగలవు. అచ్చట మదాదేశంబున నీకు సర్వోత్కృష్టం బగునైశ్వర్యంబు లభింపఁగలదు. అని చెప్పి భగవంతుం డగుమహాదేవుం డంతర్హితుం డయ్యెను.

## — బ్రహ్మగీత. —

బ్రహ్మ యిట్లు చెప్పందొడంగెను. మహాదేవునివరపుత్త్రుం డగుటచే నంబికానందనుండును, బ్రహ్మమానసపుత్త్రుండు నగుసనత్కుమారుండప్పు డీశ్వరానుగ్రహంబున దివ్యదేహలాభంబుగాంచి త్రిభువనంబుల సంచరింపందొడంగెను. మహాదేవుం డగునీశ్వరుఁడే ప్రతియుగంబునను, దాతయుఁ, గర్తయు, సంహర్తయు నై యుండును. సృష్టిస్థితిలయకార్యంబు లాతనివే. ఆయుమాపతిని యజ్ఞేశ్వరుఁడనియు, కృతాంతుఁడనియు, హోత యనియు, హవ్యస్వరూపుఁ డనియు యజ్ఞవిదు లెఱుంగుదురు. విషయేంద్రియసంబంధంబును మహేశ్వరస్వరూపమే. ఆతఁడు జ్ఞానాతీతుఁడు. ప్రశాంతుఁడు. నిర్మలుఁడు. వ్యక్తుండయ్యు నవ్యక్తుఁడు. జ్ఞానాజ్ఞానస్వరూపుఁడు. సాంఖ్యయోగస్వరూపుఁడు. తత్త్వజ్ఞానగమ్యంబగుశివస్వరూపమును దర్శించినవారు మాత్రమే యీసత్యంబు నెఱుంగుదురు. ఎవ్వరు ప్రాణాయామాదిమూలంబున జితేంద్రియులై, స్వయంశుద్ధులై యోగీశ్వరులకుఁ బరమపదస్వరూపుఁడును, సంసారవిమోచనంబున కేకమాత్రప్రభుండును,

అవినశ్వరుండును, యోగప్రయోగస్వరూపుండును, ఓంకారమూర్తియు నగునీశ్వరుని ధ్యానించుచుందురో యట్టియోగీంద్రులు తపోబలంబున నాతనిం బడయఁగలరు. దేవగణదుర్లభంబును, శాశ్వతంబును, విశుద్ధంబు నగునీయోగాచారమునుగూడఁ బరిత్యజించి భేదజ్ఞానవిరహితం బగువ్రతాచరణంబు గావించువారశాంతభావముతో శివవదనవివరంబున విలీనులు కాఁగలరు. సరోవరమునందలికమలములను జలంబు లంటనియట్లే ప్రధానంబగునీశివశ్రుతినాకర్ణించువారిని బాపములంటఁ జాలవు.

అనియిట్లు బ్రహ్మదేవుం డానతిచ్చుటయు ధర్మపరాయణు లగు మహర్షులావాక్యంబు లాకర్ణించి యందఱును గమలాసనునిపాదంబుల కుఁ బ్రణమిల్లి యిట్లుప్రార్థింపనారంభించిరి. దేవా! ధ్యానమే పరమ ధర్మం బనియుఁ బరమపదంబనియు నుపదేశించితివి. కావున నట్టిధ్యాన కరణంబునకు మాకనుజ్ఞ నొసంగుము. మేము నిస్పృహులమై పోయెదము. అని ఋషులప్పుడు ధూపములు,దీపములు,అలంకారములు, ఉపహారములు మొదలగువానితోడను, జపములతోడను, ప్రణవపూర్వక నమస్కారములతోడను, నృత్తగీతవాద్యానుష్ఠానములతోడను మహాదేవోపాసనము గావింప నారంభించిరి. అద్దేవుం డట్లు పూజితుండై సాక్షాత్కరించి వారి కుపయుక్తవరప్రదానంబు లాచరించెను. అవ్యయుం డగుమహేశ్వరుం డిట్లు భక్తు లగువారి కభీష్టదానంబులు సేయుచుండును. ఆమహాదేవుండు సకలాభీష్టదాతలయందు నగ్రగణ్యుఁడు. భక్తవత్సలుఁడు. బ్రాహ్మణాదిచతుర్వర్ణములయందును దయామయుఁడు. సకలతీర్థమయుఁడు. ఎవ్వఁడు విషయాసక్తచిత్తుం డయ్యును భక్తిపూర్వకముగఁ ద్రిరాత్రోపవాసంబు చేసి నిత్యము నీశ్వరు నారాధించునో యాతనికిఁ గర్మనైన ఫలంబు గలుగదు. ఈశ్వరచింతాసక్తులై యు

స్నను నెవ్వరిబుద్ధి భోగాసక్తిని విడువఁజాలదో యట్టివారికిఁగూడ సూక్ష్మంబును, అభౌతికమును నగుయోగజదేహలాభంబు సిద్ధించును. శివాశ్రితులగువారు సంపూర్ణముగా నిష్కల్మషులును రజోగుణరహితులు నగుదురు.

ఇట్లు యతిగణంబుల నుద్దేశించి బ్రహ్మచేఁ జెప్పంబడినయీబ్రహ్మగీతను భక్తిపూర్వకముగఁ బఠించువారును వినువారును రుద్రలోకము నధిగమింతురు. దేవాలయమునఁగాని, బ్రాహ్మణసన్నిధానమునఁగాని దీనిని బఠించువారికి సకలకార్యసిద్ధియగును. ఈబ్రహ్మగీతాతత్త్వమును సంపూర్ణముగ నెఱింగి నిర్మలచిత్తంబున నిత్యమును బఠియించు శివభక్తులు జరామరణవిరహితులై శివసాయుజ్యంబు నందుదురు.

## శివపురవర్ణనము.

సర్వోత్కృష్టంబు లగుబ్రహ్మవిష్ణురుద్రలోకంబుల పరిమాణాదులంగూర్చి సవిస్తరంబుగ బోధింపు మని వ్యాసుం డడుగుటయు సనత్కుమారుం డిట్లనియెను. వ్యాసమునీంద్రా! నలుదెసలయందు నెనుబదియాఱువేలయోజనంబులపరిమాణంబున విస్తృతంబై, అంతియపరిమాణంబున నున్నతంబై పర్వతరాజంబగుమేరుశైలము స్వర్గమర్త్యపాతాళంబులవఱకును వ్యాపించి స్తంభరూపంబున నిలిచియున్నది. స్వర్ణకాంతిమయం బగునాగిరివరంబు దేవగణంబుల కాశ్రయంబు. ఆగిరిశృంగంబులు వివిధకుసుమంబులచే మనోహరంబులై యుండును. ఆశైలదరీకందరములు మయూరమధురనాదంబులచే విలసిల్లుచుండును. శుకపికశారికాదివిహంగములును, గజవ్యాఘ్రభల్లుకాదిమృగములును, మృగరాజములు నందు విహరించుచుండును. అందు స్వర్ణస్తంభశోభి

తము లగుగృహసమూహములు గలవు. ఆసుందరపర్వతమునఁ బ్రభా
సదేవగణములును, కుబేరాదియక్షగణములును, నారీగణసహితులగు
చిత్రసేనాగంధర్వులును, విద్యాధరగణములును, గంధర్వరాజసహితు
లగుహాహాహూహూతుంబురుప్రభృతులును బరమానందమున విహ
రించుచుందురు. చంద్రకిరణములవలె నతివిమలము లగుజలములతోఁ
బ్రవహించుచుండు నందలినిర్ఝరప్రవాహశబ్దము లాలించి మేఘగంభీర
స్వనములుగ భావించి మయూరము లానందనృత్యములు గావించు
చుండును. అందలిగంగాజలపతనస్థానమునందు దేవతాగణము లాత్మ
సాన్నిధ్యమున నిందిరయగణంబులం బోలి భాసిల్లుచుందురు. సుంద
రం బగునాభూమీధరంబు నాశ్రయించినజీవు లందఱును స్వర్ణవర్ణులై
యనుపమానం బగునాగిరిమూర్ధంబున వర్ధిల్లుచుందురు. అందలిసురభి
ళానిలంబులు పవిత్రంబులును, మధురస్వరసమంచితంబులు నై యుం
డును. దేవతోద్గర్భంబును, సర్వోత్కృష్టంబు నగుస్వర్గం బచ్చటనే
యున్నది. అత్యున్నతం బగునాశైలంబున సూర్యచంద్రాదిగ్రహం
బులు ప్రకాశింపఁజాలవు; మేఘములు నివసింపఁజాలవు; పర్జన్యుండు
వర్షింపఁజాలఁడు. శివానుగ్రహంబులేక దేవతలును మహర్షులునుగూడ
నామహీధరమును మనసుచేనైన దర్శింపఁజాలరు.

అందు వాసనావిరహితు లగుమహాత్ములకు నివాసయోగ్యంబు
బును, సువర్ణమయంబు నగువిజయభువనంబును, విజయానదియును
విరాజిల్లుచుండును. ఆపురంబునం దష్టాదశసహస్రయోజనపరిమితంబు
లును, సువర్ణప్రాకారశోభితంబులును, రమ్యకేతనమాలికావిలసితంబు
లును, రమణీయంబులు నగుదివ్యమందిరంబులు గలవు. ప్రతిగృహం
బును ద్వారసహస్రంబులచే భాసిల్లుచుండును. ప్రతిద్వారంబునను
బాలార్కసదృశకాంతిసంపన్నులును, పవిత్రకర్ములు నగుబ్రాహ్మణులు

ప్రకాశించుచుందురు. మఱియుఁ బూర్ణకుంభపరిశోభితంబులును, విపులముక్తాదామవిరాజితంబులును, వివిధపుష్పహారవిలసితంబులును, అగురుధూమసురభిళంబులును, బుష్పమాలికాసమన్వితంబులు నగుస్వస్తికాదిగృహంబు లందెన్నియో గలవు. ఆపురంబు రక్షకగణంబులచే సురక్షితంబై విపులైశ్వర్యసమంచితంబులును, బ్రాకారవేష్టితంబులు నగుగృహపంక్తులచే నిండియుండును. అందుఁ గైలాసగిరిశృంగంబుల వలె విరాజిల్లుప్రాసాదంబులు గలవు. అందలిస్వర్ణభవనంబులు జ్వాలానిలసన్నిభప్రదీప్తంబులై యుండును; కొన్నిమణిమయగృహంబులు శరత్కాలోదితగ్రహంబులవలెఁ బ్రకాశించుచుండును. ఆపర్వతరాజంబున మహాదేవునివిశాలభవనంబు గలదు. అందుఁ బ్రపంచమునందలి సకలపదార్థంబులును గలవు. అది సప్తసహస్రస్తంభంబులపై నిర్మింపఁబడినది. దానికి నలుదెసలను విశాలంబు లగుపరిష్కృతప్రదేశములును, రమ్యకాననంబులును గలవు. ఆభవనంబు ముక్తాదామభూషితంబు లగుగవాక్షమాలికలతోడను, సుందరయవనికాసమంచితంబు లగువిపులద్వారంబులతోడను రమణీయంబై యుండును. ఆద్వారంబు లన్నియు వివిధరత్నకేతనసమన్వితములై యుండును. అందు సుందర పుష్పఫలభూరుహంబులును, పారిజాతంబులవలె సుందరవరవర్ణంబు లగుస్వర్ణకదళీవృక్షంబులతోఁ గూడినయారామంబులును, నదులును, తటాకంబులును, బర్వతంబులును, వాపీకూపప్రహ్రదాదులును గలవు. ఆజలాశయంబు లన్నియు సరసకమలవిసితంబులును, మదభ్రమరఝుంకారస్వనకలితంబులు నై యుండును. అందలికదంబభూరుహపల్లవంబులపై శుకపికశారికామయూరాదివిహంగములు విహరించుచుండును.

ఆశివపురంబున కేనిమిదిపురద్వారములు గలవు. అందుఁ దూర్పునను న్నమొదటిశ్రీద్వారమునందు పద్మమాలికావిభూషితుండును,

దపోనిధియు, శైవుండు నగుమహాసిద్ధుండు నివసించియుండును. అనంతరము లక్ష్మీద్వారంబునందు మహాబలవంతుఁడును, నీలనీరదదీర్ఘకాయుఁడును, భగవానుండునగుమహాకాలుండు శూలపాణియై నిలిచియుండును. దానికి దక్షిణమున శివాజ్ఞచే మహాబలుం డగుగండకర్ణుండు నివసించు శివపురంబు గలదు. ఆసమీపముననే యనేకవిధబ్రాహ్మణులు నివసించియుందురు. పశ్చిమంబున వరుణద్వారము గలదు. మహాత్ముం డగుగణేశ్వరునిచేఁ బరిపాలితంబగునచ్చట నందీశ్వరుండుండును. ఉత్తరమునఁ గీర్తిద్వారముగలదు. అందును బ్రాహ్మణులు నివసించియుందురు. వరుణార్కసదృశుండగుమహేశ్వరుం డాద్వారమునకు రక్షకుండై వివిధములగుక్రీడాపరికరంబులచే నందుఁ గ్రీడించుచుండును. జితక్రోధులును, జితలోభులును, జితేంద్రియులును, రుద్రభక్తులునగు బ్రాహ్మణ్యులు భక్తిబలంబుచే నీశివలోకమును జేరఁగలుగుచుందురు. శాస్త్రాభ్యాసనిరతులును, వేదజ్ఞులును, యోగులును, నిరంతరశివభక్తలును, ధార్మికులును, గృహస్థులు నగుబ్రాహ్మణులును, ధర్మయుద్ధమున రణరంగమరణము గాంచినవారును, గోమిత్రరక్షణమునకును, ధర్మరాజ్యపాలనమునకును బ్రాణత్యాగంబు చేసినవారును నగుక్షత్త్రియులును, జితేంద్రియులును, సత్యవ్రతులును, స్వధర్మపరాయణులు నగు వైశ్యులును, మఱియు బ్రాహ్మణహితాభిలాషులును, రుద్రేంద్రవిష్ణుగతప్రాణులును, సహస్రగోదాతలును, భూసురవస్త్రాదిదాతలును, సకలజీవప్రియంవదులును, వేదపారనిరతులును, ధ్యానాసక్తులును, వ్రతానుష్ఠానపరాయణులును, ప్రచురదక్షిణలతో యథావిధిగ యజ్ఞంబులు చేసినవారును శివలోకము నధిగమించి యథాసుఖంబుగఁ గాలయాపనము సేయుచుందురు. అట్టివారు చిరకాలము శివలోకసుఖంబు ననుభవించి యనంతరము భూలోకమున విశుద్ధబ్రాహ్మణకులమున నవతరించి చిరా

నందభోగులై లోకంబు నానందింపఁజేయుచుండురు. ఇది సకలార్థ సంపన్నంబును, సర్వాభీష్టసాధకంబు నగుశివభువనవృత్తాంతంబు—

ఇఁక రజతశృంగమునందున్న విష్ణుదేవునిసర్వోత్తమభువనంబును గూర్చి చెప్పెదను. ఆవిష్ణుపురంబున కాశ్రయం బగుసుమేరురజతశృంగము చంద్రికిరణనిర్మలంబై ప్రకాశించుచుండును. అది త్రిసహస్ర యోజనపరిమితంబును, విచిత్రకేతనాలంకృతంబును, వివిధాలంకార విభూషితంబును, దివ్యరజతప్రాకారావృతంబును, మహాదేవప్రభావంబున సకలసుఖభోగస్థానంబునై విరాజిల్లుచుండును. ఆలోకంబు దివ్యరత్నఖచితంబులును, విచిత్రంబులునగుపురద్వారములతోడను, రజతమయంబులగుసహస్రద్వారంబులతోడను నొప్పుచుండును. అందు ద్విసహస్రస్తంభశోభితంబగునున్నతప్రాసాదము గలదు. ఆపురమధ్యమునఁ గైలాసపర్వతముం బోలి సుందరంబును, వివిధరత్నసమాకీర్ణంబును, నానావృక్షలతాపరివృతంబును, గైరికాదిధాతుచిత్రితంబును, చతుర్ద్వారసమన్వితంబును, విష్ణుపదనామకంబును నగునొకరజతమయభవనంబు గలదు. ఆభవనముఖద్వారంబున హృదయజ్ఞుండును, బలవంతుండును, శ్రీకృష్ణతుల్యాకారుండు నగుద్వారాధ్యక్షుండు కాచుకొనియుండును. పశ్చిమద్వారమునందు విష్ణుదేవునకుఁ బ్రాణప్రియుండును, మహాకాయుండు నగుహరిభద్రుండు ద్వారపాలకుఁడై యుండును. ఆపురంబున సువర్ణకమలశోభితంబును, హంసచక్రవాకాదిజలవిహంగసమన్వితంబును, అభిమతవిహారోపయుక్తంబు నగుమధుమతీ నది ప్రవహించుచుండును. నిరంతరశివపూజాధురంధరులును, నిత్యాగ్నిహోత్రులు నగువారందు భయశోకశూన్యులై బహుకాలంబు సుఖంబులనుభవించి యనంతరము భూలోకంబున సత్కులమునం దవతరించి శక్త్యనుసారంబుగఁ బుణ్యకర్మంబులాచరించి మఱల నచిరకాల

మునసే యాలోకంబు నధిగమించుచుందురు. ఇది విష్ణులోకవృత్తాంతంబు.

ఇఁక బ్రహ్మలోకంబునుగూర్చి ప్రశంసించెదను. మేరుపర్వత తృతీయశృంగంబున లోహితరత్నమయంబును, బద్మాకారంబును, ద్విసహస్రయోజనపరిమితంబును, మణిమయంబును, సువర్ణప్రాకారపరివృతంబును, విశోకనామకంబు నగుబ్రహ్మపురంబు గలదు. అది విచిత్రశిఖరత్రయాలంకృతమై, సూర్యచంద్రనిభసముజ్జ్వలంబై యుండును. అందు సహస్రస్తంభప్రతిష్ఠితంబును, బ్రాసాదశ్రేణీపరివృతంబును, బహుగవాక్షశోభితమును, చతుర్ద్వారసమన్వితంబు నగునొకభవనము గలదు. అందు దివ్యరత్నాలంకారభూషితుండును, సజలజలదశ్యాముండును, సూర్యానలసన్నిభతేజోమయుండును ద్వారాధిపనామకుండు నగుద్విజశ్రేష్ఠుండు ద్వారపాలకుఁడై యుండును. ఉత్తరద్వారమున సాంధ్యారుణకాంతివిలసితుండగు పరయముండను బ్రహ్మపుత్త్రుండు నిలిచియుండును. ఆశ్రేష్ఠపురమున నద్వితీయవేదజ్ఞుండును, సురశ్రేష్ఠుండును, బ్రజాపతియు, భగవానుండు నగుబ్రహ్మదేవుండు విహరించుచుండును. అందు సువర్ణవాలుకామయుం బగునమృతనది ప్రవహించుచుండును. ఆనదీజలపానంబున నగరవాసులెల్లరును జరాశోకశ్రమశూన్యులై యుందురు. ఆబ్రహ్మలోకంబును వేదాధ్యయతత్పరులగు సుకృతులును, జితేంద్రియులును, సత్యపరాయణులుఁ నగుమహాత్ములు వడయఁగల్గుదురు. మఱియు యజ్ఞకర్తలును, దాతలును, గురుజనప్రియకార్యనిరతులును, భిక్షామాత్రజీవులగు తీర్థవాసులును, క్రోధశూన్యులును, ధర్మాసక్తులునగుబ్రాహ్మణులును, యోగధ్యానపరాయణులును, నిరంతరబ్రహ్మనిష్ఠులు నగువారికి బ్రహ్మసాక్షాత్కారము సులభంబై యుండును. బ్రహ్మలోకార్థులై నిష్పాపకర్మానుష్ఠానంబు

గావించువారు శోకమోహశూన్యులై పరమస్థానంబగు బ్రహ్మలోకం బుఁ జేరి, బహుసహస్రకల్పంబు లందు సుఖభోగంబు లనుభవించి పిదపఁ గర్మశేషంబున భూలోకప్రాప్తులై విశుద్ధాచారసంపన్నులై యథావిధిగ యజ్ఞాదిక్రియల నిర్వర్తించుచుఁ బరమసుఖలాభంబు లందఁగలరు. జితక్రోధులును, జితేంద్రియులును, సాత్వికులు నగు మహాత్ములు జ్ఞానబలంబున సర్వపూజ్యంబగు బ్రహ్మలోకంబు నందఁ గలరు. ఈ బ్రహ్మలోకంబు సనాతనంబని కీర్తింపఁబడుచున్నది.

మునీంద్రా! పర్వతరాజం బగుమేరుశైలంబున మూఁడుశిఖర ములయందును బూర్వోక్తం బగుభువనత్రయంబు విరాజిల్లుచుండును. ఆభువనములయందు నివసించు దేవగణంబులు సర్వసిద్ధిసంపన్నులును గామరూపులునై యిచ్ఛానుసారంబుగ విహరించుచుందురు.

బ్రహ్మాత్మోపదిష్టం బగునీత్రిభువనసంకీర్తనము నతిభక్తిపూర్వక ముగ నాలించువారును, బఠించువారును శోకమోహశూన్యులై సర్వాభీష్టముల నందఁగలుగుదురు. దీనిని శ్రద్ధతోఁ బఠించినమహా పాతకుండైనను మహాదేవప్రసాదమునఁ బరమపదప్రాప్తిం జెగును.

## —♦ రుద్రలోకవివరణము. ♦—

వ్యాసదేవుండు పుణ్యకర్మమాహాత్మ్యంబునుగూర్చియు, రుద్ర దేవప్రియంబులగుపవిత్రస్థానంబులనుగూర్చియు, బ్రహ్మాండగర్భంబున లోకోత్పత్తింగూర్చియు బోధింపు మని ప్రశ్నించుటయు సనత్కుమా రుం డిట్లనియెను. మానవపరిమాణానుసారంబుగా లక్షయోజనముల కూర్ధ్వమున బ్రహ్మలోకమును, దద్విగుణితదూరమున విష్ణులోకమును దానికిఁ గోటియోజనములమీఁద శివలోకంబును గలవు. పంచభూతా తిరిక్తం బగుసప్తపదార్థము బ్రహ్మలోకం బనియు, సప్తమము విష్ణు

లోకం బనియు, సప్తమము రుద్రలోకంబనియు, నీలోకత్రయంబే త్రివిష్టపంబనియుఁ బ్రసిద్ధము. అందు బ్రహ్మవిష్ణుమహేశ్వరప్రభృతులును, ప్రజ్ఞాబలవంతులగు దేవమానవగణంబులును నివసించియుందురు. ఆ త్రిభువనములలో నర్ధభాగంబగు రుద్రలోకంబు యోగిగణాశ్రయంబై యుండును. అందు శతసహస్రరుద్రులును, శతకోటివిష్ణుదేవులును గలరు. శివప్రసాదమున వారందఱును ఖడ్గయష్టిధరులును, బుష్పసుగంధకలితులును, శూలపాణులును, ద్వేషశూన్యులును, గతకిల్బిషులును, బాలచంద్రావతంసులును, వృషభవాహనారూఢులునై విరాజిల్లుచుందురు. బ్రహ్మవిష్ణులోకములవారు త్రిభువనవిఖ్యాతులును, మహాత్ములునై యుందురు. అందలిభూప్రదేశము రత్నమయంబును, సువర్ణవాటికామయంబునై యుండును. అందుఁ జంద్రసూర్యప్రకాశము గాని, వాయుసంచారముగాని లేదు. దేవతలుగూడ నందుఁ బ్రవేశింపఁ జాలరు. అందలివారందఱును సాక్షాత్సదాశివమూర్తులై యుందురు. అచ్చటిప్రాసాదంబులును, బురద్వారంబులును నానావిధచిత్రచిత్రితంబులై యుండును. ఆశివలోకమున బ్రాహ్మణాదిగృహస్థు లందఱును సన్మార్గసంచారులై మహాదేవునిబూజించుచు, నిత్యమును రుద్రాధ్యయమును బఠించుచు గంధపుష్పాదులచే నిరంతరమహాదేవారాధనంబునఁ బాపవిముక్తులై సూర్యసమతేజోనిధులై ప్రకాశించుచుందురు. ఆ రుద్రలోకమున కధోభాగంబుననే సకలలోకంబులు నున్నవి. సదాశివునిద్వితీయలోకంబు సర్వభువనంబులకును ద్విగుణపరిమితంబై యుండును. విష్ణులోకమునకు ద్విగుణపరిమితంబును ద్వితీయంబు నగుభవలోకంబునందు మహాయోగీంద్రుం డగునీశ్వరుండు భూతగణపరివృతుండై క్రీడించుచుండును.

అందొకదివ్యభవనంబున మాయానాథుండగుశివుండు నివసించి

యుండును. మఱియు నాస్థానంబున సర్వసమృద్ధంబులగుదివ్యమందిరంబు లనేకములు గలవు. సర్వనామకం బగుపరిభుస్థానము చతుర్థలోకంబు. పరమపవిత్రం బగునగ్నిస్థాన మాదేవునిపంచమలోకంబు. నిత్యాగ్నిహోతులగువారికాస్థానంబు లభించును. దానికవ్వలమహాదేవుని యుగ్రనామకంబగుషష్ఠస్థానంబు గలదు. అది యగ్నిలోకమునకు ద్విగుణపరిమితంబై యుండును. అచ్చటఁ బరమేశ్వరుండు శివభక్తులగు యోగీంద్రులతోఁ గలసి భస్మధారియై లోకానుగ్రహంబుకొఱకుఁ గ్రీడించుచుండును. శమదమసంపన్నులును, సర్వభూతదయాపరులును శివపూజాతత్పరులును, స్వధర్మానుష్ఠాననిరతులును, భిక్షామాత్రోపజీవులును, మహాయోగులు నగువారు పాశుపతం బగునాదివ్యస్థానమును జేరఁగలుగుదురు. అందుఁ జేరినవారికిఁ బునర్జన్మంబు లేదు. దానికూర్ధ్వంబున నాస్థానంబునకు ద్విగుణపరిమితంబగు మాహేశ్వరం బను సప్తమస్థానంబు గలదు. అందాద్యాప్రకృతిసహితుండగుమహాదేవుండు శైవగణపరివృతుండై యుండును. మఱియు సర్వభూతేశ్వరుం డగు నమ్మహాదేవుండు కామరూపధారియై నిఖిలభూతంబులయందును బ్రవేశించి యానందవర్ధనంబు గావించుచుండును. ఇట్టిశివలోకంబులసంఖ్యకును, బరిమాణంబులకును నిర్ణయంబు లేదు. ఆదిదేవుం డగునాతఁడిచ్ఛామాత్రంబున సహస్రబ్రహ్మలోకంబులను, గోటిదేవలోకంబులను సృష్టించుచుండును. ఇన్నింటికిని బైభాగమున నమ్మహేశ్వరునిస్థిరస్థానంబు గలదు.

## —♦ శి వ మా హా త్మ్య ము. ♦—

ఆదివ్యస్థానంబును బరమేశ్వరానుగ్రహంబు లేక బ్రహ్మాదిదేవతలును, యోగులును, నాత్మీయులగు నన్నపూర్ణాగణేశ్వరాదులును

గూడఁ జేరఁజాలరు. అందు శతకోటియోజనవిస్తీర్ణం బగునుపవీరం బున నివసించి యవ్యయుం డగుశివుండు సమాధిసుఖంబు ననుభవించు చుండును. ఆదేవునినయనద్వయంబు సితాసితప్రభంబై యుండును. అందొకనయనంబునుండి యశస్విని యగునుమాదేవి యుదయించుటచే నాతనికి వామలోచనుం డనునామంబు గలిగెను. ఆదేవి యాతని వామపార్శ్వంబున నాసీనయై యుండును. మఱియు నద్దేవునిదక్షిణ నయనమునుండి శుక్లవర్ణం బగుజలబిందువు వెలువడి భూతాదిసకల లోకంబులను నిర్గమించి భూలోకంబునఁ బ్రవేశించి యందు గంగానా మంబునఁ బ్రఖ్యాతం బయ్యెను. యోగనిమగ్నుండైన యాదేవుని ప్రథమకార్యంబు గంగోత్పాదనము. యత్నశీలుం డగుబ్రహ్మ నుపే క్షించియుఁ గామదేవు నశరీరుం గావించుట రెండవకార్యము. బ్రహ్మ ముఖచ్ఛేదనంబు గావించి కపాలంబును ధరించుట మూడవకార్యము. విష్ణుదేవునకుఁ జక్రప్రదానంబు సేయుట నాల్గవకార్యంబు. దక్షయజ్ఞా వసరంబున వీరభద్రావిర్భావనంబు పంచమకార్యంబు. బాలార్కకాం తిభాసితు లగురుద్రగణంబులచేఁ బరివృతుండై హిమాలయంబు నధి గమించి యందంధకాసురసంహారంబు గావించుట షష్ఠకార్యంబు. ఆదేవుని ద్వితీయపరివార మప్పటిరుద్రగణంబులకు ద్విగుణితంబై యుండును. తృతీయపరివారము సువర్ణవర్ణు లగుమూఁడుకోట్లరుద్ర గణంబులతోఁ గూడియుండును. చతుర్థపరివారము నీలవర్ణులగు నెను బదికోట్లరుద్రగణంబులతోడను, పంచమపరివారము దానికి ద్విగుణం బుగను, గైరిక, విమల, నీలవర్ణంబులగు రుద్రగణంబులచేఁ గ్రమం బుగ షష్ఠసప్తమాష్టమపరివారంబులును విరాజిల్లుచుండును. ఈసమస్తపరి వారగణంబులలోఁ గొందఱు బ్రహ్మానుచరులుగను, గొందఱు విష్ణుపు రోగాములుగను జరించుచుఁ ద్రైలోక్యంబునను సృష్ట్యాదికార్యంబులఁ

గావించుటకు సమర్థులై యుందురు. ఇట్లానందమయంబును, విశుద్ధం బును, బరమంబు నగుశివస్థానముంగూర్చి సంకీర్తనంబు సేయువారు సురాపాయులును, పితృహంతకులును, గోఘాతుకులును, గురుదారాసక్తులును నై యున్నను బాపవిముక్తులై పవిత్రశివస్థానంబు నధిగమించి నిత్యసుఖులై యుందురు. విశుద్ధులును, శివపరాయణులును, బ్రహ్మనిష్ఠులు నగువారి కట్టిపదంబు సులభసాధ్యంబై యుండును.

—: శివ స్తోత్ర కథనము. :—

సనత్కుమారుం డిట్లనియెను. వ్యాసమునీంద్రా! సకలపాపభయనివారకం బగునొకవిషయముం జెప్పెద నాకర్ణింపుము. పూర్వకాలంబున బ్రహ్మేంద్రాదిదేవతలు మహాదేవమాహాత్మ్యంబు నాకర్ణించుకుతూహలంబున మేరుశైలంబుఁ జేరి పరమేశ్వరు నాశ్రయించి యుండిరి. అప్పుడు సత్యాశ్రయుండును, శాంతుండును, వినీతుండును, జితేంద్రియుండు నగువిభీషణుం డట కేతెంచి సర్వభూతేశ్వరుం డగు నీశ్వరునకు సవినయంబుగ సాష్టాంగప్రణామంబు చేసి "దేవదేవా! వృషభధ్వజా! ఈదేవతాగణంబులకును బ్రార్థనీయం బగునాసందేహమును దీర్పవలయును." అని యభ్యర్థించుటయు శంకరుం డిట్లనియెను. మహారాజా! విభీషణా! నీవడిగిన యీవిషయం బతిగోపనీయంబు. ఛాగలాంగము, భద్రకర్ణము, గోకర్ణము, వారాణశి, ఉజ్జయిని యనునీపంచస్థానంబులును, మహాదేవుని శ్రేష్ఠనివాసస్థానంబులు. ఈసకలస్థానంబులను దర్శించినంతమాత్రమున జీవులకు మోక్షపదలాభంబు గలుగును. అందు విశేషించి కాశీక్షేత్రంబున నేను నిత్యసన్నిహితుండనై యుందును. ఇది పరమ రహస్యంబు. ఎవ్వఁ డోంకారస్వరూపి యగుమహాదేవుని ధ్యానించుచుండునో యాతనిమో

డల నేను నిత్యంబును సంతుష్టుండనై యుందును. అట్టివాని కశ్వమేధఫలంబు లభింపఁగలదు. పూర్వోక్తంబు లగుపంచస్థానంబులయందు నేస్థానంబు నేను జాగరూకుండనై జీవులకు ముక్తిదానంబుసేయుచుందునో యట్టికాశీక్షేత్రంబున సుకృతిరహితులకు దుర్లభంబును, నగ్నిప్రాకారపరివృతంబును, దేవతామందిరపరివేష్టితంబు నగుమద్భవనంబు గలదు. మఱియు రమణీయం బగుహరిశ్చంద్రపదంబున రుద్రరూపంబునను, యోగీశ్వరప్రదేశం బగుపన్నాపురియం దాదికేశవరూపంబునను, తిరువనంబున దండధరుండనై మహాకాలరూపంబునను, నేను విరాజిల్లుచుందును. భైరవంబును, గమలంబును నాదిగాఁగలస్థానంబులయందాయామూర్తులం దాల్చియుందును. మఱియుఁ గాలంజలపర్వతంబునఁ గర్కటేశ్వరుండనై యుందును. భూతేశ్వరంబునఁ వామకూటుండనై, పరమగుహ్యం బగుకేదారంబునఁ గేదారనాథుండనై తోఁచుచుందును. ఆకేదారంబున దేవదారువనంబున నేనెల్లప్పుడును విహరించుచుందును.

ఇవియే పరమగుహ్యంబు లగునాపవిత్రస్థానంబులు. నిరంతరమును నన్ను ధ్యానించుచుండునాభక్తు లీదివ్యస్థానంబుల నివసించి సర్వశ్రేష్ఠులై యుందురు. ఆపుణ్యక్షేత్రయాత్రలఁ గావించువారు చిరకాలము రుద్రలోకనివాసులగుదురు. పాపాత్ములైనను, ఘోరకర్ములైనను, స్త్రీలైనను, నపుంసకులైనను, మ్లేచ్ఛులైనను మఱియెవ్వరైన నెల్లయిన బవిత్రంబు లగునాదివ్యక్షేత్రములను దర్శింపఁగలిగినచో నిఁక వారెట్టియపవిత్రస్థలంబుల మృతులైనను, శివసాయుజ్యంబు నందఁగలుగుదురు. అట్టిపుణ్యాత్ములకు నేననుగ్రహపూర్వకముగ గణాధిపత్యంబును బ్రసాదింతును. భక్తులగువారు సకలపాపవిముక్తులై నాసన్నిధానంబుఁ బడయునభిలాషం బొందుదురు. అట్టివారికి యజ్ఞ

దానాదిసత్కార్యంబులతో నిమిత్తంబు లేదు. వారు భక్తిబలంబున నన్నుం జేరి యజ్ఞదానాదిఫలంబు లనుభవించుచుందురు. అతిఘోరం బగుతపంబు నాచరించుటవలనం గలుగుఫలంబు నన్నుం బూజించుట చేతనే లభింపంగలదు. మదీయం బగుశివలింగంబు సర్పించువారికి మాఘమాసంబునం బ్రయాగతీర్థస్నానఫలంబును, శతాహోరాత్రస్నానఫలంబును, శతచాంద్రాయణానుష్ఠానఫలంబును లభించును. గోమూత్రమిశ్రితంబగుయవాహారంబును, భిక్షాలబ్ధంబగుశాకాన్నభక్షణంబును గావించి సహస్రసువర్ణదానంబులు సేయువారి కెట్టిఫలంబు గలుగునో నన్నుం బూజించువారి కట్టిఫలంబు లభింపంగలదు. నాలింగార్చనంబు గావించుబ్రాహ్మణుల కష్టశతప్రస్థపరిమితంబగుతిలదానంబు చేసినఫలంబు లభించును. మహాపాతకములు గావించినవారుగూడ మల్లింగార్చనంబునం బరమగతిం గాంచంగలరు. తపశ్చరణంబును, మానసపూజయు, దానంబును, యోగాభ్యాసంబును, కఠోరవ్రతాచరణంబును, శివలింగార్చనంబుతో సమములు గాంజాలవు. విభీషణా! నేను ప్రతియుగమునను సృష్టిస్థితిలయంబులం గావించుచుందును. సర్వభూతకారణం బగుపరమాత్మను నేనే. బ్రహ్మయు, విష్ణుండును, జంద్రుండును నేనే. పరిదృశ్యమానంబగునీసమస్తంబును నాస్వరూపం బని యెఱుంగుము. పరమప్రమాణంబులగు శాస్త్రంబులకు నేనే కర్తను. మఱియు నింద్రాదదేవగణంబులును, వసంతాదిఋతువులును, గంగాదినదులును, వాసుక్యాదినాగగణంబులును, కైలాసాదిపర్వతంబులును, బ్రహ్మోదాదివైష్ణవగణంబులును, లవణాదిసముద్రంబులును, స్థావరజంగమస్వరూపంబు లగుసమస్తమును మత్స్వరూపంబనియు, నాకంటె నన్యం బగుపదార్థంబేదియు లేదనియు గ్రహింపుము. వత్సరముగాని, మాసముగాని, పక్షముగాని, యేకాహోరాత్రముగాని శివపూజాపరా

యణుండగువాఁడు నాయందు సత్యబుద్ధి యగుటంజేసి సర్వాభీష్టంబు లను బడయఁగలఁడు. పవిత్రహృదయముతో విశుద్ధబ్రాహ్మణునకు దీపదానంబు చేయువానికి శివలోకగమనమును, సువర్ణదానము సేయు వానికి గణాధిపత్యలాభమును గలుగును. అర్ఘ్యపాత్రప్రదాతలకును, ధూపదాతలకును నాయనుగ్రహమున బవిత్రగతిప్రాప్తి యగును. శివ లింగార్చనమున బహుయజ్ఞానుష్ఠానఫలంబును, సర్వాభీష్టసిద్ధియు నగు ను. పుణ్యాత్ము లగునట్టివారిదోషములు నశించి యుత్తమగతిప్రాప్తి యగును. శివపూజాపరాయణులగువారికిఁద్రికరణంబులఁ గావించిన పాపంబులు నశింపఁగలవు. ఏకవత్సరము శివలింగార్చనము గావించిన వానియెడల నేను సంతుష్టుండనై వానికి గణాధిపత్యంబును బ్రసాదిం తును. ఎవ్వనిచిత్తము తీర్థస్నానంబులకును, శివధ్యానంబునకును, బరా ఙ్ముఖంబు గాకుండునో యాతనియింటఁ బ్రభాసపుష్కరప్రయాగాది తీర్థంబులు సుస్థిరంబులై యుండును.

శివసేవావిహీనుం డగునరాధముండు కోటితీర్థంబుఁ బరిభ్రమిం చినను వృథాశ్రమంబు కాఁగలదు. అట్టివారికిఁ బుణ్యలాభంబు గలు గనేరదు. పాపచిత్తులగువారు నన్ను దర్శింపఁజాలరు. మదర్చనామా త్రంబున మాసోపవాసఫలంబు లభించును. అరణ్యమునఁగాని, గిరిగు హాంతరమునఁగాని, గృహంబునఁగాని యేకాగ్రచిత్తంబున నన్నర్చించు వాఁడు మరణానంతరంబున రుద్రగణలోకంబున గణాధిపత్యలాభంబు నందును. శివమాహాత్మ్యప్రకాశకం బగునీయధ్యాయమును బఠించు వాఁడును, గీర్తించువాఁడును సర్వపాపవిముక్తుండై శివలోకంబున సద్గతి లాభంబు నందఁగలఁడు. ఈమాహాత్మ్యంబును నిత్యధారణంబు గావిం చుశివపూజాపరాయణుఁడు దారుణనరకంబును దగ్ధించి సూర్యచంద్రాదు లచే నప్రకాశితంబగుదివ్యస్థానమున నపరిమితతేజస్సంపన్నుఁడై ప్రకా

శించుచుందురు. దేవార్చనాదిపుణ్యకార్యప్రారంభములయందు మం
త్రరూపంబును, సర్వభూతనమస్కృతంబును నగునీమాహాత్మ్యమును
విశుద్ధభావముతోఁ బఠించువారును, గవచరూపంబున ధరించువారును
నాయనుగ్రహంబున సకలపాపవిముక్తు లగుదురు.

అని యిట్లు సర్వేశ్వరుం డానతిచ్చుటయు విభీషణుండు భక్తి
పూర్వకంబుగ నిట్లని వినుతింప నారంభించెను. సర్వభూతేశ్వరా! విశ్వ
తోముఖుఁడవు, అక్షయుఁడవు, అప్రమేయుఁడవు, పురాణుఁడవు, పురు
షోత్తముఁడవు నగునీకు నమస్కారము. అగ్నియు, అనలుండును,
అఘోరుండును, భక్తనదీసాగరుండును, దేవగణప్రభుండు నగునీకు
నమస్కారము. సర్వలోకపూజనీయుండ వగునో దేవదేవా! అక్షమా
లాలంకృతా! మహాప్రభూ! నీభక్తుండ నగునాకష్టైశ్వర్యములను
బ్రసాదింపుము. సర్వభూతంబులకును నీవేకమాత్రశరణ్యుండవు. సక
లర్షిగణంబులును నిన్నారాధించుచుందురు. మహాత్మా! ఉత్తమవరప్ర
దానంబున నన్ననుగ్రహింపుము. మోక్షంబును, ఇంద్రుండును, అగ్ని
యుఁ, బుణ్యంబులగుధర్మకార్యంబులయందుఁ బండితులసంకల్పంబును
నీస్వరూపంబులు. తుష్టియు, శరీరంబును, మేధయు, బుద్ధియు, కా
మ్యంబులును, మనంబును నీవ. అతివిశుద్ధంబును, శివంబు నగునీరూ
పమును దేవతలును, ఋషులును సందర్శించుచుందురు. నీవు శాంతి
స్వరూపుఁడవు. పరమాత్మవిదుండవు. నిఖిలజీవానందవర్ధనుండవు.
పరమేశ్వరా! రుద్రా! త్రిలోకవర్తనుండ వగుశివా! నీకు నమస్కా
రము. విశ్వమూర్తీ! నీచరణంబులును, నయనంబులును, మస్తకంబు
లును, వదనంబులును నెల్లయెడల నిండి యున్నవి. నీ వప్రమేయుండ
వు. యోగీశ్వరుండవగునీ విచ్ఛామాత్రంబున దేహధారణంబు గావిం
చుచుందువు. నీభూతభవిష్యద్రూపంబుల మేమెంతమాత్రము నెఱుం

గంజాలము. ప్రభూ! నీస్వరూపం బెట్టిదై ననేమి. అట్టినీమూర్తికి నమస్కారము. అని యనేకవిధంబుల స్తుతించుచున్నవిభీషణుం గాంచి మహాదేవుండు ప్రసన్నహృదయంబున నిట్లనియెను.

విభీషణా! అతిపవిత్రంబును, దేవగణపూజితంబును, మదుక్తంబు నగునీసంవాదమును బఠించువాని కశ్వమేధఫలంబు లభించును. బ్రహ్మచింతాపరులై లింగార్చనంబు గావించువారికిని, అష్టమీచతుర్దశీతిథులయందు శివమాహాత్మ్యశ్రవణంబు సేయువారికిని, శ్రద్ధావంతులకును, శివభక్తులకునుమాత్రమే మదుక్తం బగునీరహస్యంబు నుపదేశింపవలయును. కాని యన్యుల కుపదేశింపరాదు. ఈశివస్తవంబు నాకర్ణించువారికి స్వర్గలాభంబు గలుగును. ఇందెంతమాత్రమును సందియంబు లేదు.

## శివలింగార్చనవిధి.

యజ్ఞయాగాదులును, మహాదానంబులును, బుణ్యతీర్థయాత్రలును, మొదలగుసత్కార్యంబు లాచరింపకుండఁ దత్తత్ఫలంబులు లభియించునుపాయం బానతీయవలయు నని వ్యాసదేవుం డడుగుటయు సనత్కుమారుం డిట్లనియెను. మునీంద్రా! కౌశికియు, ధర్మార్థమోక్షదాయిని యగుభగవతిగంగానదియు, కురుక్షేత్రంబును, ప్రయాగయు, నైమిశారణ్యంబును, పుష్కరప్రభృతితీర్థంబులును, త్రివేణియు, పయోష్ణియు, గండకియు, బ్రహ్మావర్తయు, అతిపవిత్రం బగుయమునయు, గంగాద్వారంబును, సహస్రాశ్వంబును, భద్రికర్ణహ్రదంబును, దృషద్వతియు, కరతోయయు, మహానది యగులోహితయు, సరయువును, సరిత్పతి యగుసాగరంబును, కోకయు, అరుణయు, తామ్రయు, శోణహ్రదంబును, గోదావరియు, నర్మదయు, వేత్రవతియు, కృష్ణయు,

కావేరియు, వితస్తయు ననునివి సారస్వతతీర్థంబు లని సాధుజనులు ప్రశంసించుచుందురు. ఇట్టితీర్థములనిరంతరాశ్రయ మేకమాత్రశివలింగ ప్రణామఫలమున షోడశాంశమైనను గాఁజాలదు. ఏకమాసమాత్రం బగుశివలింగార్చనంబువలన బహువర్షములు వివిధతీర్థయాత్రాలం గావించినఫలము లభించును. సచరాచరం బగునీత్రైలోక్యంబును శివలింగోత్పన్నంబే కావున శివలింగంబు సర్వతీర్థమయంబు. ధ్యానయోగంబుచే శివలింగార్చనంబు గావించినచో ముహూర్తమధ్యంబున నసంఖ్య తీర్థఫలప్రాప్తియు, ముక్తిలాభంబును గలుగును. ఈవిశ్వమంతయును శివలింగమునుండి యుత్పన్నం బై నవిధంబును, శివలింగస్వరూపంబును, శివలోకప్రాప్తు లగువారికిఁ బునరావృత్తియు, అపునరావృత్తియు నగు విధంబును దొల్లి నేను బ్రహ్మదేవునివలన వినియుంటిని. దానిని నీకు వినిపించెద నాకర్ణింపుము.

సృష్ట్యాదియందు మహేశ్వరుండు ప్రకృతిసంగతుండైనప్పుడు మహావాయువు ప్రాదుర్భూతంబయ్యెను. ఆవాయువునుండి యగ్ని యుదయించెను. ఆయగ్నినుండి కోటిసూర్యసమప్రభం బగులింగం బుత్పన్నం బయ్యెను. ఆలింగంబు శతయోజనవిస్తీర్ణంబును, లక్ష యోజనోన్నతంబును, బహుసువర్ణమణిభూషితంబును, బ్రహ్మాంతప్రభాకరతేజస్సంపన్నంబు నై యుండెను. అప్పు డాలింగమును గాంచి బ్రహ్మాదదేవగణములు విష్ణుసహితముగా సంజ్ఞాహీనులై సుదుఃఖితులగుచుండిరి. మఱియు విరూపాక్షుం డగునీశ్వరుండును, సత్వరజస్తమోగుణములును, క్షేత్రజ్ఞుం డగుపురుషుండును, ప్రకృతియు, సాంఖ్యయోగమును, పర్వతములును,నదీనదములును, సాగరములును, హ్రదములును, పృథివియు, అంతరిక్షమును, గ్రహములును, నక్షత్రములును, దిక్కులును, విదిక్కులును, మాసములును, వత్సరములును,

సమస్తము నాలింగమున విలీనములై పోవుచుండెను. భగవానుండగు నీశ్వరుండు లింగమునుండియే పుత్త్రరూపమున బ్రహ్మదేవుని సృజించి యాతనికిఁ బ్రజాపాలనకార్యమును నియోగించెను. అనంతరము లీలాగర్భమునుండి దేవలోకపూజనీయుం డగువిష్ణుదేవుని సృజించెను. అందఱును బూర్వస్మృతిలోపమున లింగమునం దంతర్హితులై పోయిరి. పూర్వము నిఖిలబ్రహ్మాండమును జలమయం బై యున్నప్పు డాజలమధ్యమున మహాతేజోమయమును, గోళాకారమును నగుమహాదేవునిబృహల్లింగము జ్వాలాభీలమై సకలజీవభయంకరమై ప్రకాశించుచుండెను. ఆ లింగం బగ్నిరూపం బగుటచేఁ దన తేజమున స్వర్గమర్త్యాదిలోకముల నాక్రమించి తేజోమండలమధ్యమున వెలుఁగొందుచుండెను. ఆతేజముచేఁ ద్రిభువనములును దగ్ధములై పోవుచుండెను. దేవదానవగంధర్వయక్షరాక్షసాదులును, బంచభూతములును, స్థావరజంగమస్వరూపములగుసకలపదార్థములును, శివమాయామోహితములై యాశివలింగముచే నాకర్షింపఁబడిపోవుచుండెను. అదృఢాకర్షణవేగమునఁ బ్రవృద్ధం బగుమహాప్రభంజనము విజృంభించి భీకరశబ్దములచే గగనవిదారణము గావించుచుండెను. అట్లాశివలింగతేజముచే ననేకజీవకోటులు దగ్ధంబులై యింకను దహింపఁబడుట కగ్రేసరములగుచున్నసమయమునఁ జైతన్యవిహీనులై దుఃఖితహృదయులై యున్నబ్రహ్మాదిదేవగణములు విష్ణుసహితులై యమ్మహాలింగమును సమీపించి శివమాయామోహితులై, భీతిభావమునఁ బరస్పరముఖావలోకనము గావించుకొనుచు బలవిహీనులై యమితతేజోమయుం డగుమహాదేవుని ధ్యానించుచు నిద్రాభిభూతులై పోయిరి. అనంతరము వారు పూర్వస్మృతివశమున జ్ఞానలాభము నంది యఖిలశరణ్యుం డగుమహాదేవు నాశ్రయించి సర్వభూతేశ్వరుం డగునాతని నిట్లు సన్నుతింప నారంభించిరి.

ప్రభూ! నీవు కుమారుండవు. కుమారరూపముననే జన్మించితివి. నీవు సర్వతోముఖుండవు. దేవదేవా! సర్వభూతోత్పాదకా! ప్రణవమును, వషట్కారమును, దండనయు నీస్వరూపములు. బ్రహ్మాదిదేవగణములును, బృహస్పతిప్రముఖులగుఋషిగణములును, యక్షనిచయములును, నిందుృండును, భగవానుం డగువిష్ణుండును నీయందే జనియించి నీలోననే విలీనులగుచున్నారు. పరాశక్తి యగుమాయాదేవిసాహాయ్యమున మే మీశ్వరుండ వగునిన్ను దర్శింపఁగలుగుచున్నాము. అని యిట్లు ప్రస్తుతించుటయు మహాదేవుండు ప్రసన్నుండై వారికిఁ బరమవిజ్ఞానమును, బరమైశ్వర్యలాభమును, జరామరణరాహిత్యమును, బరమరూపమును, గామగమనమును, స్వర్గధామమునఁ బూజ్యత్వమును బ్రసాదించి యంతర్హితుం డయ్యెను. సర్వజీవసంహారకాలమున జగంబంతయు నేకార్ణవంబై యున్నప్పుడు శివుం డొక్కఁడుమాత్రమే యుండి మరల విశ్వసృజనంబు గావించుచుండును. ఇట్లు సృష్ట్యవసానకాలమునఁ బ్రళయమును, బ్రళయావసానకాలమున సృష్టియు నగుచుండును. భగవంతుం డగుబ్రహ్మదేవుండు ప్రజాపతియైయుండును. త్రిరాత్రములు భక్తిపూర్వకముగఁ గావించినశివలింగార్చనమువలన శతాశ్వమేధఫలంబును, ఏకమాసలింగార్చనంబువలన సహస్రాశ్వమేధఫలమును మాసత్రయలింగారాధనమున సహస్రరాజసూయఫలమును, లభియించును. సర్వతీర్థస్నానమును, సర్వస్వదానమును, నానావిధయజ్ఞానుష్ఠానంబును నియమోపవాసపూర్వకం బగువివిధవ్రతాచరణమునుగూడమాసత్రయశివపూజనమునకు సమములు గాఁజాలవు. జితేంద్రియుండును, శమదమసంపన్నుండునై తొమ్మిదిమాసములు శివార్చనము గావించువానికి సర్వాభీష్టములును సిద్ధించును. మఱియు హిమవంతము, మందరము, మేరువు, కైలాసము, గంధమాదనము, వింధ్యము, అగ్ని... ము, పుర

శ్చంద్రము, మహేంద్రము, మలయము మొదలగుపర్వతములును, వా లఖిల్యాదిమహర్షులును, నైమిశారణ్యవాసు లగుతపోధనులును, అప్స రోగణములును, మాతృగణములును, తారాగ్రహగణములును, పితృ గణములును, చారణోదుంబరసిద్ధవిద్యాధరగణములును శివలింగార్చకు ల కభీష్టసాధనము గావించుచుందురు. శివలింగమునఁ బరమవిశ్వాసి యై యుండుమానవునియెడల వృషభధ్వజుండగుమహాదేవుండు ప్రస న్నుండై యుండును. ఏకదినమాత్రశివపూజారతుండగువాఁడు పాకయ జ్ఞములను, హావిర్భాగములను గావించినఫలము నందఁగలఁడు. అట్టి వాని కేకాదశరుద్రస్థానముల శివారాధనము చేసినఫలము లభించును.

బ్రహ్మపుత్త్రుం డగుసనత్కుమారుండును, పులస్త్యుండును, పుల హుండును, క్రతుండును, గణనాయకుండును, నందీశ్వరుండును, మహా కాలుండును, భృగుండును, అంగిరుండును, మరీచియు, దధీచియు, యముండును, శుక్రుండును, బృహస్పతియు, చ్యవనుండును, జమదగ్ని యు, ఉతంకుండును, అగస్త్యియు, ప్రజాపతిశ్రేష్ఠుండగుదక్షుండును, ఆతనిపుత్త్రసప్తకంబును, భగవానుం డగుమనువును, ప్రహ్లాదుండును, నముచియు, అత్రియు, వసిష్ఠుండును, భగవానుం డగుకశ్యపుండును, మహాతపుండగుగౌతముండును, భరద్వాజుండును, సుపండితుం డగు విశ్వామిత్రుండును, ద్వాదశాదిత్యులును, అష్టమనువులును, రుద్రులు ను, మరుత్తులును, అశ్వినీకుమారులును, సాధ్యవిద్యాధరపన్నగగణము లును, ఋషులును, విశ్వేదేవతలును, ధర్మార్థకామదేవతలును, ఏలా పత్రంబును, క్షీరోదంబును, పుష్కరంబును, భగవతిగంగయు, శ్మశా న దేవతలును మొదలగువారందఱును శివలింగార్చనంబువలననే యెల్ల యెడల విఖ్యాతచరిత్రు లైరి. ఇది సృష్టిప్రళయసంకీర్తనంబు.

వ్యాసమునీంద్రా! క్రీడాపరికరములచే బాలకులు క్రీడించువిధ

మునఁ బరమేశ్వరుండు భూతసంఘములతోఁ గ్రీడించుచుండును. ఆతని కార్యమువలన మనము వ్యాకులచిత్తులమై శివయజ్ఞానుష్ఠానము గావింపవలయునని తెలిసికొనుచుందుము. బ్రహ్మ, విష్ణుదేవుఁడు, ఇంద్రుఁడు, సూర్యచంద్రులు, వాయువు, యముఁడు, కాలుఁడు, మృత్యువు, వరుణుఁడు, కుబేరుఁడు, అగ్ని, వేదములు, ఇతిహాసములు, గాయత్రిమొదలగువారందఱును శివారాధనమువలననే శ్రేష్ఠపదలాభము నందఁగలిగిరి. భక్తిపూర్వముగఁ దపోనుష్ఠానము సేయుచు శివలింగసామీప్యమున శివగృహమున వల్మీకమృత్తికతో విలేపనము గావింపవలయును. సమ్మార్జనముచే శతగుణఫలమును, విలేపనముచే సహస్రగుణఫలమును లభించును. పుష్పోపహారధూపములు విలేపనసదృశఫలములు. శివలింగమునకు జలాభిషేకముచే దశాపరాధములును, క్షీరాభిషేకముచే శతాపరాధములును, ఘృతాభిషేకముచే సహస్రాపరాధములును బరిమార్జితము లగును. పరార్థియగువాఁడు శివలింగమునకు ఘృతక్షీరాభిషేకములఁగావించి ఘృతయుత మగుగుగ్గులుధూపము నర్పింపవలయును. దశసువర్ణపుష్పములు శివున కర్పించువానికిఁ గోరినకోరికలు సిద్ధించును. విధిబోధిత మగుబాహ్యపూజాదికముకంటె జపయజ్ఞము దశగుణాధికఫలదముగావున లక్షరుద్రాక్షమాలికచే రుద్రనామము జపించువారికి దశగుణాధిక మగుశివపూజాఫలము సిద్ధించును. జపయజ్ఞముకంటె మానసపూజ శతగుణములును,దానికంటె మానసికధ్యానము సహస్రగుణములును, ఫలాధిక మగును.

మహాదేవపూజార్థము తదుపయుక్తము లగుతృణగుల్మలతాదులను ఛేదించుటగాని, ఫలపుష్పపత్త్రాదులను గోయుటగాని హింసగానేరదు. అది యుత్తమధర్మమే కావున నట్టివారికి స్వర్గగమనమున కెట్టియాతంకము నుండదు. శ్రద్ధాపరులై నిశ్చలచిత్తమున శివలింగా

ర్చనము గావించువారికి సకలఫలసిద్ధి యగును. నిరంతరశివలింగార్చనాపరులగువా రిహలోకమున నెట్టికష్టమును ననుభవింపక, పరకాలమున స్వకర్మార్జితము లగు శ్రేష్ఠస్థానములఁ బూజింపఁబడుచుందురు. కల్పాంతరములయందు శివలింగములు స్థాపింపఁబడినదివ్యక్షేత్రములయం దేకాగ్రచిత్తమున యథావిధిగ లింగసంస్థాపనము గావించి భక్తిపూర్వకముగఁ బవిత్రభావముతో నేకవత్సరము నిత్యారాధనము సేయువారు సహస్రకోటికల్పములు రుద్రలోకమున శివసహితముగ నేకత్రనివాసము గాంచఁగలరు. ప్రతిదినమును బూజార్థమై గంధమాల్యములు సమకూర్పనివాఁడు శివపూజాపరాయణుం డయ్యును సధార్మికుండును బాపకర్ముఁడు నగును. కావున నానందహృదయుండై భక్తుం డగువాఁడు గంధమాల్యములతో శివారాధనము గావింపవలయును. భక్తశ్రేష్ఠుం డగువాఁడు తనయభీష్టసిద్ధికొఱకు సర్వభూతాంతర్యామియు, సర్వభూతజనకుండును, సర్వభూతేశ్వరుండును, సర్వమయుండును, భక్తిప్రియుండును, భగవానుండు నగువిరూపాక్షుని శివలింగరూపమున నిత్యము నర్చించుచుండవలయును. శివలింగస్థితమగు పర్యుషితమాల్యము నెత్తి పరిశుభ్రము సేయువానికి సహస్రగోదానఫలము గలుగును. శుచియును నియమవంతుండునై శతరుద్రవిధానమున శివలింగాభిషేకము సేసినవానికిఁగూడ నట్టిఫలము సిద్ధించును. స్త్రీశూద్రమ్లేచ్ఛాదులకు నమస్కారసహస్రముచేతనే యట్టిఫలము లభించును. అట్టివారికిఁ బ్రణవమంత్రవివర్జితం బగునమశ్శబ్దమే విహితమైనది. నిజమంగళాకాంక్షి యగువాఁడు విశుద్ధజలములచే నిత్యమును మహాదేవాభిషేకము సేయుచుఁ జందనాదులచే నంగరాగమును, సువాసితపుష్పమాల్యములచే నలంకారమును జేయుచుండవలయును. పుష్పవస్త్రోపహారనైవేద్యములచే సర్వగా సర్వేశ్వరుని బూజించువాఁడు

మహాదేవానుగ్రహంబున మనోరథసిద్ధుం డగును. శివధర్మనిరతుండగు వాఁడు నియమపూర్వకంబుగాఁ బరమేశ్వరుని సువర్ణకలశంబులతోఁ గాని, రజతకలశంబులతోఁగాని, ఉదుంబరకలశంబులతోఁగాని, మృణ్మయకలశంబులతోఁగాని జలాభిషేకంబు సేయుచు, అమూల్యమణిమిశ్రితంబుగా సర్వస్వప్రదానంబు చేసి, నవరత్నహారంబుల భక్తిపూర్వకంబుగా సమర్పించి, మనోజ్ఞంబు లగుసంగీతంబులచేతను, వివిధమధురమంగళవాద్యంబులచేతను సద్దేవుని సంతుష్టుం గావించి యర్చింపవలయును.

ఎవ్వఁడు విశుద్ధనియమంబున స్తవంబులచేతను, వాద్యంబులచేతను, నమస్కారంబులచేతను, సర్వస్వప్రదానంబులచేతను, మనఃపూర్వకంబు లగుప్రియవస్తుప్రదానంబులచేతను,మఱియు ననేకవ్రతానుష్ఠానంబులచేతను సర్వదా భగవదారాధనంబు గావించునో యట్టివాఁడు సర్వపాపవిముక్తుఁడును, బరమపవిత్రుండునై స్వర్గాదిలోకంబులయందభీష్టభోగంబుల ననుభవించి యనంతరము సర్వదుఃఖవివర్జితం బగురుద్రలోకంబు నధిగమించి సర్వశ్రేష్ఠులై విరాజిల్లుచుందురు. మఱియుఁ బూర్వోక్తవ్రతాదినియమానుష్ఠానంబు సేయుచుఁ ద్రిసంధ్యలయందును విశుద్ధభావంబున మహాదేవు నర్చించువారు సర్వదుఃఖవివర్జితులును, సర్వపాపవినిర్ముక్తులు నగుదురు. పూర్వకాలంబున మహాదేవుండు తనపూజావిధానం బంతయును యోగసాధనసంపన్నుం డగునొకబ్రాహ్మణున కుపదేశించెను. అతఁడు పూర్వోక్తవిధానంబున మహాదేవునారాధించి ముక్తుండయ్యెను. మునీంద్రా! ఇఁక శివమూర్తివిశేషంబుల నభివర్ణించెద నాలకింపుము. సర్వజీవోత్పత్తికి హేతుభూతం బగునమ్మహాదేవుని యైంద్రీనామకం బగుప్రథమమూర్తి పూర్వదిక్కునం దింద్రునాశ్రయించి యుండును. దక్షిణానామకం బగునాతనిద్వితీయమూర్తి

సంహారకార్యప్రవృత్తుం డగుయము నాశ్రయించి దక్షిణంబునను, తృతీయం బగువారుణీమూర్తి సకలజీవసంతుష్టిదాయకంబై వరుణు నాశ్రయించి పశ్చిమంబునను, వరదానాత్మకం బగుచతుర్థమూర్తి సర్వసుఖసంపాదకమై కుబేరు నాశ్రయించి యుత్తరంబునను, పంచమమూర్తి తపోమయంబై మహాముని యగు కపిలు నాశ్రయించి పాతాళంబునను, వైష్ణవీనామకం బగుషష్ఠమూర్తి వేదయాగాదులకేకమాత్రశరణ్యంబై విష్ణుదేవు నాశ్రయించి యూర్ధ్వంబునను విరాజిల్లుచుండును. ఈమూర్తులు గాక సర్వజీవసుఖసంపాదకంబును, నిరుపాధికంబును, జ్ఞానస్వరూపంబు నగునొకమూర్తి గలదు. ఆమూర్తిని జరామరణభీరు లగుయతీంద్రు లారాధించుచుందురు.

పూర్వోక్తప్రకారంబున నీశ్వరుని గ్రహింపఁగలవారు పాశుపతవ్రతంబుఁ జేసినవారగుదురు. వాఁడు సర్వవ్యాపకుం డని గ్రహించినవారికి దుఃఖంబు లేదు. జ్ఞానులగువార్లు తెలిసికొని యదృచ్ఛాలాభసంతుష్టులై యుందురు. వ్యాసమునీంద్రా! సృష్టి, ప్రళయము, శివమూర్తివిభేదము, శివలింగపూజావిధానము, శివసంతుష్టికరంబు లగు విశేషారాధనవిధులు మొదలగువిషయములను సంక్షేపముగ నీకెఱింగించితిని. మహాదేవునిసకలమూర్తులకంటెను దక్షిణామూర్తి పరమపూజనీయమైనది. అదియే వృత్తి, శ్రద్ధ, సుఖము, కామము, మఱియు జీవగణంబులసర్వాభీష్టంబులను బ్రసాదించుచుండును. మునీంద్రా! యోగమగ్నుండై విశుద్ధచిత్తంబున నీదక్షిణామూర్తి నారాధింపవలయును. చిత్తశుద్ధియే సర్వకామార్థసిద్ధికి సాధనమైనది. నీకిప్పు డుపదేశించినపరోత్కృష్టం బగునీశివలింగపూజావిధానమును, భక్తిశ్రద్ధలతో నిచ్ఛాపూర్వకంబుగ నాకర్ణించువారు పరమగతిలాభంబు నందఁగలరు. ఈశ్రవణంబున సకలవ్యాధులును, సకలదుఃఖంబులును నశింపఁగలవు.

శివలింగదర్శనంబును, ప్రశంసనంబును, స్తవాదికంబును, శివలింగపరి మాణశ్రవణంబును, శివనామకీర్తనంబును శాపనాశకంబులు. పూర్వో క్తకార్యంబులు గావించినవా రెట్టివారైనను, నశ్వమేధాదియజ్ఞఫలం బు నంది శివలోకప్రాప్తు లగుదురు. బ్రహ్మోక్తం బగునీశివేతిహాసము క్రోధమోహావినాశకంబును, సర్వపాపసంహారకంబును నై వెలయు చున్నది. శివమందిరమునం దీయితిహాసము నొకసారి పఠించినచో నశ్వమేధయజ్ఞఫలంబు లభింపఁగలదు. దీనిని నిత్యంబును భక్తియుక్తుఁ డై పఠించువాఁడు సర్వపాపవిముక్తుండై యంతంబున శివసాయుజ్యం బు నందఁగలఁడు.

## —♦ ముక్తిక్షేత్రవర్ణనము. ♦—

త్రిభువనంబులయందును దివ్యంబులగుశివస్థానంబు లెన్ని యు న్నవి? ఏయేస్థలంబులయం దమ్మహాదేవుఁడు నిత్యసన్నిహితుండై యందలిభక్తజనంబుల ననుగ్రహించుచుండును? అట్టి సకలతీర్థముల నామంబులును, అందు శివానుగ్రహంబుకొఱకు భక్తజనంబులు గా వింపవలసినయారాధనక్రమంబును సవిస్తరంబుగాఁ దెలుపవలయు నని వ్యాసుండు ప్రశ్నించుటయు సనత్కుమారుం డిట్లు చెప్పందొడంగెను.

ఆదిదేవుండును, లింగరూపుండును, గపర్దియు, భక్తవత్సలుండును, సర్వదేవతారాధితుండు నగుపరమేశ్వరునకు నమస్కారము. వ్యాసము నీంద్రా! సర్వజీవహితకరం బగుశివక్షేత్రచరిత్రంబుఁ జెప్పెద నాకర్ణిం పుము. ఆదేవుఁ డసంఖ్యరూపంబులతో నఖిలజీవులయందును నిండి యుండును. భక్తజనంబు లనేకనామంబులతోడను, అనేకరూపంబుల తోడను నాతని నారాధించుచుందురు. బ్రహ్మ, విష్ణుదేవుఁడు, సూ ర్యుఁడు, స్కందుఁడు, అగ్ని, ఇంద్రుఁడు, చంద్రుఁడు, కుబేరుఁడు, వా యువు, వరుణుఁడు, ఉమాపతి, మరుద్గణము, కపిలుఁడు, అశ్వినీ(?)

బుద్ధి మొదలుగాఁగలనామంబులతో సమ్మహాదేవునే యుపాసకు లుపాసించుచుందురు. భక్తులే రూపము నారాధించినఁ బరమేశ్వరుం డా రూపముతోనే సాక్షాత్కరించి వరప్రదానంబు గావించుచుండును. ఆదేవునిదివ్యక్షేత్రసంఖ్యంగూర్చి కీర్తించుటకు సహస్రవర్షంబులైనను జాలవు. కావున సంక్షేపముగ నభివర్ణించెద నాకర్ణింపుము. భూలోకంబున సర్వోత్తమంబగురుద్రపదము, మాహేశ్వరపదము, శ్లేష్మాతకము, అవిముక్తము, మహాలయము, గోకర్ణము, భద్రకర్ణము, స్వర్ణము ననునివి యష్టస్థానములు.

అందు మహాదేవుండు నిత్యసన్నిహితుండై భక్తజనంబుల నుద్ధరించుచుండును. అందు మాహేశ్వరపదంబు దేవదేవర్షిసిద్ధసేవితంబై యలరారుచుండును. అది యోజనద్వయదీర్ఘంబును, నంతియవిస్తారంబు నై యుండును. ఆదివ్యస్థానంబున మృతులగువారికిఁ బునరావృత్తిరహితంబగుశివపదంబు లభించును. ఈదివ్యస్థలంబులయందు మరణించినవారు పాపాత్ములైనను రుద్రలోకప్రాప్తు లగుదు రని తొల్లి భగవతి యానతిచ్చియుండెను. శ్లేష్మాతకక్షేత్రంబున మహాదేవుండు సర్వదా యక్షరాక్షసనాగపిశాచపరివృతుండై యుండును. యోజనద్వయపరిమితంబగునీస్థానంబున మేను దొరంగినపురుషుండు ముక్తుం డగును. యోజనద్వయచతురం బగురుద్రపదక్షేత్రంబున రుద్రదేవు నారాధించి దేవదానవగంధర్వాదులు తపోధనులలో సర్వశ్రేష్ఠులైరి. మహాదేవునకు నిత్యావాసంబగునచ్చట దేహత్యాగంబు గావించినవారికి గాణపత్యలోకలాభంబు గలుగును. మేరుశైలమధ్యంబున నర్ధయోజనవిస్తీర్ణం బగుసువర్ణక్షేత్రంబున భగవానుండగుత్రిలోచనుని విష్ణుండును, ఇంద్రుండును, చంద్రుండును, సూర్యుండును, వాయుదేవుండును, అశ్వినీకుమారులును నిత్యము నారాధించుచుందురు. అవిముక్తక్షే

త్రంబున నోంకారగమ్యుండును పరమాత్ముండును, భగవానుండును, సనాతనుండును నగుదేవుండు విశ్వేశ్వరనామంబునఁ బూజింపఁబడు చుండును. ఆక్షేత్రంబున సర్వతేజోమయంబును, సురసిద్ధగణదుర్లభం బును, కల్యాణమయంబు నగుదివ్యలింగంబు విరాజిల్లుచుండును. అందుఁ గలియుగంబున మహాదేవుం డంతర్లింగస్వరూపుఁడై భక్తరక్ష ణంబు గావించుచుండును. ఆకాశీక్షేత్రంబున నిత్యసన్నిహితుండును, ఓంకారస్వరూపుఁడు నగువిశ్వేశ్వరుని దేవర్షిగణంబులును, రాజర్షిగణం బులును ధ్యాననిష్ఠులై నిత్యంబును బ్రణామస్తవంబులచే నారాధించు చుందురు. మఱియు, వేదాధ్యయనసంపన్నులును, వ్రతానుష్ఠానతత్ప రులును నగుసిద్ధర్షిగణంబులు నిత్యయోగానుష్ఠానంబున నిర్మలప్రశాంత హృదయులై యచ్చటికర్దమేశ్వరప్రభృతిపంచస్థానంబులయందును ని రంతరసుస్థిరుండై యున్నపరమేశ్వరు నుపాసించుచుందురు.

ఆపంచాయతనంబున నచింత్యం బగుపరమేశ్వరునిశాంతిమయ మూర్తి విరాజిల్లుచుండును. ఆదివ్యస్వరూపంబున మహాత్ములగుజ్ఞాను లు విలీను లగుచుందురు. యోజనద్వయపరిమితంబగునాకాశీక్షేత్ర మును విశ్వేశ్వరుం డొక్కప్పుడును విడిచియుండఁడుగావున నయ్యవిము క్తక్షేత్రం బనుపమానమైనది. ఇట్లే భద్రకర్ణక్షేత్రంబునం దీశ్వరుని బ్రహ్మాగ్నిచంద్రేంద్రాదులును, విష్ణుండును, బృహస్పతియు, నదీనద సముద్రంబులును, ద్వీపంబులును, ఓషధులును, సకలజీవులును సర్వ దా సేవించుచుందురు. అత్యుజ్జ్వలం బగునీస్థానము పరమపవిత్రమైన దని పూర్వమే చెప్పంబడియెను. దానితో సమానంబగుక్షేత్రంబు లేదు. అది యతిపవిత్రంబును, రమణీయంబును, బరమేశ్వరునకు నిత్యనివాసంబు నగుటచే నతినియమపూర్వకంబుగ నిత్యమును సేవించు నివసించియుండును. ఆదివ్యక్షేత్రంబు నిత్యంబును సిద్ధజనపరివృతంబై

యుండుటచే నధర్మపరులును, బాపాత్ములు నగువారి కగమ్యంబై యుండును. బ్రహ్మావర్తంబునకు దక్షిణంబుననున్న పురాతనపుణ్యస్థానం బగునీమహాధననామకక్షేత్రమునందు నిత్యంబును సిద్ధర్షులు తపస్సంసక్తులై యుందురు. ఈసకలక్షేత్రంబులయందును బురాతనమహర్షులు తపంబు గావించి సర్వసిద్ధులను, దివ్యమాహేశ్వరభోగంబులను, అక్షయశక్తులను బడయఁగలిగిరి. మునీంద్రా! అతులంబును, పుణ్యజనకంబును, పాపవినాశకంబును నగుశివస్థానమాహాత్మ్యంబు వర్ణించితిని. దీని బ్రాహ్మణులుగాని, శివభక్తిపరాయణులగుమఱియెవ్వరుగాని పఠించినచో వారికి వేదపారఫలంబు లభించును. అతిప్రశంసనీయంబును, బుణ్యప్రదంబునగు నీవిషయము నన్యదేవతారాధకులకును, శఠులకును, క్రూరులకును, ఆత్మశ్లాఘాపరాయణులగునీచులకును నుపదేశింపఁ దగదు.

## — శ్రీస్థానాఖ్యానము. —

వ్యాసమునీంద్రుండు సనత్కుమారుం గాంచి యిట్లనియెను. మునీంద్రా! మఱియు నితరంబు లగునుత్తమస్థానంబులమాహాత్మ్యంబును, గోపనీయంబులగుతీర్థంబులును, దేవగృహంబులును, వానిని సేవించుటవలనిఫలంబును విస్పష్టంబుగ బోధింపుము. పూర్వోక్తవాక్యశ్రవణంబున నాకింకను దృప్తి జనించుట లేదు. దేవదేవుండును, మహాత్ముండు నగుశంకరునిమాహాత్మ్యం బింకను వినవలయుననియే కుతూహలమగుచున్నది. అనుటయుఁ బరమతేజస్వియగుసనత్కుమారుండు మృదుమధురవచనంబులతో నిట్లని చెప్పందొడంగెను. వ్యాసమునీంద్రా! అత్యాశ్చర్యకరంబును, బాపనాశకంబు నగువాక్యము నాకర్ణింపుము. మంగళకరంబగునీపవిత్రనాక్యములకు బ్రీతిపర్వశుండందును

బరించునట్టియుఁ, గవచరూపంబున ధరించునట్టియుభక్తుల కిందరిలోక ప్రాప్తియగును. పవిత్రంబులగునీవాక్యములు, భగవానుండగునీశ్వరు నిచే స్వయముగఁ జెప్పంబడినవి. సావధానుండవై యాకర్ణింపుము. భగిలాండము, కురుండము, ముకుటము, మండలేశ్వరము, కాలంజర వనము, గదగండము ననునీసకలస్థానంబులయందును, భగవానుండగు నీశ్వరుండు దేవగణపూజితుండై ప్రమథగణసహితంబుగఁ బరమానం దంబున సర్వదా విహరించుచుండును. ఈస్థానంబులన్నియుఁ బ్రత్యేక ముగఁ జతుర్దశయోజనవిస్తీర్ణంబులును, సిద్ధగంధర్వాదిసేవితంబులునై యుండును. ఆస్థానంబులను దర్శించి యందేకాహోరాత్రంబు వసించి, సర్వంబును బరమేశ్వరాధీనంబు సేసి, పితృతర్పణాదిమూలంబున విగత కిల్బిషుండై పవిత్రుండగుభక్తునకు రాజసూయాశ్వమేధయాగఫలంబు సిద్ధించును. అంతంబునందాతనికిఁ బరమేశ్వరుండు ప్రసన్నుండై ముక్తిప్రదానంబు గావించును. ఆదివ్యక్షేత్రంబులయందు దేహత్యా గంబు సేయువారు దేవతలైనను, దానవులైనను, శివప్రియులైనను, అప్రియులైనను నగుదురుగాక! అట్టివారిహలోకంబున ననుపమైశ్వ ర్యంబులను, బరంబున నీశ్వరసాయుజ్యంబును బడయఁగల్గుదురు. పూర్వోక్తస్థానంబులయందు మునిగణపరివృతుఁడును, సురగణపూజితుం డునైయుండుమహాదేవునిమాహాత్మ్యంబు శ్రద్ధతో నాకర్ణించువారు సాధారణదుర్లభంబగుసద్గతిని గాంచఁగలరు.

## మహాపురాదివర్ణనము.

సనత్కుమారుం డిట్లనియెను. వ్యాసమునీంద్రా! పరమరహ స్యంబు లగుదివ్యక్షేత్రంబులఁగూర్చియు, పరమేశ్వరుండు భక్తుల నను గ్రహించువిధముంగూర్చియు నెఱింగించెద నాకర్ణింపుము. పూర్వము

వాలఖిల్యాదిమునీంద్రులును, విగతకల్బిషు లగుమహర్షులును బరమేశ్వరుని సందర్శించి యీవిషయంబునే ప్రశ్నించుటయు భక్తవత్సలుండును, ప్రభుండు నగుమహాదేవుండు వారిభక్తికి సంతుష్టుండై దయాపూర్వకంబుగ వారికి దర్శనం బిచ్చెను. ఆమహర్షులు మహాదేవసందర్శనంబున నానందసాగరనిమగ్నులై యావృషభధ్వజునకు భక్తితోఁ బ్రణామంబు లాచరించి కృతాంజలిపుటులై యిట్లు ప్రార్థింపఁదొడంగిరి. ప్రభూ ! నీవు నీభక్తుల మగుమాసకలమనోరథంబులను దీర్చుటకు సమర్థుండవు. నీవచింత్యుండవు గావున వరసహస్రంబులచే నైనను నీదర్శనము దుర్లభమైనది. మేము నీదయకుఁ బాత్రుల మగుదుమేని మాకీవరంబును బ్రసాదింపుము. మేమిప్పు డతిగుహ్యంబులగుభవదీయ పవిత్రస్థానంబుల నెఱుంగవలయు నని కుతూహలపడుచుంటిమి. ఇంతకంటె మాకెట్టికోరికయును లేదు. అనుటయు మాయారహితుండును, భక్తప్రియుండును, అనాదిదేవుండు నగురుద్రుండు పుణ్యాభిలాషులగు నమ్మునులయెడఁ బ్రసన్నుండై యిట్లు బోధింపఁదొడంగెను. మునీంద్రులారా! మహాపురము, చక్రపురము, శ్రీపర్వతము, జాప్యేశ్వరము, ఆమ్రాతకేశ్వరము, దేవదారువనము, మహాభైరవము ననునివి గోప్యంబులగు పవిత్రస్థానములు. ఈసకలస్థానంబులను భక్తిశ్రద్ధలతో దర్శించుభక్తుండు నాకతిప్రియుండు. అట్లు గావించుసామర్థ్యంబు లేకున్నచో నీదివ్యక్షేత్రనామంబులను భక్తిపూర్వకంబుగ నుచ్చరించుచుఁ బుష్పోపహారచందనాదులచేతను, నమస్కారంబులచేతను నన్నుఁబూజించినను మత్పదప్రాప్తి లభించును. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులలో నెవ్వరైనను, అనాచారు లగుమ్లేచ్ఛులైనను, సకాములై కాని, నిష్కాములై కాని పూర్వోక్తస్థానంబులయందు నన్నుఁ బూజించువారు సుస్థిరంబగుగాణపత్యలాభంబునంది యింద్రలోకంబునఁబూజ్యులై యుందురు.

మఱియు నాక్షేత్రంబులయందు మృతులగువారికిఁ గూడ స్వర్గఫలంబు సిద్ధించును. ఆక్షేత్రంబులయందు శ్రద్ధాపూర్వకంబుగఁ బితృదేవతల నుద్దేశించి కుశాస్తరణంబునఁ బిండతిలోదకప్రదానంబు గావించు మహాభాగుఁడు తనపితృగణంబులతోఁగూడ ననంతకాలము స్వర్గలోకస్థితుండై యుండును. ఇది సర్వజీవదుర్లభంబగునిగూఢవిషయము. అతిగుహ్యంబగునీయాఖ్యానమును భక్తితో నాకర్ణించువారు స్త్రీలైనను, శూద్రులైనను, మ్లేచ్ఛులైనను మఱియెవ్వరైనను సద్గతిలాభంబు నందఁగలరు.

కావునఁ బండితులగువారు దీని నధ్యయనంబు గావింపవలయును. అశాంతుఁడును, అహితకారియు, కర్కశుండును, అపవిత్రుండును శఠుండును, ఖలుండును, చపలుండును, నిష్ఠురుండు నగువాని కీరహస్యాఖ్యానంబు నుపదేశింపఁజనదు. పుత్త్రశిష్యుఁడును, ప్రియశిష్యుఁడును, ఆత్మశ్లాఘాహీనుఁడును, ప్రశాంతతపస్వియు, ప్రియంవదుఁడును, శివభక్తుఁడును, శ్రోత్రియుఁడును, యతియు, జ్ఞానవంతుఁడు నగువాని కీపవిత్రవిషయంబు నెఱింగింపవలయును. ఈయధ్యాయమును బ్రతిపర్వంబునను బ్రాహ్మణునకు వినిపించువాఁడును, దీనిని దాళపత్త్రంబున లిఖించి ధరించువాఁడును రుద్రలోకప్రాప్తుం డగును. వేదశాస్త్రోక్తం బగునీవిషయము పరమరహస్యం బని పండితులు చెప్పుదురు. కావున నిది యతిగుహ్యం బని నిర్దిష్టం బయ్యెను. పూజనీయములగు నీసకలక్షేత్రములను దర్శించి యందుఁ దపోనుష్ఠానంబు గావించువానికిఁ జిత్తం బతినిర్మలమును, కల్యాణమయము నగును. పూర్వోక్తస్థానములయందును, గంగాద్వారమునందును నేను నిలయపూర్వకముగా నివసించియుండును. ఆద్యంబులగునీక్షేత్రంబులయందు భగవానుండగు మహేశ్వరుని నిత్యము నారాధించువారు సర్వపాపవిముక్తులగుదురు.

ష్టమహాత్ములకుఁ బునరావృత్తిరహితం బగుశివసాయుజ్యంబు లభించును.

మునీంద్రా! ఈశ్వరాధిష్ఠానంబు లగుదివ్యక్షేత్రములంగూర్చి నీకు సంక్షేపముగాఁ జెప్పితిని. ఈపవిత్రచరిత్రము నాకర్ణించువాఁడు నిష్ఠురుండైనను సద్గతిలాభము నందఁగలఁడు. సదాచారసంపన్నుఁడై యీమాహాత్మ్యము నాలకించువానికి సర్వాభీష్టములును సిద్ధించును. ఈయుత్తమస్థానముల నిత్యము నెవ్వఁడు యథార్థరూపమునఁ గీర్తించుచుండునో యాతఁడు దుర్గతిదూరుండై రుద్రలోకావాసుం డగును.

## లింగోద్భవకథనము.

బ్రహ్మవిష్ణుమహేశ్వరులయందుఁ గర్మప్రభావముచే నెవ్వరధికులో భూతభవిష్యద్వర్తమానవిదుండవగునీవు విస్పష్టముగ నెఱింగింపవలయు నని వ్యాసుండు ప్రశ్నించుటయు బుద్ధిమంతులలో నగ్రగణ్యుం డగుసనత్కుమారుం డిట్లని చెప్పందొడంగెను. మునీంద్రా! ఈవిషయంబునఁ బురాతనేతిహాసంబు గలదు. పూర్వకాలమున మహారాజగుబలిచక్రవర్తి త్రైలోక్యవిజయుండై విజృంభించుటయు, భగవానుం డగువిష్ణుదేవుండు స్వకీయప్రభావమున నాతని బంధించి మరలఁ ద్రిలోకములను వశపఱచుకొనియెను. దైత్యులందఱు నాతనిపరిభావమునకు భీతులైపోయిరి. అప్పుడు క్షీరసముద్రతీరమున విశ్వమూర్తియై నిలిచియున్నవిష్ణుదేవునిసన్నిధికిఁ బ్రహ్లాదాదులు చనుదెంచి సనాతనుం డగుదేవదేవుని సందర్శించిరి. మఱియు, సిద్ధసాధ్యవిద్యాధరగణంబులును, నదీనదసాగరంబులును, బ్రహ్మర్షులును, అప్సరోగణంబులును, గంధర్వులును సర్వాభీష్టప్రదుండగునాదేవదేవు నవలోకించి పరమానందహృదయారవిందులై యిట్లు వినుతింపనారంభించిరి.

దేవదేవా! నీవు కామక్రోధభయాహంకారములకు స్రష్టవు; ప్రతిపాలకుఁడవు. ప్రభూ! నీవే యీత్రిలోకములను సృజించి పరిపాలించుచుందువు. ఇప్పుడు నీయనుగ్రహముననే త్రిభువనములకు నక్షయకల్యాణము లభించినది. నీప్రభావముచేతనే దుష్టాసురసంహారమును, బలిబంధనమును నైనవి. పూర్వమునఁగూడ నీవు దుష్టశిక్షణము సేసి స్థావరజంగమాత్మకంబగునీవిశ్వమును సంరక్షించితివి. నీవు దేవగణశరణ్యుండవు. యోగీశ్వరుండవు. జగత్ప్రభుండవు. నిత్యుండవు. సర్వరక్షకుండవగునీకు నమస్కారము. అని యనేకవిధముల వినుతించుచున్న మహాత్ములగువారింగాంచి పురుషోత్తముం డగువిష్ణుదేవుం డిట్లనియెను. సురశ్రేష్ఠులారా! సకలబ్రహ్మండములకు నాదికారణుండగుసర్వేశ్వరుం గూర్చి చెప్పెదను వినుండు! ‘పూర్వకాలమున బ్రహ్మదేవుండు సర్వభూతదయాపరుండగు నమ్మహాదేవునియనుగ్రహముచేతనే సృష్టికర్తృత్వలాభమునంది తనమాయాబలమున నీలోకసప్తకమును సృజియింపఁ గలిగెను. ఆమహాదేవప్రసాదముననే నేనును సర్వశ్రేష్ఠత్వలాభము నందితిని. ప్రళయకాలమున ననిర్వచనీయం బగునంధకారముచే నీ జగంబంతయు నాచ్ఛన్నంబైనప్పుడు నేనీభువనత్రయమును గ్రసించి మాయాబలముచే సహస్రశీర్షుండను, సహస్రలోచనుండను, సహస్రపాదుండను, శంఖచక్రగదాధరుండనునై విమలసముద్రజలముల నేకాంతముగ శయనించియుంటిని. అప్పుడు కృష్ణవర్మపరిధానుఁడును, కమండలుభూషితుఁడును, విమలప్రభుఁడును, జగత్ప్రభుండు నగుకమలాసనుండు నాయెట్టయెదుట సాక్షాత్కరించి యొక్కనిమేషమధ్యమునఁ బురుషోత్తముండును, లోకపితామహుండు నగునాతఁడు నన్ను సమీపించి ‘‘ఓయీ! నీవీసముద్రజలమధ్యమున నేలశయనించియుంటివో యాలసింపక యథార్థముగఁ జెప్పుము. నేను సర్వలోకకర్త నగుననా-

దేవుండ నని యెఱుంగుము.

అనుటయు నేనిట్లు చెప్పితిని. కమలాసనా! నేను సర్వలోకం బుల సృష్టిస్థితిలయంబులం గావించుజగత్ప్రభుండనగు నారాయణుఁడను. అనియీవిధముగా మేమిరువురమును వాదోపవాదంబులం గావించుచు న్నయవసరంబున నుత్తరదిగ్భాగంబున నతిభయానకం బగునొకతేజఃపిం డము మాకు దృష్టిగోచరంబయ్యెను. ఆతేజఃప్రభావంబున నితరంబు లగుజ్యోతిర్గణంబులన్నియుఁ బ్రజ్వలింపనారంభించెను. క్రమముగా నా జ్యోతిర్మండలము భూమ్యంతరిక్షంబులకు వ్యాపించి వర్ధిల్లుచుండుటం గాంచి మేముభయులమును విస్మయావిష్టహృదయులమైపోయితిమి. ఆ జ్వాలామధ్యంబున ద్వాదశాంగుళపరిమితంబును, దుర్నిరీక్ష్యంబును, దుర్నిరూప్యంబును, దుస్సహంబును, అతిస్థూలంబును, అధికతేజస్సంప న్నంబును, మహాబలయుతంబును, జ్వాలామాలికాపరివృతంబును, సకలజీవభయంకరంబును, దారుణంబును, నిర్మలంబు నగునొకతేజో లింగంబు గానంబడియెను. అప్పుడు బ్రహ్మదేవుండు నన్నుం గాంచి యిట్లనియెను. నారాయణా! మనమిరువురము నీతేజోలింగంబునాద్యం తంబు లరసివత్తము రమ్ము! దీనిమూలంబు గాంచునంతవఱకును నీవధో లోకగమనంబు గావించి పరిశీలింపుము. నేనూర్ధ్వగామినై పోయెదను. అని యీవిధంబుగా మేముభయులమును నియమంబు చేసికొన్న పిమ్మట మహావ్రతుండగుబ్రహ్మదేవుండు యోగంబుచే మనోవేగం బున నూర్ధ్వంబునకుఁ బోవుటయు, నేనుగూడ మనోజవంబున నధోదే శంబున కరిగితిని. మేమిరువురము నిట్లు సహస్రవర్షంబు లాతేజోమయ లింగానుసంధానంబు సేయుచుండియు నాద్యంతములఁ గనుంగొనఁ జాలక యతిపరిశ్రాంతులమై క్రిమ్మఱి సముద్రజలంబులఁ జేరితిమి. మహాబలవంతులమయ్యును మేమిప్పుడు భయవిస్మయాభిభూతులమై,

మాయామోహితులమై, జ్ఞానహీనులమై, కొంతకాలంబువఱకు నేమియు నెఱుంగజాలకపోయితిమి. అనంతరము వనజోదరుండు ధ్యాన బలంబుచే సర్వకాలంబులకుఁ గారణుండును, సర్వభూతంబులయుత్పత్తి విలయంబులకుఁ గర్తయు, సర్వవ్యాపియు, భగవానుండు నగుమహాదే వుని లింగస్వరూపునిగా నెఱింగి, అవ్యక్తుండును, అనంతుండును, శూల పాణియు నగునద్దేవునకుఁ బ్రణమిల్లి కృతాంజలిపుటుండై యిట్లు స్తుతింప నారంభించెను.

త్రిలోకనాథా ! సురేశ్వరా ! భూతనాథా ! సత్వగుణావలంబీ ! సత్త్వకారణా ! అనంతా ! నీకు నమస్కారము. దేవా ! నీవుబ్రహ్మకు బ్రహ్మవు. పరమాత్ముఁడవు. యోగీశ్వరులపరమపదంబవు. సూర్య తేజస్సంపన్నుండవు. కామదేవుఁడవు. రుద్రుఁడవు. కార్త్తికేయుఁడవు. అవ్యయుఁడవు. ప్రభూ ! వేదశాస్త్రంబులును, యజ్ఞంబులును, వషట్కా రోంకారస్వాహాకారనమస్కారంబులును, పుణ్యవ్రతంబులును, బ్రహ్మ చర్యాదినియమంబులును, మంత్రంబులును నీవ. నీవు సర్వవ్యాపివి. కామక్రోధసంభూతంబులగుదుఃఖస్వరూపంబులును, ఇచ్ఛాద్వేషశమ దమక్రియావ్యాధులును నీకంటె నన్యంబులు గావు. నీవు సుఖదుఃఖా తీతుండవు. ఋతువత్సరంబులును, విద్యావిద్యలును, ఇంద్రియంబు లును, ఇంద్రియవిషయంబులును, నీవ. స్థూలసూక్ష్మవిశ్వరూపుండ వగునీరూపంబనిర్వచనీయమైనది. నీవు తేజంబులకుఁ దేజంబవు. శబ్ద స్పర్శరూపరసగంధంబులును, జలంబులును నీస్వరూపంబులు. నీవు భూపతివి. జగత్పతివి. ఆకాశమూర్తివి. ఛందోరూపుఁడవు. లోకనా థుఁడవు. అక్షయుఁడవు. నీవు సర్వభూతంబులకును సృష్టిస్థితిలయకార ణుండవై త్రిభువనంబులను ధరించియుందువు. దేవా ! నీపశ్చిమవదనం బునుండి వరుణుండును, సుందరంబగునీయుత్తరముఖంబునుండి భూర్భువ

సువర్లోకంబులును, సర్వజీవులును సంజాతులైరి. నీవు ప్రజానాథుం డవై బహువిధంబులఁ గ్రీడించుచుందువు. జగన్నాథా ! సురాసురవసు రుద్రగణంబులును, వరుణుండును, అశ్వినీకుమారులును, సిద్ధవిద్యాధర నాగయక్షాప్సరోగణంబులును, యోగసిద్ధులును, బ్రహ్మర్షులును, ఆకాశసంచారులగుచారణులును, తపోధనులగుమునులును, సహస్రాధి కులగుసిద్ధతపస్వులును మహాబలపరాక్రములు నజరామరులు నగుప్రమ థులును నిన్నుండియే యుత్పన్నులైరి. మఱియు సహస్రమస్తకుఁడగు ననంతుఁడును, వసువును, వాసుకియు, అధికతేజోబలసంపన్నుఁ డగు గరుడుండును, ధర్మార్థకామకీర్తిమోహంబులును, వాయువును, అగ్ని యు, సముద్రంబులును, నీవలననే సంభవించెను. లక్ష్మి, సతి, కాళిక, గాయత్రీదేవి, సంపత్తు, కీర్తి, సిద్ధి, మేధ, లజ్జ, స్మృతి, తుష్టి, పుష్టి, నందాదేవి, జయాదేవి, సరస్వతి, మొదలగుదివ్యమూర్తులకు నీవే కార ణుండవు. మహాభాగా ! శుక్లకృష్ణపక్షంబులును, దివారాత్రంబులును, కాలంబును, నిమేషముహూర్తంబులును, నక్షత్రగ్రహగణంబులును, అశ్వ గోమేషాదికంబులును, యజ్ఞహవ్యాదులును, పరిదృశ్యమానంబు లగు సకలపదార్థములును నీయందే సంభూతంబు లయ్యెను. దేవదేవా ! జీవులు రజోగుణంబుచేతను, మాయచేతను, సంఛన్నులై నిన్ను దర్శింపఁ జాలకున్నారు. ఆత్మసాక్షాత్కారసమర్థు లగుయోగీంద్రులును, నిత్య ముక్తులునుమాత్ర మనాయాసముగ నిన్ను దర్శింపఁగలుగుదురు. మాయాతమస్సంఛన్నం బగుసీవిశ్వమంతయు ననిత్యమైనది. నీవొక్కరుం డవుమాత్రమే సనాతనుఁడవు. పురుషోత్తముం డగువిష్ణుండును, నేనును నీయందే యుత్పన్నులమైతిమి. నీయందాద్యంతమధ్యంబుల నెఱింగిన వాఁడొక్కరును లేరు. అనుభవైకవేద్యంబగునీస్వరూప మబోధ్యమై నది. అనాదిదేవా ! నీవేకమాత్రధ్యేయుఁడవు. పరమపవిత్రుండవు.

పరాత్పరుండవు. పరమసూక్ష్మమూర్తివి, పురుషోత్తముఁడవు. పురాణపురుషుఁడవు. అవ్యయుఁడగుపరమేశ్వరుఁడని మునీంద్రులు నిన్నుఁ బ్రశంసించుచుందురు. నీవసమస్తకంబులుసూర్యతేజోమయంబులు. నీవు వజ్రిపినాకపాణివి. అంశుమాలివి. భూతనాథుఁడవు. కామసంహారుఁడవు. భస్మవిభూషితశరీరుఁడవు. సూక్ష్మస్వరూపుఁడవు. విధాతవు. యముఁడవు. అనంతమూర్తివి. భూతభవిష్యద్వర్తమానస్వరూపుఁడవు. అలౌకికవాసా! అవిముక్తనాథా! నీకు నమస్కారము. నీవు సర్వజ్ఞుయుండవయ్యును సకలంబునకు నూర్ధ్వంబగుపరమపదంబున నివసించియుందువు. ఓహిరణ్యగర్భా! హిరణ్యరేతా! హిరణ్యవాసా! నీకుఁ బ్రణామంబులు. నీకరచరణంబులు సమస్తకంబులును, సర్వరూపంబును, సర్వంబునుగూడ హిరణ్మయమై యుండును. దేవా! నీలకంఠా! నీవు లోకకళ్యాణకరుండవగుపార్వతీశ్వరుఁడవు. నీలలోచనా! సహస్రమూర్తీ! సర్వజగద్గురూ! నీకు వందనము. భవా! నీవు భూతగణంబుల నాడీరూపకమగుయజ్ఞోపవీతమును ధరించువాఁడవు. సకలజీవులును నిన్ను యజ్ఞకర్మాదులచేఁ బూజించుచుందురు. నీవు సిద్ధచారణమహర్షిగణంబుల కేకమాత్రపూజనీయుండవు. అసంఖ్యయజ్ఞస్వరూపుఁడవు. కల్పనహారిభూషితుఁడవు. ఋషభా! పద్మనాభా! అవ్యయా! ఆత్మస్వరూపా! నీకునమస్కారము.

అని వసజోదరుండు బహుప్రకారముల వినుతించుటయు వరదుండును, బ్రిధుండునగుమహేశ్వరుండు సంతుష్టుండై యేకగ్రీవుండును, సుజరరుండును, నానాభరణభూషితుండును, నానామణివిచిత్రాంగుండును, నానాగంధానులేపనుండును, పినాకపట్టసవజ్రశూలధరుండును సర్వయజ్ఞోపవీతుండును, కౌపీనపరిధానుండును, కోటిసూర్యప్రభాముయుండును, మేఘదుందుభిగంభీరస్వరుండునునై దివ్యరూపమున సాక్షా

త్కరించి త్రైలోక్యభీకరముగాఁ బెద్దనవ్వునవ్వి, అశనికోటివినిందితం బగుభీమస్వరమున "మహాత్ములగు బ్రహ్మవిష్ణులారా! నేను మీయెడలఁ బ్రసన్నుండనై తిని. మీరు నిర్భయులై నారూపమును సంపూర్ణముగ నవలోకింపుఁడు. వనజాసనా! నీవు నాదక్షిణభుజంబవు. మఱియు నీవిష్ణుండు యుద్ధంబులయం దపరాజితం బగునావామబాహువు. మీరిరువురును నాతనయులు. ఓసువ్రతులారా! మునీంద్రులకనురూపం బగువరంబు నర్థింపుఁడు." అని యానతిచ్చుటయు హరివిరించు లానందితహృదయులై యద్దేవునిచరణకమలంబులకుఁ బ్రణమిల్లి యిట్లు ప్రార్థించిరి. ప్రభూ! నీవు మాయెడలఁ బ్రసన్నుండవై వరప్రదానంబు సేయఁదలంచితేని—పరమేశ్వరా! మాకు నీయందలిభక్తి నిశ్చలంబై యుండునట్లనుగ్రహింపుము. అని కోరుటయు భగవంతుం డగుమహేశ్వరుండు మీరు విశేషముగఁ బ్రజాసృష్టి గావింపుఁడని యభిలషితవరప్రదానంబు లొసఁగి యంతర్ధానము నొందెను. వ్యాసమునీంద్రా! జగత్కారణుండును, జగత్స్రష్టయు, సర్వజితుండు నగునద్దేవదేవుని మాహాత్మ్యమును సంక్షేపముగఁ బ్రశంసించితిని. దీని నాకర్ణించువారికి స్వర్గంబును, ఆయువును, శుభలాభంబును గలుగును. పవిత్రుండును, జితేంద్రియుండును, బ్రహ్మచారియు, యోగాసక్తుఁడునై యీమాహాత్మ్యమును బఠించువానికి యక్షరాక్షసదైత్యగ్రహపిశాచభయంబులు గలుగవు. అట్టిపుణ్యమూర్తి యశ్వమేధయజ్ఞఫలంబును బడయ గలఁడు.

## —♦ పుష్పదానాదిఫలవివరణము. ♦—

శివలింగస్థాపనము, పుష్పపూజనము, క్షీరాద్యభిషేచనము మొదలగువానిఫలంబులంగూర్చి యానతీయవలయు నని వ్యాసుం

ప్రశ్నించుటయుఁ ద్రికాలజ్ఞుండును, సర్వధర్మసారంగతుండు నగుసన త్కుమారుం డిట్లనియెను. పరాశరనందనా! శివలింగస్థాపనంబుచే సప్తాగ్నిష్టోమాదియాగఫలంబును, బహుసువర్ణదక్షిణలతోఁ గావింపఁ బడినపుత్త్రికామేష్టిఫలంబును సిద్ధించును. శివలింగస్థాపకుఁ డగువాఁడు శివునిచేఁ బుత్త్రరూపంబున సంరక్షింపఁబడుచు, అయుతార్బుదకోటి వర్షంబులు శివలోకావాసుం డగును. ఒక్కశివలింగమును బ్రతిష్ఠించి నవారు స్త్రీలైనను, బురుషులైనను, గ్లీబులైనను జిరకాలమువఱకును శివసన్నిధిని నివసించియుందురు. మహాదేవునకు సుగంధచందనప్రదాన ము సేయువారు ప్రతిమాసమును గంగాదిపుణ్యనదీజలములయందు నిరంతరస్నానములఁ గావించినఫలమును బడయఁగలరు. మహేశ్వరున కు సురభిచందనాదిప్రదానమువలన భూసువర్ణాదిదానములకంటెఁ జతు స్సహస్రగుణాధికఫలము సిద్ధించును. శివలింగాభ్యంగదానము చందన దానముకంటెను షష్టికోటిగుణాధికఫలదంబు. శివలింగమునకు క్షీరాభి షేచనము గావించినచో సువర్ణభూషితములగుచతుష్షష్టిసహస్రగోవుల ను దానము చేసినఫలము లభించును. ముఖవాద్యాదిసమన్వితముగాఁ బ్రతిపక్షమునను శివలింగాభిషేకముసేయువాఁడు యావజ్జీవమును బ్రతి మాసమునను ద్రిషవణస్నానము గావించినఫలము నందఁగలఁడు. మహా దేవుఁడు వారిశతాపరాధములను క్షమింపఁగలఁడు. శివోద్దేశమునఁ బుష్పదానము నాచరించినచో సహస్రగోదానఫలము సిద్ధించును. భక్తు లు తామరపువ్వులు, గన్నేరుపువ్వులు, సంపెంగపువ్వులు, అర్కపల్లవ ములు, బిల్వపత్త్రములు మొదలగువానిచే సర్వదా శివలింగము నర్చిం చుచుండవలయును. ఎప్పు డేవస్త్రప్రదానముచే శివార్చనముగావింప వలయునో చెప్పెదను వినుము.

శ్రావణశుక్లపక్షమునఁ నుత్పలములచేతను, భాద్రపదశుక్లపక్షము

న౯ బుండరీకములచేతను, ఆశ్వినశుక్లపక్షమున౯ గుశలచేతను, ఉత్తరేణి చేతను శివపూజ గావింపవలయును. సర్వకాలములయందును మహా దేవుని శ్వేతకుసుమములచేతనే పూజింపవలయును. బకపుష్పము, కర వీరపుష్పము, అర్కపుష్పము, దుత్తూరపుష్పము ననునీచతుర్విధకుసుమ ములగంధమును శంకరుండు విశేషముగ నాఘ్రాణించుచుండును. ఎన్నఁటికిని బకపుష్పమును, పద్మమును, నిర్మాల్యములు గానేరవు. సహస్రకరవీరంబులకంటె నొక్కయుత్పలమును, సహస్రచంపకంబుల కంటె నొక్కదుత్తూరమును నధికఫలప్రదములైనవి. మఱియు సహస్ర దుత్తూరపుష్పములకంటె నొక్కనాగపుష్పమును, సహస్రనాగపుష్పము లకంటె నొకపున్నాగమును, సహస్రపున్నాగపుష్పములకంటె నొక్క కర్ణికారమును, సహస్రకర్ణికారములకంటె నొక్కబృహస్పతీపుష్పమును శ్రేష్ఠములైనవి. మహాదేవున కధికసంతోషదాయకం బగుబిల్వపత్త్రి ముకంటె నధికం బగుపుష్ప మేదియునులేదు. భక్తులు సుగంధకలిత ములగుపవిత్రవస్తువు లన్నిటితోడను మహాదేవారాధనము గావింప వచ్చును. కాని నీలపుష్పములచే నాదేవు నెన్నఁడు నర్చింపరాదు. ఒక్కబిల్వపత్త్రిముచే శివునిబూజించినవో౯ జతుష్షష్టిపుష్పములచే న ర్చించినఫలము గలుగును. ప్రతిపక్షమును యథానియమముగ౯ బుష్ప ములతో శివుని బూజింపవలయును. నిత్యమును భక్తిపూర్వకముగా౯ బుష్పపత్త్రాదులచే శివపూజ సేయువానికి దుర్దశలు గలుగవు గావున౯ బుష్పపత్త్రిములచే శివారాధనము గావించుట యవశ్యకర్తవ్యము. పుష్పాభావమున౯ బత్త్రిములచే౯ బూజింపవచ్చును. భక్తిశ్రద్ధలతో శివునకు దీపనైవేద్యము లర్పించువాఁడు శివత్వప్రాప్తుఁడై పూజ్యుం డగును. మహాదేవు నేభావముతో నారాధించిన నట్టిఫలము లభించును. ఆయీశ్వరుని సర్వగతునిగా భావించి యెల్లయెడల నారా

ధించువాఁడు మహాపుణ్యమును, శివసాయుజ్యమును బడయఁగలఁడు.

## —♦ పూజాఫలకథనము. ♦—

పరమేశ్వరుఁ డగుమహాదేవు నేయేవిధముగా నారాధించిన భక్తప్రియుఁడగునాతఁడు ప్రసన్నుఁడగునో యింకను వినఁగోరెద నని వ్యాసుండు ప్రశ్నించుటయు సనత్కుమారుఁ డిట్లనియెను. సాత్యవతేయా! పూర్వకాలమునం దయుతసూర్యతేజోమయుఁడును, ప్రమథగణేశ్వరుఁడు నగునందికేశ్వరుఁడు మహాదేవమాహాత్మ్యమును దెలిసికొనఁగోరి యాదేవదేవునిసన్నిధిం జేరి చరణకమలములకుఁ బ్రణమిల్లి "ప్రభూ! నేను భవదీయంబగుమాహాత్మ్యమును వినవలయునని యభిలాషపడుచుంటిని. కావున దయతో నాకెఱింగింపవలయును." అని ప్రార్థించుటయు మహేశ్వరుండు ప్రసన్నుండై యానందికేశ్వరునుద్దేశించి దేవీసాన్నిధ్యమునఁ దనమాహాత్మ్యము నభివర్ణించి చెప్పెను. ఆనందికేశ్వరునివలన దానిని నేను వినఁగలిగితిని. మునిశ్రేష్ఠా! పూర్వము భగవానుఁడగుమహేశ్వరుఁడు తనమాహాత్మ్యముంగూర్చి పార్వతి కిట్లుపదేశించెను. వరవర్ణినీ! ఎవ్వఁడు కైలాసగిరిసన్నిభంబగురమణీయమందిరమునందు మదీయంబగులింగమును, మత్సహచరగణములను బ్రతిష్ఠించునో యాతఁ డణిమాద్యష్టసిద్ధులను బడసి యంతమునందు మదావాసమును జేరఁగలఁడు. నన్నుద్దేశించి కర్షమాత్రసువర్ణప్రదానము చేసినవానికిఁ గైలాసశిఖరమునందు బాలార్కసదృశంబగుసువర్ణమందిరమున సుస్థిరావాసము సిద్ధించును. దేవీ! నన్నుఁగూర్చి సువర్ణదానముగాని, గోదానముగాని చేయువాని కక్షయఫలము సిద్ధించును. మదుద్దేశముగా వృషభదానమును, తిలమిశ్రితం బగునన్నదానమును గావించువాఁడు సర్వాభీష్టదాయకమును, సిద్ధింపఁజేయును సకలభోగాలాభము నందు-

గలఁడు. నాయనుగ్రహముచే నాతఁడు రత్నవృషభాదిలాభమునుగాంచి పాపవిముక్తుండగును. తపములచేతను, ఉపవాసాదివ్రతములచేతను, రుద్రసూక్తాదిజపములచేతను, పాయసాది వివిధోపహారనివేదనములచేతను, నృత్యగీతవాద్యాదులచేతను నిత్యము నన్నర్చించువాఁడు బ్రహ్మలోకప్రాప్తుండై బ్రహ్మసాక్షాత్కారముం గాంచి నారదాదిమహామునీంద్రులచేఁ బూజితుండగుచుండును. నాప్రీతికొఱ కగ్నిష్టోమాదియాగములఁ గావించువాఁడు దేవలోకంబుఁ జేరి మహేంద్రునియేకాసనమున దేవతలచేఁ బూజింపఁబడుచుండును. దేవీ! ప్రతిదినమును బ్రాతఃకాలమున నన్నర్చించువాఁ డద్వితీయసంపద్విభవుం డగును. మధ్యాహ్నసాయంకాలములయందు నన్నారాధించువాఁడు యక్షకులమున జన్మించి యతిబలవంతుండును, యక్షప్రభుఁడును గాఁగలఁడు. మదీయలింగప్రతిష్ఠాపనము చేసి ధూపదీపచందనాదులచే నిత్యమునర్చించువాఁ డింద్రాదిలోకపాలురకుఁ బ్రభుండగును. అతనికి మాయామోహము గలుగదు.

ఎవ్వఁడు మదీయంబగుమందిరమును సమ్మార్జనంబు గావించి, గోమయాదులచేవిలేపనాదిసంస్కారము లాచరించునోవాఁడు పూర్వోక్తభక్తగణంబులకంటె సహస్రగుణాధికుండగును. బంగారముచేతను, వెండిచేతను నాలింగమును బూజించువారు శివలోకమున గాణపత్యలాభముం గాంచఁగలరు. శివలింగమునకుఁ దైలాభ్యంగిన మాచరించువారు వారికంటెను బంచశతగుణాధికులై యుందురు. తైలాభ్యంగముకంటె నభిషేచనఫలంబు ద్విగుణితంబు. అందు గంగోదకాభిషేచనమును, బంచగవ్యాభిషేకమును, గర్పూరదానమును ద్విసహస్రగుణాధికఫలదంబులు. క్షీరాభిషేకము వానికంటెఁ బంచశతగుణంబులును, మాల్యదానమంతకంటెఁ బంచశతగుణంబులును నధికమైయుండును. అర్ఘ్యాచరిం

చువారు నాయనుగ్రహముచేశివలోకంబున గాణపత్యలాభముంగాంచఁ గలరు. మధురభాషిణీ! అగురుచందనపరిదానము పూర్వోక్తకర్మంబులకంటె శతసహస్రగుణాధికమైనది. గంధద్రవ్యదానము దానికంటె దశగుణములును, మాల్యపరిదాన మంతకంటెను బంచశతగుణములును నధికంబగును. నిర్మాల్యగ్రహణము దత్సమానమైనది. ధూపంబును, కృష్ణాగురుచందనప్రదానమును గాంచినఁజతుస్సహస్రగుణాధికంబును, కృష్ణాగురు, చందన, ధూపదానం బంతకంటె ద్విగుణితంబును నగును. ఘృతసహితమగుధూపదానము చతుర్గుణాధికము. ఈసకలోపచారంబులచే నన్నుఁ బూజించువారిసహస్రాపరాధములను నేను క్షమింతును. ఒకసంవత్సరము నియమపూర్వకముగా మత్సన్నిధిని కృష్ణసారిగుగ్గులుధూపంబు సేయువాఁడు సంశీశ్వరసమానుం డగును. దేవీ! మత్ప్రియంబుగా ఘృతపరిదానమును, గాయత్రీమంత్రపూర్వకముగా నైవేద్యసమర్పణమును గావించి బ్రాహ్మణులకు దక్షిణలొసఁగువాఁడు, దివ్యమూర్తిని, దివ్యజ్ఞానమును, మోక్షలాభమును బడయుటకు సమర్థుం డగును. ఆతనిచే నివేదింపఁబడినపదార్థములు నతిపవిత్రములుగా నెంచి పితృదేవతలు పరిగ్రహింతురు. తన్నివేదికములగుఘృతోదకాదు లిహపరములయందుఁ జిరకాలమువఱకును ఫలప్రదములై యుండును. శ్రద్ధతో నొకసంవత్సరము కమలబీజాన్నముం బోలికోమలప్రకృతియు, పాపవినాశకుఁడును నగుమహాదేవుని ఘృతాభిషేకరూపమున నారాధించువాఁ డెన్నఁటికిని మృత్యుముఖమునంబడక గాణపత్యలాభముం గాంచగలఁడు. పూజాద్రవ్యములలోఁ బ్రధానంబగుదీపదానమును శివలింగసా[illegible] రుద్రగణతుల్యప్రభావశాలి[illegible]హణపూర్వకముగా భూ[illegible] సంచరి[illegible]ములయందలి యష్టమీచతుర్దశులయం

దు విధివిధానమున భక్తిపూర్వకముగా మహాదేవునకు ఛత్రదానముచే యువాఁ డింద్రతేజుఁడై మహాదేవసాయుజ్యము నందగలఁడు. దేవీ! నీకునునాకును భక్తుం డగువాఁడు నియమయుక్తుఁడైనను, నియమరహితుఁడైనను నాయనుగ్రహముచే నిష్టఫలసిద్ధిం గాంచగలుగునో చెప్పెదను వినుము.

మద్భక్తుం డగువాఁడు స్వచ్ఛందనిరతుండై విహంగముంబోలి వ్యోమచారియై, యజితుండును, సర్వలోకపూజ్యుండును స్వర్గాధిభోగ సంపన్నుండును గాఁగలఁడు. మత్కథాశ్రవణమాత్రంబున నాయందు భక్తినిరతులగువారు మదనుగ్రహంబున గాణపత్యలాభముం గాంచఁ గలరు. వారికి మదీయంబులగుపుణ్యస్థానంబుల సేవించినఫలము సిద్ధించును. అట్టివారికి మృత్యుభయంబులేదు. నిష్కాముఁడై త్రికరణశుద్ధిగా భక్తితో నన్నుపాసించువాఁడు ప్రళయకాలమునందుఁగూడ జీవించియుండును. ప్రతిపదంబునను విఘ్నములం గాంచుచుఁ దమోగుణావేశముచే నున్మత్తుఁడై భక్తినిరతుండు గాఁజాలనివాఁడు నిత్యవ్యాధిగ్రస్తుండగును. సత్యసంధులును, జితేంద్రియులును, సమాధిసంపన్నులు నేకాగ్రచిత్తులునై సర్వదా నన్ను భావించువారికి శతకోటియుగములకైనను నపాయము గలుగఁబోదు. అల్పధనశాలియగుటచే విధిపూర్వకముగా నన్నర్చింపఁజాలనివాఁడు కేవలమాత్రభక్తితో నన్నుపాసించినచో నేను వానికి సర్వాభీష్టములను బ్రసాదింతును. ఉత్తమగతిలాభమునకు మదర్చనాదికముకంటె నితరమార్గములేదు. ఇది దేవతలకైనను నవేద్యమగుపరమరహస్యము. ఇంకను నతిగుహ్యం బగువిషయమును జెప్పెద నాకర్ణింపుము.

దేవీ! ఆత్మీయులగు నీవును, స్కందుండును బ్రతిమారూపమున నన్నర్చించినదానికంటె నితరులు లింగరూపమున నారాధించుట

మే నాకధికప్రియమని యెఱుంగుము. నేను దేవగణపూజితుండనై వారికి మోక్షదానము సేయుచుందును. ధూపదీపగంధమాల్యకాంచన రక్తవస్త్రాదులచే నన్నర్చించువారు గాణపత్యలాభముం గాంచఁగలరు. ఏకరాత్రోపవాసియై నన్నారాధించువానికిఁ బుండరీకఫలమును, సకల యజ్ఞఫలమును లభించును. అతనికి స్వర్గమునందు విపులభోగానుభవము గలుగును. పవిత్రుఁడై నియమపూర్వకముగా భక్తితో నన్నభిషేకించువాఁడు భువనత్రయము నతిక్రమించి శివలోకము నధిగమింపఁ గలఁడు. సాంఖ్యయోగకుశలు లగువారుభక్తిపూర్వకముగా నన్నుపాసించి శివలోకావాసు లగుచుందురు. భిన్నభావులై యితరదేవతల నుపాసించువారు దారుణు లగుదురు. దేవీ! దేవతలైనను ధ్యానయోగవ్యతీతమగుతపస్సుచే నన్నవలోకింపఁజాలరు. ధ్యానముచేతనే నాదర్శ ఫలాభము గలుగును. ఇతరదేవతల నారాధించుభక్తులకు నియమితఫలలాభంబగుచుండును. కానిమద్భక్తులపుణ్యఫలంబునకుమాత్రము పరిమాణము లేదు. ప్రళయకాలమునందు స్థావరజంగమాత్మకములగు సకలపదార్థములకును వినాశము గలదు; గాని నాభక్తులకుమాత్ర మెన్నఁటికిని నాశములేదు. భక్తిపరతంత్రులై శ్రద్ధతో నెవ్వరేదేవతనుపాసించినను నేను వారి కామూర్తితోఁ బ్రసన్నుండ నగుచుందును. నన్ను సర్వమయునిగా భావించి సకలపదార్థములందును మత్స్వరూపమును దర్శించువాని కెన్నఁటికిని వినాశంబు గలుగదు. నేనును విముఖుఁడ నుండ నాతని ననుసరించి యుందును. మనోబుద్ధులను సత్యమునందర్పించి భక్తితో నన్ను భావించువాఁడు మదనుగ్రహంబున సర్వపాపవిముక్తుండగును. సర్వవిధపాపాచారి యయ్యును సర్వదా నన్ను స్మరించువాఁడు శివలోకంబుఁ జేరి మత్సందర్శనలాభముం గాంచగలుగును. సకలకార్యారంభములయందును సర్వదా నన్ను ధ్యానించి స్మరించు

చుండువాఁడు ధర్మార్థకామమోక్షంబులు సర్వోత్కృష్టఫలభోగి యగును. షడంగన్యాసపూర్వకముగా నిత్యము నన్నర్చించువానికి మత్సాయుజ్యలాభము గలుగును. దుత్తూరపుష్పము, చంపకప్రసూనము, బిల్వపత్రము, మొదలగువానిని నాకు నివేదించినను, అలసభావము లేకుండ వానిచే భక్తిపూర్వకముగ నన్నర్చించినను గాణపత్యలాభము సిద్ధించును. ప్రశస్తములగు పద్మములచేతను, అర్కపుష్పములచేతను నన్నుఁ బూజించినను, సహస్రకరవీరపుష్పములు నాకు నివేదించినను బూర్వోక్తఫలప్రాప్తి యగును.

అర్కపుష్పములు వేయింటిచేఁ బూజించుటకంటె నొకకమలకుసుమమునఁ బూజించుట యధికఫలదాయకము. సహస్రకమలకుసుమములతో నొకబకపుష్పమును, గుందపుష్పమును సమానమైనవి. సహస్రకుందకుసుమములును నొకబకప్రసూనమును సమానము. సహస్రబకపుష్పములకంటె నొకయుత్పలము శ్రేష్ఠమైనది. సహస్రోత్పలములకంటెను నేకమాత్రబిల్వపత్త్రి మధికఫలదంబు. శివపూజకుఁ జంపకదుత్తూరకుసుమములు సమానములు. ఒక్కదినముమాత్రము భక్తిపూర్వకముగా నీసకలప్రసూనములచేతను, చందనాద్యుపచారములచేతను నన్నారాధించువానికి,సంవత్సరము ప్రతిదినమునొక్కొకపుష్పముతో నన్నుఁబూజించినఫలము లభించును. బకప్రసూనముతో నన్నుఁ బూజించువాని కేనుబదిరతులసువర్ణమును దానము చేసినఫలము లభించును. నిశ్చలభక్తిపూర్వకముగా నన్నారాధించువాఁడు నావలెనే త్రిశూలధారియు, వృషారూఢుండు నై మత్సాయుజ్యము నందిగగనభాగమున వాయువుంబోలి యెల్లయెడల విహరించుచుండును.

దేవీ! నానిర్మాల్యమును బాదములతో స్పృశించువాఁడు షష్టిసహస్రవర్షంబులు తిర్యగ్జాతులయందు జన్మించుచుండును. ముప్పది

మూఁడువేలమంది దేవదానవరాక్షసులు ధర్మకామార్థసిద్ధికై నిత్యము ను నన్నుఁ బూజించుచుందురు. సకాముఁడైనను, నిష్కాముఁడైనను నెవ్వఁడు నిత్యము నీశివమాహాత్మ్యమును బఠించుచుండునో, వినుచుం డునో యాతఁడు శివలోకమును జేరి మహాదేవునకుఁ బ్రియుండై యుండును.

## —♦ పూజావిధానము. ♦—

దేవదేవుఁడగుశంకరుం డెట్లు సంతుష్టుఁడగునో, పుష్పాభావమున నాతని నెట్టివస్తుప్రదానమున నర్చింపవలయునో, ఏపువ్వులచేఁ బూజిం చిన నెట్టిఫలము గలుగునో, శాస్త్రసమ్మతము లగునేయేముద్రలచేఁ బుష్పదానము గావించిన మహత్ఫలం బగునో, శివపూజ యేవిధము గా నాచరింపవలయునో, ధూపదానోపవాసములవలన నెట్టిఫలము గలుగునో దయతో నెఱింగింపవలయు ననివ్యాసదేవుండు ప్రశ్నించుట యు సనత్కుమారుం డిట్లు చెప్పఁదొడంగెను. మునీంద్రా! పూర్వకా లమునం దొకప్పుడు భగవతి పార్వతీదేవి దేవగురుండును భూతనాథుం డును, భగవానుండు నగుమహాదేవునుద్దేశించి "నాథా! ఏవిధముగా మిమ్మారాధించిన మీరు సంతుష్టులగుదురు? మానసికజపము, పూజ మొదలగునెట్టికర్మములచే జీవులకు ముక్తిలాభం బగును? ఈవిషయము లను బరమానుగ్రహముతో నాకెఱింగింపుము" అని ప్రార్థించుటయు మహాదేవుండు మందహాసముసేయుచు సాధువాదపూర్వకంబుగా నిట్లని యెను. దేవీ! భక్తానుగ్రహార్థమై నీయడిగినప్రశ్నము సర్వోత్తమ మైనది. పుష్పములు రక్తపీతాదివర్ణవిలసితములును, నిర్గంధ, సుగంధ, దుర్గంధ, నానాగంధకలితంబులును, సూక్ష్మకంటకాకులితంబులునై వివిధరీతుల నలరారుచుండును. వీనిలో నేపుష్పములచే నేదేవతల

బూజింపవలయునో చెప్పెదను. సుగంధశుక్లపుష్పములచే దేవతలను, దుర్గంధకుసుమములచే దానవులను, కరినక్షుద్రకంటకప్రసవంబులచే రాక్షసులను, అకాలప్రసవములగువనప్రసూనములచేఁ బితృదేవతలను బూజింపవలయును.

అని చెప్పుటయుఁ బార్వతీదేవి ‹‹హృదయేశ్వరా! వివిధకుసుమములచే మిమ్ముఁ బూజించుటవలనను, మీగృహసమ్మార్జనవిలేపనములవలనను, ధూపదీపాదిదానములవలనను, అభ్యంగాభిషేచనములవలనను, నృత్యగీతవాద్యాద్యుపచారములవలనను భక్తుల కెట్టిపుణ్యఫలము లభించునో యానతీయవలయును” అని ప్రార్థించుటయు శంకరుం డిట్లనియెను. దేవీ! సకలద్రవ్యములయందును, సమస్తవస్తువులయందును బహుమూల్యమైనదగుటచే సువర్ణము సర్వశ్రేష్ఠమైనది. కావున భక్తవరుం డగువాఁడు సువర్ణముచే నన్నుఁ బూజించినచో నాతఁడు నాయనుగ్రహమున శివలోకపూజితుండై దశసహస్రవర్షము లప్సరోగణసహితముగా శివలోకమున విహరించుచు భోగావసానసమయమున మరల భూలోకమునం దవతరించును. ఎనుబదికర్షములప్రమాణమైనను, ఏకాదశమాషప్రమాణమైనను గలకాంచనమును భక్తిపూర్వకముగా నాకర్పించువాని కపారపుణ్యఫలము సిద్ధించును. ఒక్కొక్కపుష్పముగూడ సువర్ణమువలెనే ఫలప్రదమైనది. నాకతిప్రియములగు ద్రోణపుష్పమును, కుందకుసుమమును, బిల్వపత్త్రమును సువర్ణసమంబులు. జపాకుసుమమును, నాగపుష్పమును సువర్ణముకంటె ద్విగుణఫలదంబులు. జాతీమల్లికాచంపకపుష్పములు బహుసువర్ణసమానములు. ఘృతాభావమైనప్పుడు భక్తిపూర్వకముగాఁ దైలదీపముచే నన్నారాధించువాఁడు శతకోటివత్సరములు శివలోకమునఁ బూజితుండై దీపదానప్రభావముచే నందుఁ జంద్రునివలె విరాజిల్లుచుండును. మన్గృహసమ్మా

ర్జనము దీపదానముకంటె శతగుణాధికఫలదంబు ; గృహవిలేపనము సహస్రగుణాధికఫలదం బగును. ధూపదీపపుష్పోపహారాదులచే నన్నుఁ బూజించుట యంతకంటెను శతగుణాధికఫలదంబు. శతసహస్రమాలికాదానముకంటె జపము శతగుణాధికం బగుచున్నది. భక్తప్రదత్తములగు నగురుచందనాదిసుగంధధూపము లేకవింశతిసువర్ణసదృశంబులు. భక్తులు ఘృతచందనాదులచే శివలింగాభ్యంగనంబును, క్షీరంబులచే నభిషేచనంబును, ఘృతసహితముగా ధూపసేవనంబును గావింపవలయును. దేవమానవు లీవిధి ననుసరించియే నన్నర్చింపవలయును. పితృగంధర్వయక్షపన్నగరాక్షసాదులకుఁగూడ నిదియే పూజావిధానంబు.

పార్వతీ! ఈసకలవిషయములును లోకహితార్థమై నీయెదుటఁ బ్రశంసించితిని. యథావిధిగ నన్నారాధించువాఁడు యథాకాలంబున నందిపదలాభము నందఁగలఁడు. కాలాంతరమునందాతఁడు కేవలవృషధ్వజుం డగుప్రమదనాథుండు గాఁగలఁడు. వ్యాసమునీంద్రా! భగవానుం డగుమహాదేవుండు లోకహితసాధనంబునకై యుపదేశించిన యీ పుష్పదానవిధానంబు యథారూపమున నీకు వినిపించితిని. దీనిని భక్తితోఁ బ్రతిదినమును బఠించువాఁడును, వినువాఁడును, ప్రతిపర్వముననుభక్తులకు వినిపించువాఁడును పాపవిముక్తులై శివలోకమున సుస్థిరులై యుండఁగలరు.

## —♦ ఉపవాసవిధి. ♦—

వెండియు సనత్కుమారుం డిట్లనియెను. పరాశరనందనా! ఒకప్పుడు దేవగంధర్వమునిగణంబులు పరమగుహ్యంబును బురాతనంబు నగునుపవాసవిధింగూర్చి సంక్షేపముగ నాకర్ణించి యంతమాత్రంబునఁ దనివినందఁజాలక భగవానుండును, త్రిలోచనుండును, త్రిపురశాసకుం

మను నగుమహాదేవునివలన విస్పష్టముగఁ దెలిసికొనవలయు ననుకుతూహలములో సిద్ధగంధర్వగణపరివృతులై హిమాలయంబునకుం జని యమ్మహాదేవు నిట్లు వినుతింపనారంభించిరి. మహాదేవా! నీవింద్రాగ్ని యమస్వరూపుఁడవు. సనాతనుఁడవు. ధర్మార్థకామములును, మనీషివర్యులమానస్సంకల్పమును నీస్వరూపంబులు. తుష్టియు, స్థైర్యంబును, మేధయు, శ్రద్ధయు, కామంబును, మానంబును నీవే. నీప్రసాదంబుచే నీభక్తులు దుఃఖప్రదంబగుభీమణనరకమునుండి యుత్తీర్ణు లగుచుందురు. నీభక్తగణంబులు విహరించుచోట వారితేజముచే సూర్యచంద్రులు హీనప్రభులగుచుందురు. మనీషిగణంబులు దేవపితృకార్యంబులయందు భవదీయమంత్రము నీవిధముగానుచ్చరించుచుందురు. సురశ్రేష్ఠా! శ్రద్ధతో నియమవంతుఁడై నీమాహాత్మ్యమును బఠించువాఁడును, బత్త్రంబున లిఖించి ధరించువాఁడును విగతకిల్బిషుం డగును. జగన్నాథా! నీవు సర్వభూతేశ్వరుఁడవు. సర్వవ్యాపివి, పంచముఖుండవునగునీకు నమస్కారములు. దేవా! నీవవ్యయుఁడవు. అప్రమేయుఁడవు. పురుషోత్తముఁడవు. పంచభూతములును నీస్వరూపములు. దేవాదిదేవా! నీకు నమస్కారము.

అని వినుతించుటయు భగవానుం డగుమహాదేవుండు ప్రసన్నుండై యిట్లనియెను. సురవరులారా! మత్పూజావిషయంబున జాతీయూథికామల్లికాపుష్పములు పంచసువర్ణములకును, రక్తోత్పలాదిపుష్పములు సప్తసువర్ణములకును, బిల్వపత్త్రంబును, అశోకపుష్పమును, దశసువర్ణంబులకును, సకేసరంబు లగునాగపుష్పము లేకాదశసువర్ణములకును, స్థలపద్మము ద్వాదశసువర్ణములకును, సురభిళంబు లగుకాంచనవర్ణపుష్పములు త్రయోదశసువర్ణములకును, పద్మకుసుమము ద్వాత్రింశత్సువర్ణములకును, కుశపుష్ప మష్టాశీతిసహస్రసువర్ణములకును, అర్కపు

ష్పము త్రిసహస్రసువర్ణములకును, బకపుష్ప మశీతిసువర్ణములకును, దుత్తూరపుష్పము శతసహస్రసువర్ణములకును సమానంబు లని చెప్పం బడియెను. అర్క, కరవీర, కుశ, దుత్తూరపుష్పములచే భక్తియుక్తుఁడై నన్నుఁ బూజించువాఁడు గాణపత్యలాభముం గాంచును. ఈసకల పుష్పసుగంధములను నే నతిప్రియంబుగ నాఘ్రాణించు చుందును. కృష్ణాష్టమియందును, జతుర్దశియందు నపరాహ్ణకాలంబున మన్నామో చ్చారణము సేయుచు నీసకలపుష్పములచేతను నన్నుఁ బూజించు వాఁడు నాలోకంబున నెల్లవారిచేతను బూజితుండై సకలలోకవిహార లాభంబు గాంచి నేను పూజింపఁబడుస్థానములందెల్ల లెస్సగాఁ బూజిం పఁబడుచుండును. ఏకాగ్రచిత్తంబున నన్నారాధించువాఁడు నరకాదుల నుత్తరించి శివపదలాభంబు గాంచఁగలఁడు. దేవత లాతనికి విఘ్న ములఁ గూర్పఁజాలరు. ఆతఁడు మదనుగ్రహంబున నిహపరలోకసుఖ సంపన్నుం డగును. ఆతనికిఁ దపోయోగవ్రతానుష్ఠానములతో నిమి త్తము లేదు. క్లేశసాధ్యములగు తపోనియమాదియాతనలచే నాతఁడు కృశింపనక్కఱలేదు. సర్వయోగేశ్వరుండ నగునన్నుపాసింపక కేవల బ్రహ్మవాదు లగువారు మిథ్యాశబ్దపాశంబులచే బంధితులును, వంచి తులునై పోవుదురు.

మఱియు ధారోష్ణంబు లగుక్షీరంబులచే మదీయంబగులింగము నభిషేకించి, పూజించి యభిమతానుసారముగా నివేదన మాచరించు వాఁడు శతసహస్రకోటివర్షములు హిమాలయమునందుఁ బూజితుఁడై యుండును. శివమంత్రదీక్షితుఁ డగుభక్తుఁ డొక్కకృష్ణాష్టమీదిన మున నేస్థలమునందైనను, ఏవిధానముచే నైనను నన్ను భక్తితోఁ బూజించి ధారోష్ణంబు లగుక్షీరములచే మదీయం బగుశివలింగము నభి షేకించినచో నాతఁడు నాకతిప్రియుండై నాలోకమున మత్సన్నిధాన

మునఁ గోటియుగంబులవఱకును నివసించియుండును. సరళదేవదారు ధూపములచే నన్నర్చించువాఁడు నూటయేఁబదిరెండు కనకకుసుమము లచే నన్నుఁ బూజించిన పుణ్యముం గాంచి షష్టిసహస్రవర్షములు శివ లోకమున నానందభోగము లనుభవించుచుండును. నాపూజాసమయ మున సఘృతంబు లగు గురుగుగ్గులముల దహనంబు సేయువాఁడు కోటిసహస్రయుగములవఱకును శివలోకమునఁ బూజితుం డగును. అంధకారవినాశనముకై యొకసంవత్సరము యథాకాలమున నన్నుద్దే శించి దీపదానము చేయువానిహృదయాంతరమునందు భక్తప్రియుం డగుశంకరుఁడు, నిరంతరమును సుస్థిరుండై యుండును. ఉపవాసియై యెవ్వఁడు శివలింగసన్నిధిం జేరి కృతాంజలిపుటుఁడై "దేవదేవా! అం గుష్ఠమధ్యమునందు సులక్షణమగుయవరేఖచే విలసిల్లునీకు నమస్కా రము. సర్వభూతనమస్కృతుండ వగునీవు సర్వజీవశరణ్యుండవు. మహా మతీ! నీకు వందనములు. అక్షయములైన యష్టైశ్వర్యములను నాకుఁ బ్రసాదింపుము." అని ప్రార్థించునో యాతనికి మహత్తరం బగుశ్రే యము లభింపఁగలదు.

అనుటయు మహాదేవి యగుపార్వతి యిట్లనియెను. త్రిలోక నాథా! నిఖిలలోకారాధ్యా! నీవు నిఖిలజీవహితకరంబు లగువిషయము లను బోధించుటకు సమర్థుఁడవు. దేవా! మానవు లేవిధముగా నేకాల మున నుపవాసవ్రతం బాచరించిన నెట్టిఫలంబును గాంతురో సవిస్తర ముగా నుపదేశింపవలయును. అనిప్రార్థించుటయు మహాదేవుం డిట్లు చెప్పందొడంగెను. ప్రియా! పూర్వము నైమిశారణ్యవాసు లగువాల ఖిల్యాదిమునిగణంబులకును, ఫేనికులును, దరిద్రులును, దుఃఖజీవులు నగువారికిని నాచేఁ జెప్పంబడిన యోగమార్గానుసారం బగుదివ్యోప వాసఫలవిధానము నిప్పుడు సవిస్తరముగా నీకు బోధించెదను. సావధా

నచిత్తముతో నాకర్ణింపుము.

మధ్యభక్తుం డగువాఁడు పంచమి, షష్టి, పూర్ణిమాతిథులయం దుప వాసము చేసిన వోఁ బ్రియదర్శనుం డును, మహాజ్ఞానియుఁ, బరమభాగ్య సంపన్నుండు నై యుండును. కృష్ణాష్టమీకృష్ణచతుర్దశులయందు మ త్ప్రియంబుగా నుపవసించువాఁడు బహుధనాఢ్యుఁడును, బహుపుత్త్ర వంతుఁడును, విద్వాంసుఁడును గాఁగలఁడు. శుక్లాష్టమీచతుర్దశులయం దుపవసించువారు జ్ఞానులును బరమసుందరులు నగుదురు. నవమినాఁ డేకాహారియై శివపూజ గావించువాఁడు కృషిజీవియై బహుధనపుత్త్ర లాభముం గాంచఁగలుగును. ద్వాదశినాఁ డిట్లు గావించిన వో ధనవం తుఁడును విద్వాంసుఁడు నగును. ఒకసంవత్సర మమావాస్యాంతర మగుత్రిరాత్రోపవాసంబు గావించుచు శివపూజ నాచరించువాఁడు శతసహస్రవర్షంబులు స్వర్గలోకపూజితుండై యుండును. ఇట్లే యొక సంవత్సరము ప్రతిమాసమునందును త్రిరాత్రోపవాసవ్రతం బాచరిం చువాని కాకాశపథంబున నప్సరోగణసహితముగా విమానవిహారభా గ్యంబు లభింపఁగలదు. అతఁడు కాలాంతమునం దొకప్పుడు స్వర్గచ్యు తుం డయ్యును సత్కులప్రసూతుండు గాఁజాలును. నియమోపవాసి యు, నేకాహారియునై కార్తికమాసంబున దీపప్రదానము సేయుచు, మార్గశీర్షమాసంబున నితరాహారములఁ బరిత్యజించి కేవలజలపానమా త్రంబునఁ గాలక్షేపము సేయుచు, మరల బౌషమాసమునం దేకాహారి యై యామాసాంతమున విశుద్ధబ్రాహ్మణసమారాధనంబు గావించి దక్షిణలతో వారికిఁ దృప్తింగూర్చువాఁడు మరణానంతరంబున హంస సారసమన్వీత మగువిమానము నధిరోహించి దేవగణపూజితుం డగుచు మహాత్ములగువారు నివసించు దివ్యలోకంబులయందు విహరించుచుం డును. అతఁ డాలోకంబులయందు లక్షవర్షంబులవఱకును సుఖభోగం

బులనుభవించుచునుండి మరల భూలోకమునందు శ్రేష్ఠకులంబున నవతరించి పూర్వజ్ఞానసంపన్నుండై సర్వదా ధర్మాచరణంబు సేయుచు నెన్నఁటికిని దుర్దశాపన్నుండుగాక మత్ప్రియుండై యుండును.

మాఘమాసంబునఁ దిరాత్రోపవాసమాచరించి యుపవాసాంతమున శివపూజచేసి వివిధాన్నపానాదులచే బ్రాహ్మణులను సంతుష్టులం గావించి యథాశక్తిని దక్షిణల నర్పించువానికి బ్రహ్మజ్ఞానమును షష్టిసహస్రవర్షములు శివసాక్షాత్కారలాభమును, గామరూపంబును, గామగమనమును, వైశ్వానరతేజోమయంబగుదివ్యలోకంబునఁ జిరనివాసంబును, సిద్ధించును. అనంతర మాతఁడు సకలజనమాననీయం బగు బ్రాహ్మణకులమునం దవతరించి సార్వభౌమపూజితుండగును. మఱియు నేకాహారనియమములతో ఫాల్గుణమాసమును గడపుచు మాసాంతమున శివపూజనంబు సేసి యథాశక్తిదక్షిణలతో బ్రాహ్మణసమారాధనము గావించువాఁడు శతయోజనవిస్తీర్ణంబును, అగ్నిసదృశతేజోమయంబు నగువిమానము నధిరోహించి బ్రహ్మలోకమునఁ దేజోమూర్తియైవిహరించుచుఁ జిరకాలముండి పిమ్మట వేదవిదుండును, విజ్ఞానసంపన్నుఁడును, ధర్మజ్ఞుఁడును, వినీతుఁడును, పరమయాజ్ఞికుఁడును, అనుకూలదారుఁడు నగుబ్రాహ్మణుఁడై యవతరించును.

దేవీ! ఈవిధముగాఁ జైత్రమాసము నతిక్రాంతముగాఁ జేయుచు మాసాంతమున నన్నారాధించి యథావిధిగ సద్బ్రాహ్మణుల నన్నపానాదిసంతృప్తులం గావించి యోపినకొలఁది దక్షిణల నొసఁగువాఁడు త్రింశత్సహస్రవర్షములు స్వర్గలోకమునఁ బూజితుఁడై యుండి మరల భూలోకమున గోసహస్రదాతయై జన్మించును. ప్రియా! మద్భక్తుం డగువాఁడు జ్యేష్ఠమాసంబున నేకాహారుండై పూర్వోక్తప్రకారముగ నాచరించి తత్ఫలంబును బడయఁగలఁడు. ఈమాసమునం

దొక్కదినమైన భక్తితో నేకభుక్తంబు సేయువాఁడు మహాపాతకవిము క్తుండు గాఁగలఁడు. మాసాంతంబువఱకును యథానియమముతో నుండువానికిఁ బునర్జన్మమే లేదు. ఈశ్వరప్రభావముంగూర్చియు, వర్షవ్యాప్తమగునుపవాసవిధానముంగూర్చియు సంక్షేపముగ నెఱింగించితిని. సర్వాభీష్టసాధకమును, అక్షయము నగునీయుపవాసవిధానమును భక్తితో నాకర్ణించువారు పితృలోకమున నిజపితృగణంబులతో సుఖముగఁ గాలయాపనము సేయఁగలుగుదురు. దీనిని బఠించి బ్రాహ్మణునకు గోదానంబుసేయువారు సూర్యసమతేజంబును, నిర్మలంబును, దేవకాంతాగణసమన్వితంబు నగువిమానము నధిరోహించి దశసహస్రవర్షపర్యంతమును స్వర్గలోకమున సుఖవిహారంబు సేయుచు ననంతరము ప్రసిద్ధ మానవకులంబున నుదయించి సర్వదుఃఖరహితులై సకలబంధవిముక్తులై శతవర్షములు రాజత్వలాభముం గాంచఁగలరు. దేవీ! ఇంతకంటెను బరమగుహ్యంబగువిషయమును దెల్పెదను. పూర్వోక్తవిధానంబున నన్నారాధించువాఁ డేకవింశతికల్పంబులవఱకును బునర్జన్మంబు నందఁడు. పిమ్మట నాతఁడు రాజధర్మము నాశ్రయించియు ధర్మపరిత్యక్తుండు గానేరఁడు. ఆషాఢమాసమున సప్తమి, అష్టమితిథులయందొక్కసారిమాత్రము ఫలభక్షణమాచరించి మదీయం బగుదక్షిణామూర్తి నుపాసించువాఁ డనంతపుణ్యఫలసిద్ధుం డగును.

శ్రావణమాసమంతయు నేకాహారియై కడపుచు మాసాంతమున శివారాధనమాచరించి వివిధాన్నపానాదులచే బ్రాహ్మణులను సంతుష్టులుగఁజేసి శక్తికొలఁది దక్షిణలనర్పించువాఁడు హంససారససహితంబగువిమానము నారోహించి నానాస్థానంబుల విహరించుచు నయుత వర్షములు చంద్రలోకమునఁ బూజితుఁడై సుఖముగ నివసించియుండును. ఆతనియెడలఁ బితృగణంబులు ద్విసహస్రవర్షంబులవఱకును సంతు

ష్ఠులై యుందురు. అనంతరమవ్వాఁడు భూలోకమున దేవగంధర్వపూజి తుఁడును, పుత్రపౌత్రసంపన్నుండు నగు బ్రాహ్మణుఁడై పుట్టి పరమబ్రహ్మ విదుం డగును. ఈరీతినే భాద్రపదమాసమునం దాచరించువాఁడు లక్షవర్షములు వాయులోకమునఁ బూజితుఁడై పిమ్మట భూలోకమునం దుత్తమకులంబున జన్మించి సర్వభూతశాసనసమర్థుఁడై సవిశేషంబుగ వేదాధ్యయనతత్పరుం డగును. మఱియు నిట్లే యాశ్వీనమాసంబునఁ గావించువాఁడు శ్రద్ధానుష్ఠితంబగు రాజసూయయజ్ఞమునకుఁ ద్విగుణిత మగుఫలలాభము నంది షష్టిసహస్రవర్షములు సూర్యలోకమునఁ బూజి తుఁడై యుండి యనంతరము మేధావియు, బలిష్ఠుఁడును, ధనవంతుఁడు నై యుత్తమకులంబున జన్మించి సర్వజనసన్మానితుం డగును.

నిరంతరశివారాధనతత్పరులై యేకదినాంతరోపవాసంబులు సేయువారును, పక్షోపవాసులై పక్షాంతంబునను, మాసోపవాసులై మాసాంతంబునను భుజించువారును, కేవలశాకభక్షణంబుచేఁ గాని, జలపానంబుచేఁగాని, దినములఁ గడపువారును, సర్వదా జలశయనులై యుండువారును, ఫలమూలమాత్రభక్షణముచే బ్రహ్మచర్యవ్రతాచరణము గావించువారును, సంవత్సరమున షష్ఠభాగంబుగాక తక్కినదివసంబు లన్నియునుపవాసంబులతోఁ గడపువారు నగుమధ్యస్థులు సహస్రాశ్వమేధవాజపేయఫలప్రాప్తులు గాఁగలరు. అహింసాపరాయణులై ప్రాతస్సాయంకాలములయందుమాత్రము భుజించి తన్మధ్యంబున జలపానంబునైనఁ గావింపక నియమముతో నుండువారు పౌండరీకయజ్ఞఫలసిద్ధు లగుదురు. హింసారహితుఁడై నాలుగుమాసములు గందమూలఫలాశనుఁడై యరణ్యమున నియమముతో సంచరించువాఁడయుతవర్షములు స్వర్గలోకమునఁ బూజితుఁడై యుండి పిమ్మట నుత్తమకులంబున జనియించి యనామయదీర్ఘాయుష్కుం డగును. ద్వాదశ

వర్ష పర్యంతము నహింసావ్రతనియమముచే నేకాహారియై యుండువాఁడు, నిశ్చయముగా సకలయజ్ఞఫలసిద్ధుం డగును. ఆపుణ్యమూర్తి చిరకాలంబువఱకును దివ్యవిమానారూఢుఁడై పుణ్యలోకంబులయందు విహరించుచు నిహలోకమునఁ బరమసుఖసంపన్నుండును, బరలోకమునఁ బూజ్యుండునై యుండును. కాలక్రమంబున నాతఁడు పుణ్యలోకచ్యుతుండై యుత్తమకులంబున మహారాజై జన్మించి నీరోగదీర్ఘాయుష్కుఁడై మరల సత్కార్యాచరణంబున సకలయజ్ఞఫలసిద్ధిం గాంచి పుష్పకవిమానారోహణంబు, దేవలోకవిహారంబు గావించుచు సుందరీసహస్రశోభితమగు రమణీయప్రదేశములందు సవిలాసముగఁ గ్రీడించుచు రమణీమణులమనోహరనూపురకాంచీకలనినాదములచే నిద్రించి సుశ్రావ్యంబులగు వేణువీణామృదంగాదివాద్యస్వనంబులచే మేల్కాంచుచు నిజాచరితతపంబున కనుగుణంబు లగుసుఖభోగముల ననుభవించుచుండును.

రాగద్వేషవిరహితుఁడై "నమశ్శివాయ" అనుపంచాక్షరీమంత్రమును దివసంబునఁ బంచశతపర్యాయములును, రాత్రి సహస్రవారంబులును జపించువాఁడు వజ్రప్రవాళమణిమండితమగువిమానము నధిరోహించి చిరకాలమువఱకును స్వర్గంబున విహరించుచుఁ గాలక్రమంబున మహత్కులమునందు బలవంతుఁడును సుందరుఁడునై జన్మించి సర్వైశ్వర్యసంపన్నుం డగును. దేవబ్రాహ్మణప్రీతికరముగా దీపదానముం గావించువారు తత్ప్రభావంబున నక్షయసద్గతిలాభంబు నందుదురు. శ్రద్ధాయుక్తుఁడై బ్రాహ్మణులకుఁ బానీయప్రదానముం గావించువానికిఁ బుణ్యనదీమధ్యస్నానంబు లభించును. బ్రాహ్మణులకుఁ గర్పూరదానముసేయువారికి వివిధహర్మ్యశోభితంబగుగృహలాభంబు గలుగును. గోదానంబు సేయువాఁడు ధేనుగాత్రమునం దెన్నిరోమములు

లుండునో యన్ని వేలవత్సరములు స్వర్గలోకమునఁ బూజితుఁడై యుండి పిమ్మట సత్స్వభావసంపన్నుఁడును, విద్వాంసుఁడును, బరమసుందరుఁడు నై జన్మించును. నూతనవస్త్రదానముచేయువాఁ డక్షయఫలభాగియై నవసహస్రవర్షములు స్వర్గమునందు సుఖభోగము లనుభవించి పిమ్మట నుత్తమకులంబున జన్మించును. విశేషించి వేదోక్తవిధానంబున బ్రాహ్మణునకుఁ గన్యాదానంబు సేయువాఁడు దేవపూజితుండై స్వర్గలోకంబున బహువర్షంబులుండి పిమ్మట శ్రేష్ఠవంశంబున జన్మించును. శయ్యాదానము చేయువానికి షష్టిసహస్రవర్షములు స్వర్గావాసము లభించును.

వ్యాసమునీంద్రా! నీయెడలఁ బ్రేమవశంబున దానవిధానమును, సనాతనంబును, బవిత్రంబు నగునుపవాసవిధానమును నీకెఱింగించితిని. ప్రతిపర్వమునను దీనిని బఠించువాఁ డీపుణ్యకార్యంబుల నాచరించినఫలంబు నందఁగలఁడు. అసదాచరణంబువలనం గలుగుపాపం బాతని నెంతమాత్రము నంటఁబోదు. అతినియమముతో దీని నాకర్ణించువాఁ డనామయుఁడై దుఃఖపాపభయవిముక్తుఁడై పరమధర్మాత్ముం డగును. శ్రద్ధతో దీని నాకర్ణించువారు సత్యవాదులును, హింసాద్వేషరహితులు నగుమహాత్ములంబోలి యనంతధర్మలభ్యంబగు స్వర్గలాభంబు నంది దేవలోకపూజితులై యుందురు. నిత్యంబును బ్రభాతసమయమునందు మేల్కాంచి శ్రద్ధతో దీనిని బఠించువారికి సకలాభీష్టసిద్ధి యగును. అట్టివాని కెట్టికష్టములును దటస్థింపఁబోవు.

## —• నామోష్టమీవ్రతవిధానము. •—

"త్రిభువనేశ్వరా! త్రినయనా! దేవదేవా! నీవు సంగ్రామమునందుఁద్రిపురవినాశము గావించితివి. రాక్షసులు నీయనుచరులు.

త్రిశూలపాణీ! రిపుంజయా! గంగాధరా! ప్రమథనాథా! దేవా! నీలకంఠా! నీవష్టవసువులకు నధీశ్వరుండవు. భూతగణపరివేష్టితుఁడవు. వ్యాఘ్రచర్మపరిధానుఁడవు. దేవాదిదేవా! భక్తవత్సలా! కపర్దీ! నీ వెట్టి యారాధనాదులచే భక్తులకుఁ బ్రసన్నుండ వగుదువు? తద్విధాన మెట్టిది? శాశ్వతఫలదాయక మగువ్రతమేది? నిన్నుపాసించుట యెట్లు? ఏనియమములచే నెట్టిపుష్పఫలాదులచే నేతిథియందు నిన్నుఁ బూజింప వలయును? ప్రసన్నుండవై యెఱింగింపుము." అని భగవతి పార్వతీదేవి ప్రశ్నించుటయు మహాదేవుఁడు చెప్పందొడంగెను.

చారునయనా! మద్భక్తుం డగువాఁడు చతుర్దశియందును, అష్టమియందును నుపవాస మాచరించి సకలోపచారములచే నన్నారాధింపవలయును. జితేంద్రియుఁడును, నిర్మలాంతఃకరణుండునునై మద్భక్తుం డష్టమీదినంబున గోక్షీరములచే మదీయం బగులింగాభిషేకం బాచరించి, ప్రతిష్ఠావిధానముచే మత్సాన్నిధ్యంబు గల్పించుకొని గంధమాల్యాదులచే నన్నర్చించి మచ్చింతాపరత్వంబున జపము సేయుచు సిద్ధమంత్రసాధనముం గావించి విధిపూర్వకముగా శాకమూలఫలాదులయ గ్రంబులఁ దునియించి నాకు నివేదింపవలయును. అనంతరము సాధకుఁడు నాసన్నిధిని విసముగ్ధుఁడై మోకరించి పరమభక్తిపూర్వకముగా నాచతుర్విధమూర్తులను మంత్రజపంబుచే నన్నుఁ బ్రసన్నుం గావించుకొనవలయును. ఈసకలకార్యములును శ్రద్ధతోఁ గావించినప్పుడే భక్తిప్రకాశము గాఁగలదు. అశ్రద్ధతో నివేదించిన ఖండ, ఖాద్యాది చిత్రపదార్థములును, దివ్యాన్నములును మత్పరిగ్రహయోగ్యంబులు గానేరవు. అట్లు గావించువానియెడల నేనెప్పటికిని బ్రసన్నుఁడను గాఁజాలను.

ఓవిశాలలోచనా! ‟వ్యాఘ్రముంబోలి యుచ్ఛ్రితి, సింహ

రథారూఢుండై విహరించు కమలదళలోచనుఁ డగురుద్రునిఁ బ్రణవ మూలంబున నావాహనము చేయుచున్నాను. ఆదేవుం డనుచరులగు సకలదేవగణంబులతోఁ బరమేశ్వరీసహితముగా నిటకు విచ్చేయుఁ గాక!" అనుమంత్రంబుచే నన్నావాహనము చేసి "భగవతే మహా దేవాయ పార్శ్వగితాయ అనుచరాయస్వాహా!" అనుమంత్రముతో సూతెన్మమలక ఫలరసంబున శివలింగాభిషేచనంబు గావింపవలయును. అనంతరము "ప్రదక్షిణం పరావర్తే సర్వమేవ ఉమాయుతే స్వాహా!" అనుమంత్రమును జపించుచుఁ బ్రదక్షిణము చేయవలయును. పిమ్మట "ప్రభూ! ఈజలము శాంతమైనది. శాంతతమమైనది. అమృతమయ మైనది. అమృతతమమైనది. అతిపవిత్రమైనది. బ్రహ్మపవిత్రమైనది. సూర్యకిరణములచేఁ బవిత్రమైనది. దీనిని బరిగ్రహింపుము." అనుమం త్రముతోఁ బానీయమును, "అఘోరియః సర్వదేవానాం గంధోయం ప్రతిగృహ్యతామ్" ఇత్యాదిమంత్రముతో గంధప్రదానమును గావిం పవలయును. "ఓప్రభూ! వేదమంత్రములచేతను, సూర్యకిరణముల చేతను బవిత్రమైనయీపుష్పమును భక్తిపూర్వకముగా నర్పించుచు న్నాను. దీనిని బరిగ్రహింపుము. నీకు నమస్కారము." అనిచెప్పుచుఁ బుష్పము నర్పింపవలయును. "ఓప్రజాపతీ! భక్తవత్సలా! నీకు నమ స్కారము. నీవీధూపమును గ్రహింపుము." అని పలుచుచు ధూప మర్పింపవలయును. మఱియు "ఆపోజ్యోతిశ్చ" అనుమంత్రమును బఠించుచు "శివలింగస్వరూపా! ఈదీపమును గ్రహింపుము. నీకు నమస్కారము." అని దీపప్రదానము గావించి యనంతరము దేవతా మనోహరం బగునుత్తమగంధనివేదనము చేసి "పూతో బ్రహ్మపవిత్రే ణపూతః సూర్యస్యరశ్మిభిః ఆహారః సర్వదేవానాం నైవేద్యః ప్రతిగృ హ్యతాంస్వాహా" అనుమంత్రముతో నైవేద్యము నర్పింపవలయును.

అనంతరము మహాదేవదేవు నుద్దేశించి "ప్రభూ! నేను యథాశక్తితో గంధపుష్పోపహారాదిప్రదానములచే నిన్నుఁ బూజించితిని. నీవు ప్రసన్నుండవై యీభక్తునియెడల దయాళుండవు గమ్ము." అని ప్రార్థింపవలయును.

ఓవరారోహా! ఇఁకఁ జతుర్దశీవ్రతవిధానంబు దెలిపెద నాకర్ణింపుము. భక్తుఁ డగువాఁడు చతుర్దశిదినమున రక్తచందనాదులచేతను, హరితాళాదివిలేపనద్రవ్యములచేతను మత్ప్రతిమామూర్తి కంగరాగము గావించి, కరవీరాదిసుగంధపుష్పములచే నర్చించి కదంబకింశుకాశోకాదిప్రసూనములను, నితరంబులగుపత్త్రఫలంబులను దూర్వలను నాకర్పించి నైవేద్యదానము గావింపవలయును. నైవేద్యప్రదానమునకశక్తుం డగువాఁడు జలమూలంబునఁ దత్కార్యము నిర్వహింపవలయును. మఱియు సఘృతం బగుగుగ్గులమును ధూపమంత్రము నుచ్చరించుచు మత్సన్నిధిని దహింపవలయును. అనంతరమున "భక్తప్రియా! లోకనాథా! మహాదేవా! విష్ణూ! హరిహరేశ్వరా! శ్రీవత్సలాంఛనా! పినాకపాణీ! శంఖచక్రగదాధరా! గంగాధరా! పార్వతీనాథా! జంబూద్వీపనాథా! త్రిభువనేశ్వరా! నీకు నమస్కారము. ప్రభుండగు భగవానుఁడును భగవతియగుపార్వతియు నాకుఁ బ్రసన్నులయ్యెదరుగాక!" అనునీస్తోత్రమును బ్రాతస్సాయంకాలపూజానంతరమునఁ బ్రతిదినమును బఠించువాఁడు ప్రతిదినమును గావించుపాపములనుండి విముక్తుండగును. దేవీ! ఈపవిత్రస్తోత్రమును రజస్వలలగుస్త్రీలయొద్దఁ బఠింపఁగూడదు. దీని నాకర్ణించినపురుషుఁడు కురూపుఁడైనను సుందరుండగును; మృతాపత్యయగుయువతి దీర్ఘాయుష్మంతులగు పుత్త్రులు గలది యగును. గృహమందైనను, విదేశమందైనను, మఱియెచ్చటనైనను భక్తిపూర్వకముగా నీస్తోత్రమును బఠించువానియెడల నేను సంతుష్టుఁడనై యాతని కిహపరసుఖంబులఁ జేకూర్చుచుందును. అని

యీప్రకారముగా మహాదేవుండు పార్వతీదేవికిఁ జతుర్దశ్యష్టమీపూజా
విధులను బోధించెను.

అనుటయు వ్యాసమునీంద్రుండు "మహామునీంద్రా! మానవు
లేరీతి నుపవసించి మహాదేవు నేవిధముగాఁ బూజింపవలయునో, అష్ట
మీతిథియం దాదేవు నేనామములతో నుపాసింపవలయునో యనుగ్రహ
పూర్వకముగా నాకెఱింగింపుము" అని ప్రార్థించుటయు సనత్కుమా
రుం డిట్లనియెను. ఓసువ్రతా! పూర్వము భగవతి యగుపార్వతి హి
మాలయంబున సమాసీనమై భగవానుం డగుమహాదేవునుద్దేశించి వ్ర
తవిధివిషయంబున నుపదేశింపు మని ప్రార్థించెను. ఆసమయమున మ
హాత్మునిచే నుపదేశింపఁబడిన నామాష్టమీవ్రతవిధానమును నేనాల
కించినవిధముగా నీకెఱింగించెద నాకర్ణింపుము. ఈమాహాత్మ్యశ్రవణ
మువలన మానవు లకల్మషులై శివలోకప్రాప్తు లగుదురు. మార్గశీర్ష
మాసమునం దష్టమీతిథియందుఁ గేవలగోమూత్రమాత్రప్రాశనుండై
గంధపుష్పాద్యుపచారములచే మహాదేవునిఁబూజించువాఁడు సర్వపాప
విముక్తుం డగును. విశేషించి యీతిథియం దుపవాసము చేయుటచేత
నే యక్షయపుణ్యలాభం బగును. ఈవిధముగాఁ బౌషమాసాష్టమి
యందు ఘృతమాత్రభక్షణంబునఁ బరమేశ్వరునిఁ బూజించినచో బ
హుధర్మలాభం బగును. ఆదినమున నుపవాసముచేయుట యంతకం
టెను బుణ్యప్రదమైనది. మాఘమాసమునం దష్టమియందు క్షీరపా
యసభక్షణమాత్రంబున భగవంతుండగుదక్షిణామూర్తిని యథావిధిగఁ
బూజించినను, ఆదినమునందు శుష్కోపవాసము చేసినను బహుతరపు
ణ్యలాభం బగును. ఈవిధముగా ఫాల్గునమాసాష్టమియందుఁ దిలమా
త్రభోజనుండై శాంతభావముతోఁ ద్ర్యంబకునిబూజించినను, ఉపవా
సము చేసినను అపారమగుధర్మలాభముం గాంచును. చైత్రాష్టమి

యందు యవభోజనంబు సేసి సనాతనుం డగుదేవునిఁ బూజించినను, వైశాఖమాసాష్టమియందు జలపానమాత్రంబున శాంతభావముతో సదాశివుని బూజించినను, ఆదినమునం దుపవసించినను బహుధర్మలాభంబగును. జ్యేష్ఠాష్టమియందు గోమయభక్షణము చేసి భగవానుం డగుదక్షిణామూర్తిని బూజించినను, ఉపవాసము చేసినను, ఆషాఢాష్టమియందు ఫలాహారియై నీలకంఠుని నిర్మలచిత్తముతో నారాధించినను, ఉపవసించినను, శ్రావణమాసాష్టమియందు లవణోదకపానమాత్రమున భగవంతునిబూజించి బ్రాహ్మణసంతర్పణమాచరించినను, భాద్రపదమాసాష్టమియందు దధిభక్షణంబు సేసి శివపూజ గావించినను, ఉపవసించినను, ఆశ్వీజమాసాష్టమియందుఁదండులోదకపానమాత్రంబునను, గార్తికమాసంబున దధిభక్షణమాత్రంబునను దక్షిణామూర్తిని బూజించినను, ఆతిథులయం దుపవాసము చేసినను నిస్సీమంబులగు నక్షయధర్మలాభంబు లందఁగలరు.

నిష్కపటభక్తియుక్తుఁడై దేవదేవుఁ డగునుమాపతిని గంధపుష్పమాల్యధూపాదులచే నిత్యము నర్చించుచు బ్రాహ్మణులకు సువర్ణదక్షిణలతో భోజనంబు లిడువాఁడు మరణానంతరమున శివలోకప్రాప్తుండై యందుఁ జంద్రశేఖరుఁడును, వృషభవాహనుఁడును, త్రినయనుండునై, దివ్యాప్సరోగణపరివృతుండై భవానీదేవివిహారించుపవిత్రప్రస్థానములయందు యథేచ్ఛావిహారము గావించుచుండును. అనంతర మాతఁడు సౌభాగ్యశాలియు, బుద్ధిమంతుఁడును, సకలశాస్త్రపారంగతుఁడును, సర్వభూతహితార్థియునై భూతలమునందు శ్రేష్ఠకులంబున జన్మించి రాజ్యలాభముం గాంచి ధర్మశీలుండును, మిథ్యావాదండవిరహితుండునై విరాజిల్లుచుండును. నిత్యమును రుద్రదేవుని బూజించునాతఁడు మరల స్వర్గలోకమును జేరి రుద్రలోకమునం దెల్లవారిచేతను

పూజితుండై యుండును.

## నామలక్ష్మ్యష్టమీవిధానము.

ఏసత్కర్మలముచేఁ గుజ్జులును, రోగులును, రౌద్రులు నగువారు సులక్షణసంపన్నులును, సౌభాగ్యవంతులును, బ్రియదర్శనులు నై జన్మింతురో యాసహాన్వమునుగూర్చియు, అష్టమీవ్రతము సకలశుభప్రదాయకమగుటంగూర్చియు సప్రమాణముగ బోధింపవలయు నని సాత్యవతేయుండు ప్రశ్నించుటయుఁ బూర్వము మహాదేవుండు పార్వతీదేవి కుపదేశించినప్రకారము సనత్కుమారుం డిట్లు చెప్పందొడంగెను. ఎవ్వఁడు శివభక్తితత్పరుఁడై కార్తికమాసమునం దష్టమినాఁ డుపవసించి యహోరాత్రములు జాగరణము చేసి గంధమాల్యాదులచే మహాదేవు నర్చించి గోరోచనకుంకుమాదుల నివేదించునో యాతఁడు నాయనుగ్రహముచే విష్ణుపదనామకమగు రుద్రభవనమును జేరి దివ్యక్రీడాసక్తుఁడై యందుఁ బరమసుఖభోగము లనుభవించుచుఁ గాలయాపనము సేయుచుండును. అనంతరమాతఁడు మత్ప్రసాదముచే నచ్చటనే ముక్తిలాభము నొందును. ప్రతిపురుషుండును దనకు శివస్వరూపప్రాప్తి యగువఱకును మహాదేవునారాధించుచుండవలయును. అందువలన నాతఁడు సర్వలక్షణసంపన్నుఁడై శ్రేష్ఠకులంబున జన్మింపఁగలఁడు.

“దేవాదిదేవా! శూలపాణీ! నీవు సంక్షేపముగనుపదేశించిన యీవిషయమును నేను సంపూర్ణముగ నెఱుంగఁజాలకున్నాను. అష్టమీవ్రతనిర్వహణసమయమునందు శరీరస్థానవిశేషములలో నేస్థానమునం దేనామముతో నిన్నుఁ బూజింపవలయునో సవిస్తరముగ బోధింపుము” అని పార్వతీదేవి ప్రశ్నించుటయు మహేశ్వరుం డిట్లనియెను. దేవీ! పార్వతీ! సావధానముగ నాకర్ణింపుము. మద్భక్తుం డగువాఁడు

నాథనామముతో మస్తకమును, శంకరనామముతోఁ బదయుగళ మును, అతిరుద్రనామముతో జంఘాద్వయమును, ఈశాననామముతోఁ గటిప్రదేశమును, త్ర్యంబకనామముతో శేఫంబును, కపర్ది నామ ముతో నష్టాంగములను, శూలపాణినామముతో వక్షస్స్థలమును, వృష ధ్వజనామముతో స్కంధదేశమును, త్ర్యంబకనామ ముతోఁ గక్షదేశములను, గర్ణద్వయమును, త్రిపురఘ్ననామముతో నయనయుగళమును, ఉమాపతి పశుపతినామములతో నాసాపుటమును, శ్మశానవాసినామముతో భ్రూమధ్యమును, భూతనాథనామముతోఁ గపోలద్వయమును, దక్షయజ్ఞవినాశినామముతో దంతపంక్తిని, జటిల నామముతో జిహ్వను, పశుపతినామముతో శిరోదేశమును, శశాంక శేఖరనామముతో మస్తకమును, ఉమాప్రియనామముతో లలాట మును, గంగాధరనామముతోఁ గేశసముదాయమును, శివనామముతో సర్వాంగములను యథావిధిగఁ బూజింపవలయును. అనన్యచిత్తముతో విధిపూర్వకముగా నెవ్వఁ డష్టమీతిథియం దుపవసించి గంధమాల్య ధూపదీపాదులచే భక్తియుక్తుఁడై నన్నుఁ బూజించి పూజాంతమునం దు నిజవిభవానుసారముగా బ్రాహ్మణారాధనమాచరించి యథాశక్తి గా సువర్ణదక్షిణలర్పించి జలపూర్ణంబగుతామ్రఘటంబును, తైలపూర్ణం బగుమృణ్మయపాత్రంబును దానము సేయునో యట్టిపుణ్యాత్ముఁ డు మరణానంతరమున స్వర్గలాభముం గాంచి మహేంద్రసన్నిధానమున దప్సరోగణపరివృతుండును, దివ్యభూషణభూషితుండునై దేవమానాను సారముగా సహస్రవర్షము లందు సుఖభోగము లనుభవించుచుండును. అనంతరము కాలక్రమంబున నాతఁడు మహీతలమునం దుత్తమకుల మున జన్మించి సర్వలక్షణసంపన్నుఁ డగుమానవశ్రేష్ఠుండై యెందును లోపంబునుమాట లేక మహైశ్వర్యవంతుఁడై యుండును.

—♦ వివిధదాన ప్రశంస. ♦—

మహేశ్వరుం డిట్లనియెను. దేవీ! ఇప్పుడు నీకు దానధర్మాది విశేషములం గూర్చి విశేషించి చెప్పెద నాకర్ణింపుము. ఓభవానీ! అన్నమువలననే సమస్తజీవులకును దేహధారణ మగుచుండునుగావున నన్నదానముకంటెను బ్రశస్తములగు నితరదానము లేవియును లేవు. కావున నన్నదానమే యన్నిటికంటె నుత్తమమైనదని ప్రశంసింపఁబడు చుండును. అర్థులగువారికి సుసంస్కృతమును, వ్యంజనాదిసహితము నగునన్నదానమును గావించుపుణ్యాత్ముఁడు మయూరహంసశోభితము ను, అభిలషితైశ్వర్యపరిపూర్ణమును, ప్రభాకరసదృశతేజోమయమును, రమణీయము నగుదివ్యవిమానము నధిరోహించి బహుకాలమువఱకును సమస్తలోకవిహారము గావించుచుండును. కాలక్రమమున నాతఁడు ధనధాన్యాదిసంపన్న మగుమానవకులమునం దుద్భవించి శుభరూప తేజోమయుండై విరాజిల్లుచుండును. ఉత్తముఁడగు బ్రాహ్మణునకు శక్త్యనుసారముగా నన్నదానము సేయువాఁడు తత్ప్రభావముచే బ్రహ్మ లోకప్రాప్తుం డగును. ఎవ్వడేనొకప్పుడు బ్రాహ్మణునకు సుసంస్కృ తమగు నన్నమును దానముచేయువాఁ డిహలోకమున శతగుణము లును, బరలోకమున సహస్రగుణములును బుణ్యఫలలాభముం గాంచి పరమసుఖుం డగును.

అపరిశుభ్రమును, దుర్గంధదూషితమును, గుత్సితము నగునన్న ము నవజ్ఞాపూర్వకముగా దానముసేయువాఁడు భీకరనరకమునందుఁ బతి తుండై రాక్షసగణంబులచే నిరంతరమును బీడింపఁబడుచు నన్నాద్యుప భోగదరిద్రవ్యవిహీనుండై బాధనొందుచుండును. నరకభోగానంతరమునం దాతఁడు హీనకులమునం జనించి దుర్విలాసలంపటుఁడై యుండును. దేవీ! అన్నమే యఖిలపదార్థములకంటెను బ్రశస్తమైనది. దానిం

టెను బ్రశస్తమైనవస్తు వేదియును లేదు. సకలజీవాధారహేతువగుటచే నన్నము ప్రజాపతిస్వరూపముగాఁ బ్రశంసింపఁబడుచున్నది. ఆప్రజాపతి సంవత్సరస్వరూపుఁ డనియు, సంవత్సము యజ్ఞస్వరూపమనియుఁ జెప్పంబడును. ఆయజ్ఞమునుండియే స్థావరజంగమాత్మకము లగుసకల జీవగణంబులు నుత్పన్నము లయ్యెను. కావునఁనే యన్నము సకలపదార్థములకంటెను, అన్నదానము సకలదానములకంటెను శ్రేష్ఠంబు. అన్నమునుండియే సకలభూతములు నుద్భవించెను గావున సకలభూతములు నన్నమునే ప్రశంసించుచుండును.

దివ్యరసకలితమును, సురభిళమును, శీతలము ..గుజల దానము చేయువాఁడు దివ్యాప్సరోగణపరివృతి మగుదివ్యవిమానము నధిరోహించి స్వర్గమునందు వరుణలోకంబున నెనుబదివేలవత్సరములు దేవతుల్యుండై సుఖనివాసంబు చేసి యనంతరము భూలోకమునందుఁ బవిత్రవంశమునందు జనించి మహైశ్వర్యసంపన్నుఁడై యుండును. భక్తిపూర్వకముగా నుత్తమబ్రాహ్మణున కన్నపూర్ణంబగుభాండమును దానముచేయువాఁడు పుణ్యాశ్రయుండై స్వర్గలోకమునఁ బూజితుండగును. ఈవిధముగా ననేకాన్నభాండములను గావించువానిపితృగణంబులు సుస్థిరపిండదానమును బరిగ్రహించినవారుంబోలి సంతుష్టులై యుందురు. యథాసమయపిండదానాభావముచేఁ గలుగునసంతుష్టి వారికెన్నఁడును సంభవింపదు. గోవులుమొదలగు వివిధజంతువులకు జలపానార్థమై తటాకాదినిర్మాణంబుగావించుసంపన్నుఁడు నిజపితృపితామహాదులను దరింపఁజేసి విష్ణులోకమునందు దేవతుల్యుఁడై యయుత వర్షంబులు నివసించి నిఖిలపూజితుఁడై నిత్యసుఖభోగంబుల ననుభవించుచుండును. అనంతర ముత్తమమానవవంశమున జన్మించి పరమభోగియు, ననామయుండును, దాతయు, యాగకర్తయు, సౌభాగ్యవంతుఁ

డును, ప్రియదర్శనుఁడును నగురాజామాత్యుఁడై విరాజిల్లుచుండును.

ఓశుచిస్మితా! జలపూర్ణంబగునొకగర్తమును నిర్మించి యష్ట పతాకాభిశోభితమును, విచిత్రధ్వజాలంకృతమును, బుష్పమాలికావిలసితము నగుదానిని సకలజీవోపయోగకరంబుగా నుత్సర్గంబు సేసి శక్తి కొలఁది సదక్షిణంబుగాఁ బవిత్రబ్రాహ్మణారాధన మాచరించు మానవ శ్రేష్ఠుఁడు తనపితృగణంబులనెల్లఁ బరితృప్తులం గావించుటయే గాక దివ్యాప్సరోగణమధురసంగీతసంపన్నమగు సుందరమణివిమానము నధిరోహించి వరుణలోకమున యథేచ్ఛావిహారియై చిరకాలమువఱకు నభీష్టభోగముల ననుభవించుచుండును. సువర్ణదానమును, గాంచనవర్ణభూదానమును, తిలదానమును, రత్నదానమును, గావించుపుణ్యాత్ములు లబ్ధమహోదయులై యింద్రలోకమున దివ్యవిమానము నధిరోహించి పరమానందభోగముల ననుభవించుచుఁ జిరకాలమువఱకును సుఖవిహారముఁ గావించుచుందురు. అనంతరము వారు భూలోకమునం దవతరించి యనాయాసముగాఁ దపఃఫలప్రాప్తులై సర్వైశ్వర్యసంపన్నులుగాఁగలరు. రాజమార్గములయందు మార్గస్థులకు నీడంగూర్చుటకై ఫలపుష్పసమన్వితంబులగువృక్షంబులను స్థాపించు దేవసము లగుమానవులు తమ పితృగణంబులనెల్లఁ దరింపఁజేయఁగలుగుదురు. అట్టిఫలవృక్షములను సద్బ్రాహ్మణులకు దానము చేయువా రాతరుపుష్పఫలాదులను జీవులెన్నినాళ్లుసుఖముగా నుపయోగించుచుందురో యన్నివేలసంవత్సరముల వఱకును జంద్రలోకమునం దసాధారణఫలభోగములచే విరాజిల్లుచుందురు. అట్టిపుణ్యపురుషులు తమపితృగణంబుల ననాయాసముగఁ దరింపఁజేయఁగలుగుదురు. ఫలదానము నాచరించువారు సువర్ణరత్నమయఫలలాభముం గాంచుటయేగాక పరమసుందరులును, బ్రియదర్శలును గాఁగలరు. సువర్ణమణినిర్మిత మగుపాత్రమును దానముచేయు

వాఁడు స్వర్గమునం దప్సరోగణపరివృత మగుదివ్యవిమానము నధిరోహించి పరమానందముతో బహుకాలము విహరించుచుండును. రజతపాత్రదానము సేయువానికి గంధర్వలోకమునం దూర్ధ్వశీలాభము ప్రాప్తించును. తామ్రిపాత్రిమును దానము చేయువాఁ డధికబలశాలి యై కుబేరలోకసుఖంబును గాంచును.

సకలపదార్థసంపన్నంబగుగృహమును దానము చేయువాఁడు సర్వాభీష్టసంసిద్ధుఁడై శతకోటిసంవత్సరములవఱకును బ్రహ్మలోకసుఖభోగముంగాంచి యనంతరము మహాదాతయు, మహాభోగియు నగుగృహస్థుఁడై భూలోకమునం దవతరించును. ఓషధీదానముసేయువాఁడు సంపూర్ణమనోరథుఁడై సప్తసహస్రవర్షములు చంద్రిలోకసుఖంబు ననుభవించి పిమ్మట మహాభోగియై మహీతలమున జన్మించును. భూదానముసేయువాఁడు కామరూపియై సుందరవిమానము నధిరోహించి బహుసహస్రివర్షంబులవఱకును నానాలోకవిహారము సేయుచు సుఖభోగములనుభవించి పిమ్మట మహీతలంబున జన్మించి సర్వకామప్రదంబగు విశేషభూలాభముం గాంచఁగలుగును. నిర్మలహృదయముతో భక్తిపూర్వకముగాఁ బశుదానముం గావించువాఁడు చంద్రిలోకమునందుఁ జిరకాలమువఱకు యథేచ్ఛావిహారియైయుండును. పరిశుభ్రమును, సుఖభోజ్యమునగునన్నదానముంగావించువాఁడిహలోకమునరాజ్యేశ్వరుఁడై పరంబున స్వర్గభోగముల ననుభవించును. సమలంకృతశయ్యాదానము సేయువాఁడు శతాయుతవర్షములుపితృలోకమున సుఖావాసుండై యనంతరము భూలోకమున సద్వంశమున జనించి యనుకూలభార్యాసహితుండును, సర్వసిద్ధిసంపన్నుండును, బుత్రివంతుండునై సుఖించును. స్వర్ణాలంకారభూషితమును, సర్వలక్షణసంపన్నము నగు నుత్తమాశ్వమును దానము చేయువాఁడు బహువర్షంబులవఱకును వాయులోకభో

గింబుల ననుభవించుచుండును. యథావిధిని మంత్రసహితముగా సశ్వయుతంబగు రథమును, దాసిని, కన్యను, గృహమును, కాదేని భూమిని దానము చేయువాఁడు మహామహీశ్వరుఁడై జన్మించును. భూమిదేవి ధేనురూపముతో నాపురుషశ్రేష్ఠునిగృహమునందుండి యాతనిధర్మఫలస్వరూపముగా సకలాభీష్టప్రదానమును గావించుచుండును. జలధేను దానము చేయువానికి బహురూపతటాకాదు లధీనములై యుండును.

సద్బ్రాహ్మణులను సురభిళప్రసూనములచేఁ బూజించి పుష్పమాలికాలంకృతములును జలపూర్ణములు నగుకలశములను దానము చేసి వారిని భక్ష్యభోజ్యాదిపరితృప్తులం గావించి యనంతరము తిలపాత్రలనువిశేషదక్షిణలను సమర్పించిన చో సర్వాభీష్టములును సిద్ధించును. ఈవిధముగా ధేనుదానముం గావించిన చో బ్రహ్మలోకపర్యంతమును బానీయశాలలను బ్రతిష్ఠించినఫలముం గాంచును. తిలపాత్రసహితముగా వస్త్రదానము చేయువానికి సువర్ణసమృద్ధియు వివిధఫలలాభంబును గలుగును. శాస్త్రానుసారముగా ఘృతదానము సేయువానికి సర్వశ్రేయములును గలుగును. ఘృతదానమును గ్రహించువాఁడు “గోవులవలన ఘృతముత్పన్నమగుచున్నది. ఘృత మీపృథ్వీతలమునఁ బ్రతిష్ఠితమైనది. ఘృత మగ్నిస్వరూపము. ఘృతము దేవతాస్వరూపము. ఇప్పుడట్టిఘృతమును నాకు దానము చేయుము.” అనుమంత్రమును బఠించుచుఁ గైకొనవలయును. దాత బ్రాహ్మణులను సుగంధపుష్పమాల్యాదులచేఁ బరితృప్తులం గావించి యనంతరము ద్రవ్యదానము చేయవలయును.

గోప్రదానసమయమునందు సకలదేవతలు నాధేనుశరీరము నాశ్రయించి యుందురు. బ్రహ్మదేవుఁడా గోమస్తకమందును, మహేంద్రుఁడు కపాలమునందును, చంద్రసూర్యులు నేత్రములందును,

'వాయువు ప్రాణములందును, వైశ్వానరుఁడు ముఖమందును, సోముఁడు జిహ్వయందును, అశ్వినీకుమారులు కర్ణములందును, రుద్రులు శిరోదేశమునందును, లోకపాలకులును, సకలపన్నగగణంబులును పాదప్రదేశములందును నివసించి యుందురు. ఆగోవుజఠరమునందు సప్తసముద్రములును, గ్రీవమునందు సూర్యదేవుఁడును, స్తనప్రదేశమునందు సరిల్లలామయగు గంగాదేవియును, పార్శ్వదేశములందు వసుసాధ్యగణంబులును, పుచ్ఛమునందు విశ్వదేవగణంబులును, పురీషమునందు లక్ష్మీదేవియు, శ్వాసవాయువులందు నాగగణంబులును నిలిచి యుందురు. సకలమంత్రములును, యజ్ఞములును, దానములును, నియమములును, మహర్షులును, గ్రహములును, నక్షత్రములును, జ్యోతిర్మార్గులగు నితరగ్రహములును, దేవి యగుగాయత్రియు, విష్ణుదేవుండును, ఛందములును, వేదములును, లోకమాతృగణంబును, మేఘములును, వృష్టియు, ధర్మమును, నారాయణుఁడును, సకలభూతగణంబులును, నదులునుగూడ భగవతీమూర్తి యగునాగోవుశరీరమునందలి ప్రతిరోమకూపము నాశ్రయించి యుందురు. మఱియు యక్షరాక్షసులును, పిశాచములును, పక్షులును, యజ్ఞదక్షిణలును, అప్సరస్సుందరులును, గంధర్వులును మొదలుగాఁగలమహాత్ములందఱును గోశృంగముల నాశ్రయించి యుందురు. కావుననే గోవు సర్వదేవతల కాశ్రయస్థానమని ప్రశంసింపఁబడుచుండును. "ఓగోదేవీ! నీవు సర్వదేవమయివి; సర్వలోకమయివి; నీవు సర్వజీవులకును గారణమవు; సకలజీవులును నీకు నమస్కారముచేయుదురు. ఇట్టినిన్ను నేను దానము చేయుచున్నాను. నాకక్షయశుభంబులను బ్రసాదింపుము." అనుమంత్రమును బఠించుచుఁ గుశలు, తిలలు, తెల్లావలు, సువర్ణముమొదలగువానితోఁగూడ ధేనువును దానము చేయవలయును. ఇట్లు గోదా

ము చేయువాఁడు దేవతుల్యుఁడై స్వర్గస్థలములయందును సంపూర్ణ మనోరథుఁడై యుండును. ఆధేనువుప్రతిష్ఠానమునందును విపత్తులనుండి యాతని నుద్ధరించుచుండును. ఆతఁ డుత్తరజన్మమునందు సహస్రధేనువుల కధికారియై, మహైశ్వర్యవంతుఁడును, బుత్త్రపౌత్త్రాదిమహావైభవ సంపన్నుఁడు నగును.

సువర్ణమయశృంగవతియు, రజతఖురసమన్వితయు, అర్ధప్రసూతయు, పయస్వినియు నగుధేనువును దానముచేయువాని కుత్తరజన్మమునందు జాతిస్మరణంబు గలుగును. క్షీరంబులు లేనిగోవును దానము చేసినను నది దాతను భీషణనరకమునుండి తరింపఁజేయును. బ్రహ్మచారులకు మృగచర్మదానము చేయువారు భూదానఫలప్రాప్తులై సర్వయోగాశ్రయు లగుదురు. యోగికైనను, బ్రహ్మచారికైనను, గృహస్థునికైనను నివాసస్థానమునుదానముచేయువాఁడశ్వమేధపౌండరీకాదియజ్ఞఫలంబును, సహస్రధేనులాభంబును, పూర్వస్మరణలాభంబునుగాంచి యచిరకాలంబుననే యోగసిద్ధుం డగును. కమండలుదానము గావించు నరశ్రేష్ఠుఁడు నిత్యానంతధర్మలాభముం గాంచఁగలుగును. రోగపీడితుఁడై చైతన్యశూన్యుఁడై యున్నదీనునకుఁ జికిత్స చేసి శక్తికొలఁది నుపచారాదులం గావించి యాతనిం దేల్చువాఁడు బ్రహ్మహత్యాది మహాపాతకములనుండికూడ విముక్తుం డగును. దరిద్రుండగు నుత్తమ బ్రాహ్మణునకు సువర్ణదానము గావించువాఁడు దశాశ్వమేధయాగ ఫలలాభముం గాంచును.

ప్రియా ! సురమ్యంబులగు దానవిధులంగూర్చి సవిస్తరముగాఁ బ్రశంసించితిని. ఈసకలదానముల నేకకాలమునం దనుష్ఠించుపుణ్యపురుషుఁడు సార్వభౌముఁడై జనియింపఁగలఁడు. ఈదానమాహాత్మ్యమును బ్రతిదినము నాకర్ణించుచు శక్తికొలఁది దానములం గావించి

నను, ఎవ్వరైన దానములుచేయుచున్నప్పు డాసక్తితో నాలోకించినను స్వర్గలోకసుఖభోగంబు గలుగును.

## —♦ వివిధోపవాసాదిఫలకథనము. ♦—

పరమేశ్వరుండు మఱియు నిట్లనియెను. దేవీ! పూర్వోక్తకల్యాణమయంబు లగుదానము లేవియును గావింపకయే కేవలోపవాసనియమము నాచరించినంతమాత్రమున నెట్టియుత్తమపుణ్యఫలము లభించునో మరల విస్పష్టముగాఁ దెలిపెద నాకర్ణింపుము. మార్గశీర్షమాసమంతయు నేకాహారియై గడపువాఁడు నిత్యమును నన్నారాధించుపుణ్యఫలమును గాంచఁగలఁడు. పౌషమాసమునం దిట్లు గావించినఁ బ్రహ్మోపాసనఫలంబును, మాఘమాసమునం దాచరించిన మహాలక్ష్మీలాభంబును గలుగును. ఫాల్గుణమాసము నిట్టినియమముతో నిత్యమును గడపువానికి సౌభాగ్యవతి యగుసుందరపత్నీలాభమును, మహైశ్వర్యప్రాప్తియు నగును. ఏమానవశ్రేష్ఠుఁడు చైత్రమాసము నేకాహారియై యతివాహితముగఁ జేయునో యాతఁడు సర్వైశ్వర్యసమంచితమగు సత్కులమునందుఁ బరమసుందరుఁడై జన్మించును. వైశాఖమాసమునం దిట్లు గావించువాఁడు ధనవంతుఁడును, జ్ఞాతిశ్రేష్ఠుఁడును, జ్ఞాతిపూజితుఁడు నగును. ఏకాహారియై జ్యేష్ఠమాసమును గడపువాఁడు సద్వంశమునందు జ్యేష్ఠపుత్త్రుఁడై జన్మించి యశేషభోగముల ననుభవించుచుండును. ఆషాఢమాసమునం దిట్లు చరించువాఁడు రాజపూజితుఁడై సంపూర్ణమనోరథుఁ డగును. శ్రావణమాసము నీవిధముగాఁ గడపువానికి వాఁడు బలవంతుఁ డగుసేనా నాయకుఁడై జన్మించును. భాద్రపదమాసమునం దేకభుక్తము చేయువానికిఁ దత్కర్మబలముచే ధనలాభము గలుగును. ఆశ్వీజమాసమునం దిట్లు నియమముతో నుండువానికిఁ

గృషివాణిజ్యలాభమును, అసంఖ్యపశులాభమును గలుగును. కార్తిక మాసమునం దొల్లు గావించువాఁ డశ్వమేధయాగఫలప్రాప్తుఁడై యగ్ని లోకమున సకలజనపూజితుం డగును. మార్గశీర్షమాసంబునం దేకభుక్తము సేయువాఁడు ప్రభాకరసదృశవిమానారూఢుఁడై యింద్రలోకమున యథేచ్ఛావిహారము గావించుచుండును.

ఓ దేవీ! ఎవ్వఁడు సంపూర్ణముగా నొకసంవత్సరము నిత్యము నేకాహారుఁడై గడపునో యట్టివాఁడు మహారాజుగా జన్మించి మహేంద్రునివలె రాజ్యపాలనముం గావించును. ఒక్కయహోరాత్రము మాత్ర మేకాహారుఁడై గడపువానికి దశసువర్ణదానఫలము లభింపఁ గలదు. ప్రతిమాసమునందు నేకదినోపవాసంబు గావించువాఁడు పాపవిముక్తుం డగుటచే ఘోరనరకములకు దూరుఁడై యుండును. అతఁ డెన్నటికిని శమనునిదృష్టిపథమునఁ బడఁబోఁడు. ప్రతిమాసమునను ద్విరాత్రోపవాసము సేయువాఁడు కుబేరలోకమునఁ బరమసుఖభోగి యగును. ఏమానవు డతిపవిత్రుఁడై త్రిరాత్రోపవాసము చేసి చతుర్థదినమున భుజియించునో యాతఁడు గంధర్వలోకమున దేవతుల్యము లగునానందభోగముల ననుభవించును. అశ్రద్ధసేయక ప్రతిమాసమునను నాలుగుదినము లుపవసించి యైదవనాఁడు భుజించువాఁడు కొంత కాలము వాయులోకసుఖభోగియై యనంతరము స్వర్గప్రాప్తుం డగును. నిత్యనియమముతో నైదుదినము లుపవసించి యాఱవనాఁడు భుజించువాఁడు వరుణలోకమునఁ గొంతకాలముండి పిదప బ్రహ్మపదలాభముం గాంచును. ఆఱుదినము లుపవసించి యేడవనాఁడు భుజించువాఁడు దేవగణసేవితమును, సుఖకరము నగుసూర్యలోకమున సుస్థిరుఁడై యుండును. సప్తదినంబు లుపవసించి యష్టమదినమున భుజించువానికి వాయులోకగమనానంతరమున స్వర్గప్రాప్తియు, అష్టదినోపవాసంబు చేసి

నవమదినంబున భుజించువానికి వరుణలోకావస్థానంతరమున ననుపమ ఫలప్రాప్తియు, నవదివసోపవాసానంతరమున దశమదినమున భుజించు వానికిఁ బరలోకమున సాగ్నికులగువారియెదుట నగ్నితుల్యపవిత్రత్వం బును, సర్వదాసూర్యసన్నిభతేజమును, ఉత్తరజన్మమున దశసుందర పత్నీప్రాప్తియు నగును.

ఏకాదశదినోపవాసముచే నేకాదశీవ్రతానుష్ఠానఫలమును, సకల యజ్ఞఫలంబును లభించును. ద్వాదశదినోపవాసముగావించువాఁడు శుక్రలోకమున దివ్యసుఖభోగము లనుభవించుచుండును. పిమ్మట నాతఁ డిహలోకమున జన్మించి ధనధాన్యసంపన్నుఁడును బవిత్రుఁడు నై యుండును.* ఈవిధముగాఁ జతుర్దశాహోరాత్రము లుపవసించు వాఁడు రణనాయకుం డగును. అర్ధమాసోపవాసము సేయువాఁడు స్వర్గమునందు మహేంద్రతుల్యుఁడై చిరకాలముండి యనంతరము మ హీతలమునఁ దాను జన్మించిన చోటనే ప్రధానుఁడగురాజగును. ఎవ్వఁ డు ధీరుఁడును, జితేంద్రియుఁడును, జితక్రోధుఁడునై యేకమాసోపవా సము గావించునో యాతఁడు సూర్యాగ్నితేజస్సంపన్నమగురూపముం దాల్చి నిరంతరము నప్సరోగణపరివృతుఁడై దేవభావమున సకలజీవ పూజాస్తవంబులకుఁ బాత్రుఁడై దివ్యవిమానము నధిరోహించి సకల లోకములను విహరించుచుండును. అనంతరమాతఁడు బ్రహ్మలోకమున రాజోచితవస్త్రాలంకారవిభూషితుఁడై దశసుందరీవల్లభుఁడై విరాజిల్లు చుండును. పిమ్మట భూలోకమునం దాతఁడు బ్రాహ్మణుఁడై పుట్టి పరమైశ్వర్యభోగముల ననుభవించి క్రమముగా యోగసిద్ధుఁడై నిర్వా ణపదలాభముం గాంచఁగలుగును.

సుస్నాతుఁడై పవిత్రభావముతో నగ్నిహోత్రంబు గావించి

---

* త్రయోదశదినోపవాసప్రశంస యిందు విలుప్తమైపోయినది.

మనంబును విషయాంతరములనుండి మరలించి యుపవాసము నాచరించువాఁడు దుర్గాహాలనై శ్వానరుల కాశ్రయుం డగుటచే సకలమానవపూజనీయుం డగును. ఎవ్వఁడు రాగద్వేషాదిదోషవిహీనుండై స్త్రీశూద్రసంగపరిత్యాగముం గావించి నిత్యమును బగటివేళ ననాహారుండును, కుశాసనోపవేశనుండునై యథావిధిగ రుద్రగాయత్రీమంత్రమును రుద్రనామమును జపించుచు రాత్రికాలమున భుజించి భూశయ్యను శయనించుచు నీవిధముగా నెన్నిదినములాచరించునో యంతమంది బ్రాహ్మణులను నిమంత్రించి నిజవిభవానుసారముగా వస్త్రాలంకారతిలపాత్రదానాద్యుపచారములచే వారినిఁ బూజించి యొక్కొక్కనికి వేయింటినిగాని, నూటింటినిగాని ధేనువులను యథావిధిగ దానము చేసి హవిష్యభోజనముచే సంతృప్తులం గావించునో యట్టివాఁ డితరజనదుర్లభం బగువరలాభముం గాంచఁగలుగును.

నీలవృషభమును, బయస్విని యగుధేనువును దానము చేయువాఁ డాధేనువృషభములశరీరములం దెన్నిరోమములుండునో యన్నివర్షములు స్వర్గమునందు సుఖభోగముల ననుభవించును. అమావాస్యయందుఁగాని, అష్టమియందుఁగాని శ్రద్ధాయుక్తుఁడై సద్బ్రాహ్మణునకుఁ దిలపాత్రదానముం గావించువానికి బహుపుణ్యఫలప్రాప్తి యగును. నిశ్చలచిత్తముతో విధివిహితముగాఁ జాంద్రాయణవ్రతము నాచరించు మానవశ్రేష్ఠుఁడు తనపితృగణములను బరితృప్తులం గావించి పితృలోకము నధిగమించి దేవతుల్యుఁడై యక్షయసుఖభోగములం గాంచఁగలఁడు. ఓదేవీ! ఇది వివిధోపవాసవ్రతఫలవిధానంబు. ఇఁకఁ బవిత్రప్రాయశ్చిత్తవిధానముంగూర్చి ప్రశంసించెద నాకర్ణింపుము.

ఒక్కప్రాజాపత్యవ్రతము నాచరించువాఁడు ప్రజాపతిసమానుఁడై ప్రజాపతిలోకమునందు సుఖభోగముల ననుభవించుచుండును.

సాధారణులకుఁ గష్టసాధ్యం బగుసాంతపనవ్రతాచరణంబువలన నఖిల కష్టవినాశనమును, నగ్నిలోకనివాసప్రాప్తియు నగును. ఏకాగ్రచిత్తముతో మహాసాంతపనవ్రతము నాచరించువాఁడు విజ్ఞానలాభముం గాంచి బ్రహ్మలోకము నధిగమింపఁగలుగును. విశుద్ధహృదయముతోఁ దులాపురుషదానముం గావించువాఁడు సకలపాపవిముక్తుఁడును, సకలదేవతాగణపూజితుండును, స్వచ్ఛందవిహారియునై విరాజిల్లుచుండును. అతికృచ్ఛ్రవ్రతాచరణముచే శివలోకగమనంబును, కృచ్ఛ్రాతికృచ్ఛ్రవ్రతాచరణంబున గాణపత్యప్రాప్తియు నగును. ఏమానవశ్రేష్ఠుఁడు త్యాగియై సర్వస్వమును దానము చేయునో యాతనికిఁ గోరినకోరిక లన్నియును సిద్ధించును.

మానవుఁ డీకర్మభూమియందుఁ గష్టసాధ్య మగునేవ్రతము నాచరించినను దత్ప్రభావముచేతనే సిద్ధుఁడై దేవత్వలాభముం గాంచఁగలుగును. ఒక్కసంవత్సరమువఱకు గోమూత్రముచే సంస్కరింపఁబడిన యావకముగాని, తిలపిష్టముగాని, కేవలవాయువుగాని యాహారముగాఁ బ్రతిదినమును సర్వదా నానామమంత్రమును జపించుచు నన్నుఁ బూజించువాఁ డశ్వమేధయాగఫలభోగియై బ్రహ్మలోకమును జేరి యశేషపాపవిముక్తుండును, సకలబంధపరిత్యక్తుఁడునై సూర్యసమతేజస్సంపన్నమగువిమానము నధిరోహించి బ్రహ్మదేవునింబోలి సర్వదా సర్వస్థానములయందును విహరించుచుండును.

దేవీ! ఈసకలవిషయములను సంక్షేపముగా నభివర్ణించితిని. ఈయన్నిటిలో నొక్క సత్కార్యమునైన నాచరించుమానవుఁడు తత్ప్రభావముచేఁ బాపవిముక్తుఁడై యిహలోకమున మహత్తరకీర్తిలాభమును బరలోకమున బ్రహ్మసాక్షాత్కారరూప ముక్తిలాభమును గాంచుటయేకాక మహైశ్వర్యతేజస్సంపన్నుఁడై యభీప్సితవరలాభముంగాంచి

సుఖమైయుండును. పూర్వోక్తంబు లగునీసమస్తవ్రతంబులును శూద్రు లగువారు మంత్రము లేకుండఁగనే యాచరింపవలయునని భగవానుం డగుప్రజాపతి యానతిచ్చెను. అమంత్రకకర్మానుష్ఠానముచేతనే శూద్రులకుఁ బాపవిముక్తి కాఁగలదు.

స్త్రీజనంబులకుఁ బతియే దైవతము. వారి కంతకంటె నితర దేవతలు లేరు. పతియే వారి కుత్తమగతి యనియుఁ, బరమధర్మమని యు, బరమపదం బనియు శాస్త్రములయందు నిర్దిష్టం బయ్యెను. కావున నారీమణి తనపతియానతిననుసరించి భక్తిపూర్వకముగా నీసకల ధర్మముల నాచరింపవలయును. అట్లు గావించునామెకు సంపూర్ణఫల లాభంబు గలుగును. పతియానతి లేకయుండ ధర్మాచరణమునకుఁగడం గినసతీమణికిఁ దత్ఫలప్రాప్తి లేకుండుటయేకాక పాపఫలముగూడఁ బ్రాప్తించును. ఏనారీమణి పతియనుమతిం బడసి మహత్తరధర్మకార్యాచరణంబును, ధర్మశాస్త్రపరనశ్రవణంబులను గావించునో యట్టిభాగ్యవతి యనంతఫలలాభముంగాంచి యిహపరలోకములయందు సర్వాభీష్టసంసిద్ధుల నంది సౌభాగ్యవతియు, స్వాధీనభర్తృకయునై విరాజిల్లును. మఱియు నామె స్వామిప్రియతమయై పుత్త్రవతి యగును. ఆమె కెన్నటికి నెట్టికష్టమును గలుగఁబోదు. ఓవరాననా! నీయెడలఁ బ్రేమ వశంబున నేనీపరమార్థమును నీకెఱింగించితిని.

## —♦ ని య మ ని రూ ప ణ ము. ♦—

భగవతి యగుపార్వతి యిట్లనియెను. దేవా! లోకకర్తవు, ఈశ్వరుఁడవు, సర్వజ్ఞుఁడవు, శూలపాణివి. అపరాజితుఁడవు, త్రినయనుఁడవు నగునీకు నమస్కారము. భూతభవిష్యద్వర్తమానవిషయములన్నియును నీకు విదితములగుటంజేసి నీవు సర్వగతుండ వైతివి.నాథా!

నేను నీయనుగ్రహపాత్రురాలనై తినేని, నాయెడల నీకుఁ బరిపూర్ణసౌహృదము గలదేని నేనడిగినప్రశ్నమునకు సదుత్తరము నొసఁగుము. ప్రభూ! బ్రాహ్మణ, క్షత్త్రియ, వైశ్య, శూద్రులకు విధాయకములగు నియమములనుగూర్చియుఁ, దదితరనియమములవలనిఫలములంగూర్చియు నాకెఱిఁగింపుము. మఱియు నేయేతీర్థములు సంపూర్ణశుభఫలదాయకములో, యేయేస్థానములం దెట్టియోగధ్యానతపోనియమాదులు ఫలప్రదములో విస్పష్టముగ బోధించి నామనోవ్యాకులకారణంబగుసంశయమును భాస్కరుఁడు నీహారముం బోలి శమింపఁజేయుము. అనిప్రార్థించుటయు మహాదేవుం డిట్లు చెప్పందొడంగెను.

దేవీ! మానవుఁడు యథావిధిగ, దుష్కరనియమాచరణముం గావించినచో సంపూర్ణఫలలాభముం గాంచఁగలుగును. ఆపాతసుఖమయముగా నగపడుచుండు మానవత్వము కేవలమును జలబుద్బుదముం బోలి యనిత్యంబై నదగుటచే మానవున కెల్లవిధముల దుష్కరనియమాచరణంబవశ్యకర్తవ్యమైనది. అతిలోభులును, ధర్మద్వేషులు నగుమానవులు వర్తమానసుఖాసక్తులై పరిణామమునం దధికసుఖదాయకములగుఫలములం దుఁ బ్రవృత్తులు గాఁజాలకుందురు. ప్రతిజ్ఞాపూర్వకముగా నాత్మనియమములనాచరించువాఁడు సహస్రవర్షము లశేషపుణ్యఫలభోగము లనుభవించును. దేవతలు నియమాచరణముననే యసామాన్యమగుదేవత్వలాభముం గాంచఁగలిగిరి. నక్షత్రములు నియమాచరణముచేతనే సముజ్జ్వలతేజస్సంపన్నము లయ్యెను. ఓవరారోహా! మానవుఁ డెన్నటికి నాత్మనియమముల నతిక్రమింపఁగూడదు. నియమావలంబనమూలముననే వహ్ని ప్రజ్వలించుచుండును; సూర్యభగవానుఁడు ప్రకాశించుచుండును; వాయువు ప్రవాహిత మగుచుండును; పృథ్వి యీబ్రహ్మాండమును ధరించుచుండును. ఓశుభాననా! నీవును నియమపూ

ర్వకముగాఁ దపోనుష్ఠానముం గావించుటచేతనే సర్వపాపవిముక్తవైనా యర్ధాంగివి గాఁజాలితివి. ఇందెంతమాత్రమును సంశయములేదు.

ఏమానవుఁ డొకసంవత్సరము నియమపూర్వకముగా ధర్మకార్యాచరణముంగావించునో యాతఁడు బ్రహ్మలోకాదినానాస్థానములయందు దేవతాతుల్యుఁడై సుఖవిహారము సేయుచుండును. పార్వతీ! నిత్యనియమానుష్ఠానపరుం డగు నొకపుణ్యాత్ముఁడు తననియమఫలము నెట్లుపొందఁగలిగెనో యావిషయమును సప్రమాణముగఁ దెలిపెద నాకర్ణింపుము. ఈచరిత్రము నిరంతరసత్క్రియాచరణతత్పరులగుసత్పురుషుల కతిప్రియమైనది. కావున సావధానవై యాలకింపుము.

పూర్వకాలమునఁ గాశీధామమునందుఁ గేవలనామమాత్రధారియగు నొకబ్రాహ్మణుఁ డుండెను. ఆతనిపైతృకనివాసస్థానమాంధ్రదేశము. ఆతఁ డతిపురూపియు, జాతికర్మముల కయోగ్యుఁడును, పరద్రవ్యాపహారియు, నృశంసుఁడును, అపవిత్రుఁడును పాపాత్ముఁడునై స్వకులోచితధర్మంబులఁ బరిత్యజించి కపటపమ్రభావముతో సర్వదా పరనిందారతుఁడై దేవతలకును, దానవులకునుగూడ ధిక్కారపాత్రుఁడై యుండెను. అధార్మికుఁ డగునానాస్తికుఁడు నిరంతరము నాత్మశ్లాఘాపరాయణుఁడై వేదములనుగూడ నిందించుట కారంభించెను. ఆయపవిత్రుఁ డగువిప్రుఁడు పరద్రవ్యలోభముచే సంతోషించువాఁడు గావునఁ గాశీక్షేత్రమునందు శూద్రాదివర్ణభేదమునుగూడఁ బాటింపక, దేవబ్రాహ్మణులకు నమస్కారములం గావింపక యొకసారినైనను బ్రణవమంత్రము నుచ్చరించుటయనుమాటయేలేక యథేచ్ఛావిహారియై కాలము గడపుచుండెను.

ఈవిధముగా నాతఁడు గృహస్థితం బగుసర్పముంబోలి యెల్లవారికి నుద్వేగకారణుం డగుచుండుటచే నాతనిసహవాసము నెవ్వరు నపే

క్షింపక యుండిరి. అఖిలుండు జాతిచే బ్రాహ్మణుం డయ్యెను, వేదము సం దొక్కయక్షరమునైన నుచ్చరించుట యనుమాటలేక దంతములు లేనిసర్పమువలెను, శృంగములులేని వృషభమువలెను, ఱెక్కలులేని పక్షివలెను, పుష్పములులేనివృక్షమువలెను, సగ్రగణ్యుండై యావారాణసి యందలిబ్రాహ్మణులసందఱను బీడించుచు నిరంతరధనాపహారియై తత్పురుండై వాసము సేయుచుండెను. ఆపాపాత్ముండు ప్రియులు, నప్రియులు ననుభేదంబులేకుండ నాక్షేత్రమునం గలయెల్లవారికిని దుష్టసర్పముంబోలి నిరంతరదుఃఖసంపాదకుండై యుండెను. అతండు నిత్యము సంగడివీథులందుఁ దిరుగుచుఁ గాలక్షేపము సేయుచుండెను.

ఈవిధమునఁ దొమ్మిదేండ్లతక్కువగాశతవర్షములవయసు గడపెను, ఆదురాత్మునకు సద్బుద్ధి గలుగనేలేదు. ఇట్లుండఁ గొంతకాలము నకొకదినంబున సిద్ధగంధర్వపూజితుఁ డగుసంబుజపదుం డనునొకసిద్ధుఁడు సర్వదేవతావందితుఁడును, ఓంకారస్వరూపుఁడు నగుమహాదేవునిదర్శించుకుతూహలముతోఁ గాశీధామమునకు విచ్చేసెను. అచ్చట నాతఁ డితరసిద్ధమునిగణంబులచేఁ బూజితుండై నియమపూర్వకముగాఁ బంచాయతనసంస్థితుం డగునోంకారనాథుని దర్శించుటకై బయలుదేఱెను. కలికాలమునందు వివిధదుఃఖాదులచేఁ బీడింపఁబడుచుండుమానవులు కాశీక్షేత్రమునందలిమత్స్యోదరీతీరంబునంగల పంచాయతనక్షేత్రమున నివసించియున్నమహాదేవుని దర్శించి ప్రణామంబు లాచరించి భవకారణములగుపాపములను దొలఁగించుకొనుటకై సర్వదా పరమేశ్వరునకుఁ బ్రదక్షిణనమస్కారములం గావించుచుఁ దదాలయమునందు నివసించి తత్ప్రసాదరూపంబులగుజలాదుల నాహరించుచు సుఖవిహారంబు గావించుచుందురు.

ఓవిశాలలోచనా! ఆదివ్యస్థానమునందు సకలదేవతలు నదృశ్య

మూర్తులై సంచరించుచుందురు. అప్పుడు పరమసిద్ధుం డగు నంబుజ పదుండును నిజస్వరూపము నుజ్జగించి యొకవికృతం బగురూపముం దాల్చి యాప్రదేశమునందుఁ బరిభ్రమించుచుండెను. ఆసమయము నందుఁ బూర్వోక్తకపటసిద్ధుం డగుద్విజాధముఁడు మహాత్ముఁ డగు నా సిద్ధపురుషుం దర్శించి యాతండును దనవలెనే వికృతాకారుఁడై యుం డుటం గాంచి యుపహాసరూపముగా భక్తియుక్తుండునుంబోలి చటాలు న లేచి యథోచితప్రణామాదులచే నాతనికిఁ గపటసన్మానములాచరిం చి ((ఆహా! మీదివ్యదర్శన మపూర్వమైనది. మహాత్మా! మీరెచ్చటి నుండి యేయుద్దేశములో నిచ్చటికి విచ్చేసితిరి? కమనీయతేజోమయు లగుమీరు దేవలోకమునుండి యేతెంచితి రని నాకు బోధయగుచు న్నది. మీవంటితపఃప్రభావసంపన్నులగుదివ్యపురుషుల నీభూమండల మునం దేనెచ్చటను గాంచియుండలేదు. కావునఁ దపోధనులగుమీరు స్వర్గమునుండియే యవతరించి యుందు రని నేను భావించుచున్నాను.

అనియనేకవిధముల నవ్విప్రాధముఁడు కపటవినయముతో సంభాషించుటయు నావాక్యముల నాకర్ణించి సిద్ధపురుషుండిట్లనియెను. మహాత్మా! మీరు స్వర్గవాస్తవ్యులగువారినందఱను బాగుగ నెఱింగి యుందురు. కావుననే యీవిధముగా ననుమానింపఁగలిగితిరి. నేను నిజముగా స్వర్గలోకమునుండియే యిచ్చటికి వచ్చియుంటిని. ఈవిష యమునం దెట్టిసంశయమును లేదు. మీకుఁ గావలసినసకలవిషయము లంగూర్చియు నన్నుఁ బ్రశ్నింపవచ్చును. నేను మీకు సంతృప్తికరము గాఁ బ్రత్యుత్తరముల నీయఁగలను. అనుటయు నావిప్రుండు మహా పురుషా! నీవు స్వర్గలోకమునందు నివసించువాఁడవే యైన వో నించుక సేపిటఁగూర్చుండి నావాక్యముల నాలింపుము. నీవెన్నఁడైన నప్సర స్సుందరీరత్నమగురంభను సందర్శించితివేని నాకెఱింగింపు మనియెను.

ఆమాటకు సిద్ధుం డించుక యాలోచించి విప్రశ్రేష్ఠా! స్వర్గలోక వాసినులగునప్సరఃకాంతలలోఁ బేరు గాంచియున్నరంభను నేను బాగుగా నెఱుంగుదును. కావున నామెంగూర్చి నీవడిగినవిషయముల నన్నిటిని సంపూర్ణముగాఁ దెలుపఁగల నని చెప్పెను. బ్రాహ్మణుం డందులకానందించి మహాత్మా! స్వర్గలోకవాస్తవ్యులలోఁ జంద్రరేఖంబోలి మనోహారిణి యగురమణీమణిరంభ నెఱుంగనివాఁ డెవ్వఁడుండును ? ఓ సాధుశేఖరా! నీవు మరల నెప్పుడైన స్వర్గలోకమునకుఁ బోవుదువేని నేను రంభ క్షేమము నడిగితి నని యామెతోఁ జెప్పుమని ప్రార్థించెను. సిద్ధుం డామాట కాశ్చర్యపడి యోద్విజసత్తమా! అప్సరోరమణులలో నగ్రగణ్య యగురంభను సందర్శించుటకై నేను మరల స్వర్గమునకుఁ బోవుట తటస్థించినచో నప్పుడు తప్పకుండ నీయాదేశమును బరిపాలించెదను.అని చెప్పి యాసిద్ధుండు బ్రాహ్మణుని సంతుష్టుం గావించి యాక్షణంబుననే వాయువేగగమనముతోఁ గమనీయం బగుస్వర్గనగరమునకుంబోయి యంబరమునుండి వెలువడినచంద్రరేఖంబోలి యప్పుడే గృహమునుండి బయలుదేఱి వచ్చుచున్నట్టియుఁ, బద్మవిరహిత యగు పద్మాలయంబోలి మనోహరమూర్తియై విరాజిల్లుచున్నట్టియు సుందరీలలామయగురంభను సందర్శించెను.

ఆమెసుందరవదనము సంపూర్ణచంద్రమండలసదృశమై మనోహరమై యుండెను. ఆమెసకలాంగకములు ననంగదేవతాధిష్ఠితములై మనోజ్ఞములై యుండెను. మదగజకుంభస్తనియు, పీనవిస్తీర్ణకటిమండలయు, సమున్నతవిశాలవక్షోభాగయు, నయననాసికాదిసర్వాంగసుందరియు, సిద్ధప్రసిద్ధదేవగణమనోహారిణియు, శోభనాంగియు, నగునాదివ్యరమణీలలామ రక్తోత్పలదళసదృశములగుతనకోమలచరణంబులచే స్వర్గతలంబును బల్లవితంబుగాఁ జేయుచు వీణాపాణియై వచ్చుచుండుటం

గాంచి సుకృతాత్ముఁ డగునాసిద్ధుం డామెతోనిట్లనియెను. ఓవరాంగీ! వారాణసీధామంబున నివసించుచుండు నొకబ్రాహ్మణుఁడు నీక్షేమము నడిగియున్నాఁడు. నీకాతనితోడిపరిచయమున్న దో నాకుఁ దెలుపుము. అనుటయు దివిజకాంతారత్నమగురంభ యించుక యాలోచించి "నే నెంతగాఁ బ్రయత్నించిచూచినను నాకాతనితో సంబంధ మున్న ట్లింతమాత్రము నగపడుటలేదు.,, అని చెప్పెను.

సిద్ధశేఖరుం డారంభ వాక్యములనాకర్ణించి "ఓయిందీవరాక్షీ! ఇఁక నీభవనంబునకుఁ బొమ్ము." అని చెప్పి యాతఁడు మరల వారాణసీనగరంబునకుఁ జనుదెంచి సిద్ధసహస్రపూజితుండై పంచాయతనక్షేత్రంబున నివసించియుండెను. అనంతరము గొంతకాలమున కాబ్రాహ్మణుండుమరల నచ్చటికి వచ్చి యాసిద్ధుని సందర్శించి "మహామునీంద్రా! అప్సరస్సుందరీరత్నమగు రంభను మీరు సందర్శించితిరా? మీకు దర్శనం బిచ్చినయాదేవాంగనాశిరోమణి నాప్రశ్న కేమనియుత్తరమిచ్చినది?" అని యడుగుటయు సిద్ధుండు "భూసురేంద్రా! నేను స్వర్గమునకుఁ బోయి రంభను దర్శించితిని. నీమాట లామెకు నివేదించితిని. అప్పు డామె కొంతసేపటివఱకు నాలోచించి మీరు ప్రశంసించినయాతఁ డెవ్వఁడో యాతనిపేరైన నేనెన్నఁడును వినియుండలేదని చెప్పినది." అనియెను.

అంతనాబ్రాహ్మణుండు "తేజోమయా! నేను బ్రాహ్మణుఁడను. నీవు నాయందు దయయుంచి మరల స్వర్గలోకమునకుఁ బోయి యారంభను దర్శించి నీవాబ్రాహ్మణు నెఱుంగకుండుటకుఁ గారణమేమని ప్రశ్నింపుము" అనివేడుటయు నాసిద్ధశ్రేష్ఠుఁడు బ్రాహ్మణునిప్రార్థనము నంగీకరించి మరల సుకృతిగణనివాసయోగ్యంబగుస్వర్గనగరమునకుం జని పృథునితంబినియు, పద్మరాగసమప్రభయు నగురంభం గాంచి మం

దహాసంబు సేయుచుఁ జంచలహృదయ యగునా మెనుద్దేశించి ఓసుందరీ! నీకుఁ బరమప్రియుండును వారాణసీనగరవాస్తవ్యుఁడు నగునాబ్రాహ్మణుఁడు మరల "నిన్నింతగాఁ బ్రేమించుచున్న నన్ను నీవిట్లనాదరము చేయుటకుఁ గారణమేమి" అని ప్రశ్నించిరమ్మని నన్నుఁ బంపినాఁడు.

అనుటయు నాదివిజకాంతాశిరోమణి చిఱునవ్వు ముఖమండలమునఁ దులకింప సిద్ధసహస్రశ్రేష్ఠుండగునమ్మహాత్ముని సంబోధించి యిట్లనియెను. ఓసిద్ధశేఖరా! నీవు మరల నాబ్రాహ్మణునొద్దకుఁ బోయి నావాక్యములుగా నిట్లు చెప్పుము. ఓబ్రాహ్మణా! రంభతోఁ బరిచయము గల్పించుకొనవలయు నని నీకుఁ గుతూహలమున్నచో నీవు నియమవంతుఁడవు గమ్ము! ఆమూలమున నీవు స్వర్గలోకమును జేరఁగలవు. అని రంభయాబ్రాహ్మణునింగూర్చి చెప్పి యాసిద్ధశ్రేష్ఠునకుఁ బ్రణామం బాచరించి సకలాప్సరస్సఖీసహితముగా నందనవనమునకుం బోయెను.

అనంతరము దేవగంధర్వవందితుఁడగునాసిద్ధవర్యుఁడు మరలఁ గాశీధామమునకు వచ్చి స్వర్గసందర్శనసుఖమును స్మరించుకొనుచు నాబ్రాహ్మణుని సందర్శించి విప్రోత్తమా! సురసుందరీమణియగురంభకును సకలదేవతాగణంబులకును నీపరిచయమును గలిగించుకొనవలయునని యభిలాషయున్నచో నీవువిశేషనియమపరిజ్ఞానంబు గాంచి నియమానుష్ఠానముం గావింపుమని చెప్పెను. ఆవచనంబు లాకర్ణించి యాబ్రాహ్మణుండు సుస్థిరహృదయముతో సిద్ధశేఖరా! నేనీదినమునుండి పాషాణభోజనముం గావింప నని నియమము చేసికొంటిని. నీవు స్వర్గలోకమునకుఁ బోయి యారంభను మరల దర్శించి పూర్వము నిన్నుఁ బ్రశ్నించినవాఁడు పాషాణభోజనము చేయునని నియమము చేసికొన్నవాఁడుసుమా యని చెప్పుమనియెను.

సిద్ధుండగు నబ్రాహ్మణునియీవాక్యముల నాలించి యథోచిత సంభాషణలచే నాతని సంతుష్టుంగావించి మరలవాయువేగంబున స్వర్గ పురమునకుం బోయి రంభను దర్శించి సుందరీ ! పాషాణభోజనముచే యనని నియమము చేసికొన్నయాబ్రాహ్మణుని నీవెఱుంగవా ? ఈసంగ తి తెలిసికొని రమ్మని యాతఁడు మరల నన్నంపినాఁడని చెప్పెను. రం భయు నాబ్రాహ్మణుఁ డిట్లు నియమము చేసికొన్నదినమునుండి యాత నింగూర్చి భావించుచుండెను. క్రమముగా నాబ్రాహ్మణునియసాధార ణనియమమూలంబున సకలవస్తువులును రాత్రులయందు బ్రదీపకాంతి లోఁ బ్రకాశించువిధంబున దేదీప్యమానము లగుచుండెను. కాశీధామ వాస్తవ్యులకందఱకును గేవల మప్రియుం డగునాబ్రాహ్మణుఁ డానియ మప్రభావముచేతనే యెల్లవారికిని బ్రియుండయ్యెను. ఎన్నఁడు నాతని మందిరమునకుఁ బోవుట కిచ్చగింపనివారును దమగృహంబుల కెప్పుడు నాతఁడు వచ్చుట కంగీకరింపనివారునుగూడ నాతనిదర్శింపకుండజీవింపఁ జాలనంతటిస్థితికి వచ్చిరి.

ఆబ్రాహ్మణుఁడును గ్రమముగా నిర్జనస్థానమున నివసించి నియ మపరిపాలనముంగావించుచుఁ బరమసిద్ధిలాభముం గాంచిబ్రహ్మమ యుఁడై బ్రహ్మలోకప్రాప్తిం గాంచఁగలిగెను.

ఓదేవీ ! పార్వతీ! యమనియమాదుల నల్పముగాఁగాని యధిక ముగాఁగాని యుపాసించునుపాసకులు స్వప్రభావముచేస్వర్గప్రాప్తులుగాఁ జాలుదురు. చిరకాలము యశస్కరములగుకర్మముల నాచరించువారైన నునియమవ్రతులవలెననాయాసముగా బ్రహ్మలోకమునుబడయఁజాలరు. ఓశతపత్రముఖీ ! పర్వతాత్మజా ! ఇఁక జెప్పవలసిన దేమున్నది? ఆ బ్రాహ్మణుఁడు నియమావలంబనమూలమున బ్రహ్మలోకమును జేరి శచీపతి యగుమహేంద్రునింబోలి స్వర్గనగరమునందు సుఖనివాసముం

గాంచఁగలిగెను. ఓసూర్యచంద్రతేజశ్శాలినీ! ఇది నియమఫలప్రకారంబు. కావున నియమమునందు సర్వదా విశుద్ధభావముతో నుండవలయును.

## —♦ చంద్రశేఖరత్వహేతుకథనము. ♦—

భగవతి యగుపార్వతి యీవిధముగా నియమఫలసంకీర్తనము నాకర్ణించి పరమానందహృదయముతో లోకకర్త యగునాత్మభర్తనుద్దేశించి మరల నిట్లనియెను, మహాదేవా! నియమఫలముంగూర్చి నీచేఁ జెప్పంబడినవిషయము నాకర్ణించితిని. ఆబ్రాహ్మణుఁడు దుష్కర్మనిరతుఁ డయ్యును నియమప్రభావముచే బ్రహ్మలోకప్రాప్తుండయ్యెను. ఓంకారేశ్వరప్రసంగవశమున నీచేఁ జెప్పంబడిన నిత్యనియమఫలంబు నాలకించితిని. కాని యిప్పు డతిగోప్యం బగు నింకొకవిషయముంగూర్చి విన వలయు నని నాకభిలాష గలుగుచున్నది. ఓసుధాకరసన్నిభా! నీవు నిరంతరమును నీమస్తకమునం దర్ధచంద్రుని ధరించుచుండుటకు నిమిత్తమును, నీకుఁ జంద్రశేఖరనామము గలుగుటకుఁ గారణమును విస్పష్టముగా నెఱింగింపవలయును. నీవు నీయర్ధశరీరమునందు నన్ను ధరించినవిధముననే చంద్రునిగూడఁ దలపై ధరించుటకుఁ గారణమేమి? ఎవ్వనిచరణరజోలేశమును దలఁదాల్చుటకు దేవతలుగూడ నభిలషించి ప్రార్థించుచుందురో యట్టినీయుత్తమాంగమునందుఁ జంద్రుఁ డేవిధముగా నధిరోహింపఁగలిగెను? పరమేశ్వరా! నేను నీసహధర్మిణి నగుటం జేసి నాయెడలఁ బరమానుగ్రహమునుబ్రకటించుచు నీరహస్యమును విస్పష్టముగా నాకు బోధింపుము.

అని యీవిధముగాఁ దత్కథాశ్రవణమునకై యత్యుత్కంఠతస్యై పార్వతి ప్రశ్నించుటయు మహాదేవుండును ప్రేమపూర్వకముగా

నాగిరిరాజనందనం గౌఁగిలించుకొని యిట్లు చెప్పందొడంగెను. ఓసు ముఖీ! వినుము. నీవు పూర్వము సతీరూపమును బరిత్యజించినప్పుడు నేను నీవిరహమును సహింపఁజాలక నిర్వేదముతో నరణ్యావాసము సుఖకరం బగునని భావించి యాత్మమాత్రద్వితీయుఁడనై వనవసంబునకును బరిభ్రమింప నారంభించితిని. మఱియును దపశ్చరిణంబునకు నిశ్చయించి గృహంబును బరిత్యజించి రమణీయములగు పర్వతగుహాంతరములయందును, నదీపులినములయందును, వృక్షవాటిగణంబుల సమీపమునందును, దరుషండములయందును, దేవోద్యానములయందును, సాధారణవనములయందును సంచరించుచు నిందీవరసమన్వితంబులగుజలాశయములసమీపమునందు నివసించుచుంటిని. నేనిట్లు కఠోరతపోనియమము నవలంబించి యుండుటచే నప్పుడు నేనాశ్రయించిన సమస్తవృక్షములును, సమస్తపర్వతములును దపోనలంబుచే దగ్ధములై పోవుచుండెను. కొన్నిపర్వతములశృంగములు ధూమాకీర్ణములును, మఱికొన్నిపర్వతములశిఖరములు జ్వాలాభీలములునై నాతపఃపరితాపముచే సకలపర్వతములును దగ్ధములగుట కారంభించెను. ఆతపస్తేజముచే సూర్యచంద్రాదిగ్రహగణంబులు ప్రభాహీనములై పోయెను. లోకనియంతయగుయముండు జరాపీడితునివలె నై పోయెను. మఱియు సురాసురసమన్విత మగుత్రైలోక్యమును బరిఖిన్నమై పోయెను.

అప్పుడు సకలదేవతలును, బ్రహ్మేంద్రసహితముగా మదీయమగుతేజముచే సమాకీర్ణులై మందరాచలశిఖరమునందుఁ జేరియుండిరి. ఆసమయమున సకలదేవతాధీశ్వరుఁ డగుమహేంద్రుఁడు బ్రహ్మదేవు నుద్దేశించి, మహాత్మా! ఈయద్భుతసంఘటనమునకు నిమిత్త మేమి? మేమీయగ్నిజ్వాలలచే నీవిధముగాఁ బీడితులమగుటకుఁ గారణమేమి? ఈదారుణానలజ్వాలలు చల్లారుట కుపాయమేమి? నిన్నాశ్రయించి

యున్న యాపన్నులమగుమాకు సదుపాయము నుపదేశింపుము. అని యింద్రుండు ప్రార్థించుటయుఁ జతుర్ముఖుండు సజలజలదగంభీరస్వరముతో నిట్లనియెను.

మహేంద్రా! ఎవ్వనితపఃప్రభావముచే నీత్రిభువనంబులును దగ్ధము లగుచున్నవో యీమహాత్ముఁ డగుమహాదేవుని యసాధారణవిక్రమము నెఱుంగుటకు నేను సమర్థుండను గాఁజాలను. ఆమహాదేవునిసన్నిధిని నాసంబంధ మగునట్టియధికారమును నిలువఁజాలదు. ఆతనియుద్దేశమునకు వ్యతిరేకముగా నెవ్వరు చరింపఁగలరు? నేనిప్పుడు జగత్కల్యాణముకొఱకు నీకు హితకరమగుమార్గమును బోధించెదను. వినుము. ఆరుద్రుండు చంద్రధారణంబు గావించునంతవఱకును సౌమ్యుండు గాఁజాలఁడు. కావున నీవిపత్సముద్రమునుండి తరింప నభిలషింతువేని రమ్ము. మనమందఱమును జంద్రుని వెంటఁబెట్టుకొనిపోయి యీమహాదేవునిమస్తకమునందు సంస్థాపింతము. ఆపరమేశ్వరుఁడు సతీవియోగముచే దివసమునందలి వీతిహోత్రునింబోలి ప్రజ్వరిల్లుచు మనలనందఱను దహింపఁజేయుచున్నాఁడు. ఆదేవదేవుఁడు నిశ్చయముగా దేవతాస్వరూపుఁ డగుసుధాకరునిఁ దనయుత్తమాంగమునందు ధరింపఁగలఁడు. అప్పు డయ్యీశ్వరునిమస్తకమునందలిచంద్రచూడాశ్రితమణి వినిర్మలశోభామయమై దారుణతపస్తేజమును సులభముగా నుపసంహరింపఁగలదు. ఇట్లు గావించినచో మనకార్యసిద్ధి యగుటయేగాక యీసదాశివుండును సంతుష్టుండు గాఁగలఁడు. మఱియు నాహిమాంశునిప్రభావముచే నాదేవునిసకలసంతాపమును దూరీభూతం బగుటచే నాతండును శాంతస్వరూపుఁడు గాఁగలఁడు.

అని యిట్లు బ్రహ్మదేవుం డుపదేశించుటయు నింద్రాదిసమస్తదేవతాగణంబులును లోకహితకరంబగునాయుపాయము నంగీకరించి

మంగళకరంబగు చంద్రరూపము శిరోజమునుండి మొకయమృతకుంభము ను నొకవిషకుంభమును గ్రహించి యందఱును వినీతభావముతో మా త్సన్నిధానమును జేరియుండిరి. అప్పు డేకహస్తపరిమాణములును, వస్త్రావృతంబులు నగునయ్యమృతవిషకలశములు పుష్పవిశిష్టంబగుచం దనముంబోలి మనోహరపరిమళకలితంబులై విరాజిల్లుచుండెను. ఆసమ యమున వాయుప్రభృతు లగుసకలదేవతలహృదయములు నింద్రియ ములును సుప్రసన్నములై యుండెను. అంతఁ బితామహుం డగువన జాసనుఁడు మహాదేవుం డగునన్ను సంబోధించి దేవదేవా! అమృతవిష పూర్ణంబు లగునీకలశములను దయతోఁ బరిగ్రహించి నీసన్నిధ నాశ్ర యించియున్న యీయమరగణంబులకందఱకును భవదీయదివ్యదర్శన లాభమును బ్రసాదింపు మని ప్రార్థించెను.

ఓపరమేశ్వరీ! అప్పుడు నేను బ్రహ్మదేవునివాక్యముల నాకర్ణిం చి యాకలశద్వయమునందును ముందుగా నమృతకలశమును గైకొం టిని. అది నాయుత్తమాంగమునం దిప్పుడు చంద్రరేఖారూపమునఁ బరిణమించి విరాజిల్లుచుండెను. తదనంతరము నేనారెండవవిషకుంభ మును నామధ్యమాంగుళిచే స్పృశించి యాయంగుళితోనే నాగ్రీవదే శమునందు విలేపనము చేసికొంటిని. దేవీ! నాయుత్తమాంగమునం దమృతముండుటచేఁ జంద్రశేఖరుఁడనియు, గ్రీవదేశమునందు హాలా హాలముండుటచే నీలకంఠుఁడనియు నామద్వయము నాకప్పుడు లభిం చెను. ఏకకాలముననే నామస్తకగ్రీవములయందుఁ జంద్రహాలాహా లములు దైహికచిహ్నములవలెఁ బొడసూపఁదొడంగెను. సౌమ్యపదా ర్థములన్నిటికంటెను నతిసౌమ్యుం డగు చంద్రుఁడు నాయుత్తమాంగ ము నధిరోహించియుండుటచే నప్పుడు నాతిపస్తాపమంతయును శీతలమై పోయెను. అప్పు డాహాలాహాలముచే నాకంఠప్రదేశము శ్యామలవర్ణ

విభాసిత మయ్యెను.

ఓవామలోచనా! నేనప్పుడు దేవతలకందఱకును సౌమ్యుఁడను శివస్వరూపుఁడను నై ప్రసన్నభావముతోఁ బ్రియదర్శనుఁడ నైతిని. ఆ విషామృతచిహ్నములచే నలంకృతుఁడ నై యున్న నేను పూర్వముకంటె ను మనోహరాకారుఁడనై యెల్లవారికిని దర్శనీయుండ నైతిని. దేవీ! ఈదివ్యచరిత్రము నాకర్ణించువారు గాణపత్యలాభముం గాంతురు. పుణ్యప్రదమును, సర్వదా శుభకరమును, పితృగణస్వర్గప్రాపకము నగు నీయితిహాసమును బఠించువారు సకలకలికల్మషవిముక్తులు గాఁగలరు. నిర్మలహృదయముతో నద్భుతం బగునీచంద్రజన్మాధ్యాయము నధ్య యనముసేయువానియెడల నేనతిప్రియుండనై దేహాంతమునం దాతనికి విషయసంపర్కవిరహిత మగుగాణపత్యపదలాభమును బ్రసాదింతును.

## ——♦ వి భూ తి మా హా త్మ్య ము. ♦——

అవ్యయయు, నగేంద్రనందనయు, మహాభాగయు నగుపార్వతి దేవి సకలదేవతాధీశ్వరుం డగునిజేశ్వరునుద్దేశించి యిట్లనియెను. ఓ దిగంబరా! దేవదేవా! సర్వభూతాధినాథుఁడవు, సర్వదేవతాసార్వభౌ ముఁడవు నగునిన్నుఁ బతిగాఁ బడయుటచే నీవిశ్వమునందు నాకంటెఁ బుణ్యవతు లగునతు లెందును లేరని యానందించుచున్నాను. శ్మశాన ప్రదేశములయందుఁ బ్రమథగణసహితుండవై యానందతాండవము గావించునప్పుడు పరమైశ్వర్యసమన్వితమును, భస్మవిభూషితము నగునీ దివ్యమూర్తిని నేను సందర్శించుచుందును. సకలశుభకరంబులగునభిల షితవరంబులను భక్తులకుఁ బ్రసాదింపఁగల సమర్థుఁడవగునీవు సకలాం గకములను విభూతిరజోలేపనముం గావించుకొనుటకుఁ గారణ మేమి? చందనగోరోచనాది పరమోత్కృష్టవిలేపనములుండఁగా నీవు కేవలము

ను విభూతిని నీయర్ధాంగినగునాకంటెను బ్రియంబుగాఁ దలంచి యుప యోగించుటకు నిమిత్తమేమి? దేవాదిదేవా! బాలేందుశేఖరా! ఈ భూతిజన్మస్థానంబును, ఇది నీకతిప్రియం బగుటకు నిమిత్తమును విస్ప ష్టముగా నాకెఱింగింపఁగోరెదను.

అనియిట్లతికుతూహలముచేఁ బ్రార్థించుచున్న ప్రజ్వలానల సన్నిభసముజ్జ్వలాంగి యగు దుర్గాదేవిని గాఢాలింగనపూర్వకముగా నాదరించి పరమేశ్వరుం డిట్లు చెప్పందొడంగెను.

ఓగౌరీ! చంద్రముఖీ! నేను నిరంతరమును భస్మధారణముం గా వించుటకుఁ గారణమును జెప్పెద నాలకింపుము. బ్రహ్మదేవునిచే సృష్టింపఁబడినయీవిశ్వమునందు మహోత్కృష్టంబగుభృగువంశమున కు భూషణమై యనుపమానతేజస్సంపన్నుఁడగునొకబ్రాహ్మణుఁ డుం డెను. ఆతఁ డతికఠోరనియమముల నవలంబించి తీవ్రం బగుతపంబు గావించుట కారంభించెను. ఆనియమవ్రతుఁడు నిశ్చలదీక్షతో గ్రీష్మ కాలమునందుఁ బంచాగ్నిమధ్యమున నిలిచియు, శీతకాలమునందు జలమధ్యమున శయనించియు, వర్షాకాలమున ధారాధరసమూహము నుండి వెలువడు ప్రబలజలధారలను సహించుచు నాకాశమధ్యమునం దుండియు నీవిధముగాఁ దపంబు సేయుచుండెను.

ఇట్లు నియమాన్వితుఁడై తపశ్చరణంబు గావించుచున్నయాత నికి క్షుద్బాధ యగుచుండుటయు నాతఁడు కాలక్రమమున నాలుగు ఐదు, ఆఱు, ఏడు పదిదినములకొకసారిమాత్రము మితభాషియు మి తాహారియునై కాలమును గడపుచుండెను. భల్లుక, శరభ, సింహ, శృగాలాదిజంతువులు పరిచారకులంబోలి ఫలమూలాదులం గొనితెచ్చి యమ్మహాత్మునకు సమర్పించుచుండెను. ఆతనితపఃప్రభావముచే నా తపోవనమునందలి పన్నగకులాద్యాహారము లగుమృగంబులును, కేవల

మాంసాహారములగుజంతువులును సహజములగుతమపరస్పరశత్రుత్వ ములను బరిత్యజించి యన్యోన్యానువర్తనంబు గలిగి మెలంగుచుండె ను. క్రమముగా నాతపోధనుండును దీప్తానలముంబోలి సముజ్జ్వలప్ర భామయుం డయ్యెను. ఆసనియతిభీషణతపస్తాపముచే సకలలోకములు ను దపించుట కారంభించెను.

పిమ్మట నాతఁడు లవణవిరహితంబు లగుశాకములనుమాత్రమే భుజించుచుండుటకు నియమము చేసికొనియెను. అందుచే నానియమ దీక్షితునకుఁ ద్రిలోకములయందును బర్ణాదుం డనునామము విఖ్యాతం బయ్యెను. అప్పుణ్యపురుషుఁడు పర్ణమాత్రభోజనంబుచేతనే సంపూ ర్ణముగ మృష్టాన్నభోజనముం గావించినంతటి సంతృప్తిం గాంచుచు బహుదినములు, బహువత్సరముంబు కఠోరనియమములచేఁ గడపివై చెను. అనంతరము గొంతకాలమున కాధర్మపరుం డగుమునివరుండు తనలోఁ దానే, “ నేను నిరంతరమును సత్యధర్మముల నవలంబించి చిరకాలమునుండి తపోనుష్ఠానముం గావించుచుంటిని. కాని యెంతకా లమువఱకు నాశరీరమునందలిరక్తము శాకరసరూపమునఁ బరిణమింప కుండునో యంతకాలమువఱకును మదనుష్ఠితం బగుధర్మము సంపూర్ణ ముగ ఫలింపఁజాలదు. ” అని నిశ్చయించుకొనియెను.

ఓపార్వతీ ! ఆమహాత్ముఁ డిట్లు భావించుకొని మఱికొంతకాల మున కొకనాఁడు స్వధర్మనిర్వహణంబునకై వనంబునఁ బ్రవేశించి పద్మ గర్భసవర్ణంబు లగుదర్భలను సంగ్రహించుచుండెను. ఆసమయమునం దసితీక్ష్ణం బగునొకదర్భ యామునిప్రవరునిహస్తనికం దగిలి గీచుకొని పోవుటచే గాయమై యాగాయమునుండి కేవలము శాకరసద్రవ్యంబగు శోణితము స్రవింప నారంభించెను. ఆసంయమీంద్రుం డావార్తముం గాంచినంతనే పెద్దప్రొద్దువఱకు బరమానందమున నాట్యము చేయ

నారంభించి గంభీరగర్జనంబులచే సమీపాశ్రితంబు లగుజంతువులకుఁ గూడ మహాభయమును గల్పించుచుండెను. ఆనందతన్మయుం డగు నాపరమపురుషునివికారచేష్టితములం గాంచి యటనున్న సింహశార్దూలాదిమృగంబు లన్నియును భయముచేఁ బలాయితములు గా నారంభించెను.

ఓశైలేంద్రా! ఆపుణ్యమూర్తికిఁ గ్రమముగాఁ జిత్తోన్మాదంబు గలుగునేమో యని శంకించి నేనప్పుడు వృద్ధబ్రాహ్మణరూపముం దాల్చి యాతపోధనునకుసాక్షాత్కరించితిని. అప్పు డొడసూపి నేనంతగాఁ బలుకరించినను దన్మయుం డగునాపన్నాదమునీంద్రుండు నావచనములను జెవులం బెట్టకుండఁగనే యెప్పటివలె గర్జించుచు నృత్యము సేయుచుండెను. కాని నే నంతతో నూరకుండక యాతనికి మఱింత దగ్గఱగాఁ బోయి నిలుచుటయు నాకస్మికముగా నాతఁడు నన్నుం గాంచి తనవికృతనటనాదులనుండి చటాలున విరతుం డయ్యెను. అప్పుడు నే నత్యాదరముతో నాతనిచేయి పట్టుకొని, విప్రశ్రేష్ఠా! ఇదియేమి? ఇప్పుడు నీకిట్టియభూతపూర్వం బగుభావోదయ మగుటకుఁ గారణ మేమి? చంద్రునినుండి యంధకార ముదయించుట యెట్లు సంభవమో, యట్లే పుణ్యమూర్తివగు నీహృదయమునుండి యిట్టివికృతభావ ముదయించుట యనుచితముగదా! ఆత్మశ్లాఘనమును బరిత్యజించిన వో నశ్రమంబుగఁ దపోధనలాభంబు సిద్ధించును. యజ్ఞస్వరూపమును, కీర్తిస్వరూపమును దపమే గావునఁ జిరసంచిత మగుతపఃఫలమును వినాశము చేసికొనకుము.

నేను సుందరుండ నని చంద్రుండును, నేను తేజోమయుండ నని సూర్యుండును, నాకంటెదహించువా రెవ్వరును లేరని యగ్నియు, నెన్నటికి నహంభావమును బ్రకటించుటలేదు. మునీంద్రా! జన్మసంచిత

మగుపితపశ్శక్తి దానధర్మాదులచే నతివినిర్మలమై యున్నది. ఆత్మశ్లాఘనంబుచే సకలధర్మంబులును గలుషీభూతములగుచుండును గావున నీవు తపోవిషయంబున నహంకారమును సంపూర్ణముగాఁ బరిత్యజింప వలయును. శరీరరూపిణి యగునీపృథ్వి యాత్మకంటె నతిరిక్తమైనది. దానియందు నానావిధంబు లగురసంబులు పరిదృశ్యమానము లగుచుండును. కావున నీవు నాశరీరమునుండి శాకరసము వెలువడుచున్నది గదాయని విస్మయమునకు వశీభూతుఁడవు గావలదు. ఈభూమండలమునందు నీకంటెను దపఃప్రభావసంపన్నులగు సంయమిశ్రేష్ఠు లనేకులున్నారు.

విప్రోత్తమా ! ఇటు చూడుము. నీవలెనే నాశరీరముగూడఁ దపస్తేజముచే నిష్కల్మషమై యున్నది. కాని "నేను నిష్కల్మషుఁడ" నని నీవభిమానపడుచున్నాఁడవు. కావున నీవు కల్మిషకలితుఁడవని నే ననుమానించుచున్నాను. దహ్యమానం బగుతృణమునుండి యేవిధముగా భస్మము బహిర్భూతం బగునో యావిధముగానే నాశరీరమునుండికూడ వెలువడఁగలదు.

పార్వతీ ! నేనిట్లు చెప్పుచు నేనాబ్రాహ్మణునిసమక్షమునందే నాతర్జన్యంగుళిచ్ఛేదనముం గావించుకొంటిని. అవ్వడాయంగుళినుండి యతివిమలంబు లగువిభూతిధారలు, యజ్ఞమునుండి వసుధారలవలెనే ప్రవహింప నారంభించెను. ఆబ్రాహ్మణోత్తముం డట్లు నాయంగుళినుండి వెలువడుచున్న భస్మధారలం గాంచి యత్యాశ్చర్యావిష్టహృదయుఁడై సాధువాదము గావించుచు, మహాత్మా ! ఈపృథ్వీతలము బహురసకలితమైన దని నీవిదివఱ కొనతిచ్చినమాట సత్యమైనది. నేను నాయంగుళినుండి శాకరసము వినిర్గతం బగుటం గాంచి గర్వించితిని. ఆయహంకారమును నీవు నీయంగుళినుండి భస్మధారలను బ్రవహింపఁ

జేసి సంపూర్ణముగ నణచివైచితివి. మహాత్మా! నీవెవ్వరు? నీజన్మగ్రహణముచే నేవంశము పవిత్రమైనది? నీనామ మేమి? ఏవిధానము నవలంబించి నీవు తపంబు గావించుచుంటివి? ఆహా! నీయంగుళినుండి భస్మధారలు వెలువడుచున్నవి. నేను బహుసహస్రవత్సరములనుండి మహాదేవానుగ్రహముం గోరి యతికష్టముతోఁ దపం బాచరించుచుంటినని నీవు నాయందుఁ గరుణించి నవజలధరతేజోమయదివ్యస్వరూపముతో సాక్షాత్కరించినవిష్ణుదేవుఁడవు గాదుగద! నీవు మేఘవాహనుఁడగునింద్రుఁడవో, దేవాదిదేవుండగు మహేశ్వరుండవో యనుగ్రహించి నాకెఱింగింపుము. అనియిట్లావిప్రోత్తముండు ప్రశ్నించుటయు నేనప్పుడు గర్గా! యుం బగునిజస్వరూపముతో నాతనియెదుట సాక్షాత్కరించితిని. అంత నాపుణ్యపురుషుండు సంభ్రమంబున నాచరణసన్నిధానమున సాష్టాంగాలింగితధరణీతలుండై వ్రాలి యిట్లు నన్నుస్తుతింప నారంభించెను.

దేవాదిదేవా! గ్రావ్యాఘ్రణస్వరూపుఁడవు, శూలధారివి, మహేశ్వరుఁడవు నగునీకు నమస్కారము. బ్రహ్మేంద్రాదులకును, విష్ణుదేవునకును బూజనీయుం డగుదేవునకు నాప్రణామంబులు. ప్రభూ! భస్మాంగరాగుఁడవు, భస్మోత్పత్తివికారుఁడవు, భస్మలిప్తశరీరుఁడవు, దుఃఖాంతఫలదాయకుఁడవు నగునీకు వందనములు.

దేవీ! ఇట్లు స్తోత్రము సేయుచున్న సద్భావవిశుద్ధచిత్తుం డగు నాతపోధనుం గాంచి నేనును విశుద్ధభావచిత్తుండనై యిట్లంటిని. ఓమునిసత్తమా! నీచేఁ గావింపఁబడిన యీస్తోత్రమునకు నేను సంతుష్టుండనైతిని. ఈస్తవంబునకు ఫలంబును నిర్దేశించెద నాకర్ణింపుము. ఈపవిత్రస్తోత్రమును బఠించువాఁడు సర్వైశ్వర్యసంపన్నుఁడును సకల, దుఃఖవివర్జితుండును గాఁగలఁడు. నీవు నాకత్యంతప్రియుండ వగుటం గణాధిపతివి

గాఁగలవు. గోబ్రాహ్మణదేవతాగణంబులయందు నీకు నిరంతరము శ్రద్ధాభక్తులు నిశ్చలంబులై యుండునుగాక! గణేశ్వరా! నీవు యోగబలంబుచేఁ బరమానందకందళితహృదయారవిందుండవై నాకుఁ బ్రీతికరంబు గావించి మేరుశైలస్థితంబును, దేవయోగ్యంబును, మద్దత్తంబు నగుసుఖావాసమునందు నివసించియుండుము. అని వరం బిచ్చి యమ్మునిశ్రేష్ఠు ననుగ్రహించితిని.

అమృతసుగంధీ! పవిత్రాచరణంబుచే విభూతి నాకతిప్రియతమపదార్థం బయ్యెను. విభూతిలేపనమాత్రంబున సర్వోత్తమస్నానఫలంబు సిద్ధించును. పుణ్యంబగు సకలతీర్థంబులను, బ్రయాగతీర్థంబునను స్నానముచేసిన ఫలము విభూతిస్నానముచేతనే లభింపఁగలదు. మఱియు విభూతిస్నానముచేఁ బుష్కర, ప్రయాగాదితీర్థంబులయందు భక్తితోఁ బ్రసంగించినపుణ్యఫలంబుకంటె శతగుణాధికఫలంబు లభించును. బ్రహ్మయు, విష్ణుండును, అనంతుఁడును, శక్రుండును, యముండును, వైశ్వానరుండును, వరుణప్రభృతిదేవగణంబులును విభూతిస్నానప్రభావముచేతనే సర్వైశ్వర్యసంపన్నులై సకలలోకులకును బూజనీయులుగాఁగలిగిరి. ద్వాదశాదిత్యులును, అష్టవసువులును, ఏకాదశరుద్రులును, మరుత్తులును, అశ్వినీదేవతలునుగూడ నీవిభూతిస్నానము నుపాసించియే దేవత్వలాభముం గాంచఁగలిగిరి. మఱియుఁ దపోధనులును, సిద్ధులును, ఉరగులును, చారణులును విభూతిస్నానమాహాత్మ్యముచేతనే మోక్షపదప్రాప్తులైరి.

ఓపార్వతీ! విభూతిస్నానము నాచరించువారికి యక్షరాక్షసపిశాచాదులవలన నెట్టిబాధలును గలుగవు. దేవీ! మత్సేవకులును, యోగవిషయంబున మత్సదృశప్రభావసంపన్నులు నగు వీరందఱును విభూతిస్నానమాహాత్మ్యము చేతనే మదనుచరులు గాఁగలి

గిరి. మద్విభూతినుండి యుత్పన్నంబైనస్వర్గము పరిమితఫలప్రదాయక మైనది. కాని నావిభూతిమాత్రము వివిధపుణ్యఫలప్రదానసమర్థమైనది. విభూతినే యాధారముగజేసికొనియుండుమద్భక్తులయుత్తమకార్యములకు రాక్షసులైనను విఘ్నముల నాపాదింపఁజాలరు. పరమంబగువిభూతినాశ్రయించియుండువారు నాయాజ్ఞానువర్తులై మదీయంబగు నుత్తమలోకమునందు యథేచ్ఛావిహారములం గావించుచుందురు. ఓవామలోచనా! స్నానము లన్నిటియందును విభూతిస్నానమే సర్వోత్కృష్టమైనది. విభూతిస్నానమువలన నెట్టిఫలము లభించునో యావిషయంబంతయును గణేశ్వరుఁడు బాగుగ నెఱుంగును. గంగానదివంటితీర్థమును, వేదమువంటి శ్రుతులును, మృత్యువువంటి శాసకులును నెట్లు లేకుందురో యట్లే విభూతితో సమం బగుతపంబు మఱియొకటి లేదు. హింస్రజంతువులు పరహింసితమును, ప్రమత్తము నగుజంతువు నెట్లు హింసింపక విడిచినైచునో యట్లే విఘ్నసమూహములు విభూతిస్నానము చేయువానిని స్పృశింపఁబోవు.

ఓకమలదళలోచనా! నేనీవిధముగాఁ బరమమునీంద్రుం డగు పర్ణాదు ననుగ్రహించుటకే నాసకలాంగకములయందును విభూతివిలేపనముం గావించుకొంటిని. ఓహిమాచలతనయా! ఈవిభూతి యేవిధముగా నుత్పన్నం బైనదో, యేకారణముచే నాకది యంగరాగం బైనదో యాపూర్వవృత్తాంతమును నీకిప్పు డెఱింగించితిని. మానవులుగాని, దానవులుగాని, మఱి యెవ్వరుగాని నాకతిప్రియం బగునీభస్మస్నానము నుపాసింపఁగలుగుదురేని మత్ప్రియభక్తు లగుచుట్టివారు నాప్రమథగణంబులలో శ్రేష్ఠులును, సూర్యచంద్రాగ్నిసదృశతేజస్సంపన్నులును, దేవగంధర్వసిద్ధగణప్రపూజితులును, రమణీయాకారులు నై యుందురు.

## —: రుద్రవృత్తాంతకీర్తనము. :—

పవిత్రియుఁ గమలదళవిశాలలోచనయు, గిరీంద్రనందనయు, నగుదుర్గాదేవి విభూతిసంబంధమగునుపాఖ్యానము నాకర్ణించి వెండి యుఁ బతి యగుపశుపతినుద్దేశించి యిట్లనియెను. ఓపరమేశ్వరా! సకలజీవులకు నంత్యకాలనివాస మైనట్టియు, శవదహనధూమముచేఁ గన్నులను మండించునట్టియు, వేలకొలఁదిచితులయందుఁ బ్రజ్వలించుచున్నచితానలజ్వాలలచే నతిభయంకర మైనట్టియు, ఎల్లదెసలయందును సిద్ధచారణాదులచే సంకులీకృత మైనట్టియు, మృతకళేబరములనరములచేతను, గుల్లినమాంసఖండములచేతను దుర్గంధదూషితమైనట్టియు, వినిందితభూతప్రేతాదులచే సమాకీర్ణమైనట్టియు, మేదోరుధిరంబులచేఁ బంకిలమైనట్టియు, శివారవంబులచే నతిభీషణమైనట్టియు, కాకోలూకశతంబులచే నాకులమైనట్టియు, నానావిధమృగవిహంగాదులచే నాకీర్ణమైనట్టియు, శ్వానభైరవారావంబులచేఁ బ్రతిధ్వనితం బగునట్టియు, పశుశతంబులగునంగకములుగలశవమాలికలచే నిండియున్నట్టియు శ్మశానప్రదేశమునందు రాత్రికాలంబున వసాపూర్ణంబులగుకపాలములను జితానలంబుపై నుంచి మహిషమును బచనముసేయుచు, భయంకరాట్టహాసపూర్వకముగా నానందతాండవం బాచరించుచు సర్వభూతభయంకరుండవై యేకకాలంబున సకలదానవగణసంహారముం గావించువాఁడవుం బోలి యేల యున్మత్తవిహారంబు గావింతువు? ప్రభుగణంబులకెల్లను బ్రభుండ వగునీవు శుద్ధశాంతస్వభావుండవయ్యు నట్టియపవిత్రస్థానమునం దున్మత్తునిం బోలి యేలశయనించియుందువు?

ఓపరమేశ్వరా! ఇట్టియకార్యంబు గావించుట నీవంటివాని కుచితముగా నున్నదా? ఆప్రదేశమునందుఁ గుశాస్తరణంబులపై మృతవ్యక్తులనుద్దేశించి విడువంబడినపిండంబులును, బ్రాహ్మణశవంబులయజ్ఞ

సూత్రములును నిపతితంబులై యుండును. ముసలములు, నులూఖలము లు నందందుఁ బొరలాడుచుండును. శృగాలసమూహంబులు శ్రుతికఠోరంబుగాఁ గూతలువెట్టుచుండును. ఆజ్యాహుతిప్రదానంబులచేఁ జాతానలంబులు ప్రజ్వలితంబు లగుచుండును. మృతకళేబరసంపర్కముచే నపవిత్రంబులగుమంచములు, పీటలు, చేటలుమొదలగునవి యందందుఁ బడియుండును. మృతదేహములయందలి వస్త్రవిభూషణాదులందందుఁ జెదరి పడియుండును. మహారణ్యమధ్యమునఁ గ్రూరమృగంబులకుఁగూడ నతిభయంకరమును, దుర్గంధపూరితమును, దుర్గమమునగునాప్రదేశము రౌద్రాద్భుతభయానకబీభత్సరసంబులకు లీలాభూమియైయుండును.

ఓనాథా! నీవు వేదవేద్యుండవును, త్రిలోకనాయకుండవు నగు మహాదేవుఁడవు. నీపవిత్రనామమును, దివ్యచరిత్రమునుగూడ సర్వజనస్తువనీయములైనవి. అట్టిమహాత్ముండ వగునీవిట్టియసత్కార్యము నాచరించుట యనుచితముగా నున్నది. పరమేశ్వరా! నీయాజ్ఞానుకారిణినగుసహధర్మిణినగుటచేఁ ద్రిలోకపూజ్యురాల నైననాకుఁగూడ నీయనాచారము హృదయసంతాపకరముగాఁ దోఁచుచున్నది. సర్వదేవమయా! సకలదేవతలును నిన్నారాధించి తరించుచుండుటచే నీవు మహాదేవనామముచేఁ బ్రసిద్ధుండవైతివి. అట్టినీప్రవర్తన మంతనింద్యముగాఁ దోఁచుటకు నిమిత్తమేమి? జగదీశ్వరా! ఇట్టికుత్సితాచారుఁడ వగునీవుమహాదేవుఁడ వెట్లైతివి? ఇట్టియకార్యంబులు దేవోచితంబులు గానేరవు. కావున నీవంటివాఁడిట్టికార్యాచరణంబునకుఁ గడంగుట కేదియో మహత్తరకారణం బుండవలయును. దేవదేవా! ఇది యంతయు నాకవేద్యము గాకున్నది. నాయందుఁ గరుణించి యీరహస్యవిషయమును విస్పష్టముగా నాకెఱింగింపఁ గోరెదను.

అని పార్వతీదేవి యనేకవిధంబులఁ బ్రార్థించుటయు మహాదేవుండు మందహాససుందరవదనారవిందుండై వికసితనయనంబులనుండి కరుణాకటాక్షముల నద్దేవిపైఁ బ్రసరింపఁజేయుచు నిట్లు చెప్పఁదొడంగెను. ఓగౌరీ! తపఃకాలస్వరూపుఁడను, గరాళవదనుండను నగునేను పూర్వకాలంబున రౌద్రిముహూర్తాసన్నకాలమునందు వికటస్వరముతో రోదనము చేయ నారంభించితిని. అప్పు డనాదిపురుషుండును, అవ్యయుండును, సనాతనుండు నగునాదిదేవుండు నన్నుం గాంచి కుమారా! నీవే కారణముచే భయార్తుండవై యిట్లతిఘోరముగా రోదనము చేయుచుంటివి? అని యడుగుటయు మహాశక్తి యగునద్దేవుం గాంచి మహాదేవా! నాకుఁ దగిననామకరణంబు గావింపుమని కోరితిని. అప్పు డద్దేవుండు నీవనిమిత్తంబుగా రోదనము గావించుచుంటివిగావున నింతటినుండి రుద్రినామంబున విఖ్యాతుండవు గాఁగలవని యానతిచ్చెను.

ఓమహాశివే! అప్పుడు నేనటనుండి లేచి యింకను రోదనము చేయుచుండుటం గాంచి యాపరమేశ్వరుండు మరల నిట్లనియెను. ఓనీలలోహితా! యింకను నిట్లేడ్చుచుండుటకుఁ గారణమేమి? శోకంబును విడువుము. నీకోరిక యేమో తెలుపుము. నేను దానిని దీర్చెదను. అని యమ్మహాదేవుం డానతిచ్చుటయు నేనిట్లు దుఃఖించుచునే నాకింకను నామప్రదానంబు గావింపవలయు నని యడిగితిని. అప్పుడమ్మహాపురుషుండు నాకు మఱియును సప్తనామంబులను బ్రసాదించెను. ఓదేవీ! అప్పటికిని నేను రోదనమును విడువకుండుటం గాంచి లోకేశ్వరుండగు నాకేశవుండు స్వయముగా నాచేయి పట్టుకొని యొకతేవిధముగ రోదనము గావించుచున్న నన్నుం గాంచి నీవు మాటిమాటికి నిట్లేల విశేషముగ రోదనముం గావించుచుంటివి? నీయీరోదనమునకు నిమిత్తమేమి? అని యడుగుటయు నాకింక ననేకములగు నామముల ననుగ్రహించి విద

తాత్ముం డగు నమ్మహాపురుషుండు నాహృదయాభిప్రాయము నెఱింగి నీవు సకలదేవగణంబులకును బ్రధానుండవై మహాదేవనామంబున వి ఖ్యాతుండ వగుమని యుపదేశించెను. అప్పుడు నేను నాఁడాదేశమును జాలించితిని.

ఓప్రియా! నాకప్పుడు లభించినపవిత్రనామంబులయర్థంబు సర్వంబు నెఱింగించెద నాకర్ణింపుము. నేను సుందరీజనపరిత్యక్తుండనై యపవిత్రపదార్థంబుల నర్థించుచు లోకవిద్రావణుండనై విహరించు టంజేసి రుద్రుండనియు, ప్రళయకాలంబున సకలభూతసంహారంబు గావించుచుండుటంజేసి హరుండనియు, "శౄ- సౄ-" అనుధాతువులు గ్రసనార్థబోధకంబులుగావున నంత్యకాలంబున నేను సర్వలోకాగ్రస నంబు గావించుచుండుటంజేసి శర్వుండనియు, సర్వుండనియు, కాల స్వరూపుండనై విహరించుచుండుటంజేసి మహాకాలుం డనియు,పూర్వ భవంబులఁ దలపించి జ్ఞానసంపాదనార్థమై సాధువులగుపండితులహృద యంబులయందు భయోత్పాదనంబు గావించువాఁడ నగుటంజేసి భవుం డనియు, శ్రేష్ఠంబులగుబలిప్రదానాదులచేతనే యుగ్రత్వమును ద్యజించువాఁడనగుటంజేసి యుగ్రుండనియు, మహత్పదార్థములన్నిటి కంటెను మహాత్ముండనై మహీంతలాదిసకలలోకంబులకును మహేశ్వ రుండనై, మహాశబ్దనిరతుండనై విరాజిల్లుచుండుటంజేసి మహాదేవుం డనియు, ఈశ్వరులకు నీశ్వరుండను, సృష్టిస్థితిప్రళయకారణుండను నగు టంజేసి పరమేశ్వరుండనియుఁ బవిత్రనామంబులచేఁ ద్రిభువనంబుల యందును విఖ్యాతుండనై యుంటిని. దేవీ! లోకంబులకువిరుద్ధములగు కర్మముల నాచరించుచుండువాఁడనగుటంజేసి నాకు రౌద్రకర్ముం డను నామము నిర్దిష్టం బయ్యెను.

ఓహైమవతీ! నాకతిప్రియంబులగునీపవిత్రనామము లతిగోప్య

ముఖ్యమైనవి. ఈదివ్యనామములతో శ్మశానప్రదేశములందు నన్నుఁ బూజించువాఁడు సకలదేవతాగణపూజితుఁడై బ్రహ్మాదిలోకేశ్వరులతోఁ దుల్యప్రభావుండు గాఁగలఁడు. ఈపావననామములను బత్త్రమునందు లిఖించి ధారణము గావించువారు నిత్యగాణపత్యపదప్రాప్తు లగుదురు. ఫలాకాంక్షను బరిత్యజించి విధివిధానానుసారంబుగాఁ గావించినసత్కర్మంబులు సుప్రసిద్ధంబులు గాఁగలవు. అట్లుగావించువానికాకర్మంబులవలనిశుభాశుభఫలభోగానుభవము లేకుండును. పురుషునకవశ్యకర్తవ్యములని విధింపఁబడిన కర్మములు సుసాధ్యములైనను, దుస్సాధ్యములైనను నగుఁగాక. వానిని బురుషులు ముఖ్యముగా నాచరించితీరవలయును. లోకకర్తయగువిధాత్రనాజ్ఞకు వ్యతిరేకముగ జరిగించుట కెవ్వరును సమర్థులు గాఁజాలరు. సకలభూతంబులు నాతనికి వశీకృతంబులై యుండును. ఆతఁడు సకలజీవులకును స్వస్వధర్మంబుల నుపదేశించుచుండును.

ఓవరిష్ఠ! ఇక్కలికాలంబున నేనుగూడ నమ్మహాపురుషుని యాదేశానుసారంబుగనే కర్మాచరణంబుఁ గావించుచుందును. ప్రజాసంహారకారిణగునేను గాలస్వరూపుఁడను. నాసహధర్మిణి వగునీవు కాలరాత్రిస్వరూపిణివి. దేవీ! నీవు నన్ను బాగుగ నెఱుంగుదువు. నేనును నిన్ను విశేషించి యెఱింగియుంటిని. నారాయణపదత్రయపరిమిత మగునీభువనత్రయము మత్స్వరూపము. ఆచారము నీతికి విరుద్ధంబు గాకుండునట్లు విధాతచే నాకీయుచితకర్మము విధింపఁబడినది. పుణ్యమయంబును, రమణీయంబును, సిద్ధక్షేత్రస్వరూపము నగుశ్మశానభూమియే నాకతిప్రియం బగుటంజేసి నేనిందు నిరంతరమును సుఖవిహారంబు గావించుచుందును. ఈగణాధ్యక్షులందఱునుగూడ నందే విశేషసుఖులై యుందురు. వీరికోరికచేతనే నేనుగూడ నందుండెద

మానందానుభవముం గాంచుచుందును. అందుచేతనే శ్మశానము నాకతిప్రియతమస్థానమైనది. విధాత యెవ్వని నేవిషయమున నియోగించునో యాతఁడు దానినే యవలంబించి స్వచ్ఛందముగ విహరించుచుండును. ఆతని కదియే మహైశ్వర్యముగదా! నేను శ్మశానమే హితకరమని భావించినట్లే యందఱును విధాతృదత్తములగువిషయములు విమలగుణసంపన్నములుగా భావించి నిరంతరమును వాని నతిప్రియముగా నవలంబించి చరించుచుందురు. విభూతిస్నానముచే నాగమశుద్ధితీర్థాదులమూలమునం గలుగుపుణ్యఫలంబు లభించునని నేను చెప్పియుంటిని. అట్టివేదవిహితధర్మాచరణముం గావించువాఁడనగుటం జేసి నాకు దేవదేవుఁ డగుజగన్నాథునిదిక్కులము లభించుచుండును.

అని సదాశివుం డానతిచ్చుటయు నుమాదేవి ప్రమథార్తిహరుం డగుమనోహరుం గాంచి యోకాలకాలా! చంద్రకళావతంసా! కాలస్వరూపా! పృథివి, అగ్ని, చంద్రుఁడు, సూర్యుఁడు, ఆకాశము, వాయువు, లింగము మొదలగువానిని భక్తిపూర్వకముగాఁ బూజించువారికిని, నృత్యగీతాదులచే నిన్నారాధించి నిర్నిమేషనయనులై ధ్యానపూర్వకముగా నీకుఁ బ్రణామంబు లాచరించువారికిని, ఘృతము, దధి, క్షీరములు, సుగంధజలము, గోమయము మొదలగువానితో నీకభిషేకముంగావించువారికిని, గంధధూపమాల్యాద్యుపచారంబులచే నిన్నర్చించువారికిని లభించుపుణ్యఫలం బెట్టిది? అపర్యుషితంబు లగుపుష్పమాల్యములను నీకర్పించువారి కెట్టిపుణ్యఫలంబు లభించును? దేవా! నాయెడలఁ బ్రసన్నుండవై యీసమస్తవిషయంబులును సవిస్తరంబుగా నాకెఱింగింపవలయు నని ప్రార్థించెను.

ఉమాపతియగు మహాదేవుండును దేవివాక్యంబుల నాకర్ణించి మధురప్రియభాషణంబులచే నామెను సంబోధించుచు నోసుభాషిణీ!

నేను నీయడిగినప్రశ్నంబుల కన్నింటికిని సదుత్తరంబుల నొసంగెద
నావధానచిత్తవై యాలకింపుము. దేవీ ! నాకు భక్తుం డగువాఁడు
నీయెడలను భక్తియుక్తుండై యున్నవో నాతనిసకలకర్మంబులను సంప
న్నంబులు గాఁగలవు. ఈవిషయమును నీవును బాగుగ నెఱుంగుదువు.
ఎంతటివేదవిద్వరులైనను నితరులీయర్థంబు నెఱుంగఁజాలరు. నాభక్తు
లయెడల నెవ్వరుభక్తిగౌరవములు గలిగియుందురో వారిని నేను భవాం
బుధినుండి తరింపఁజేయుచుందును. ఇఁక స్నానపూజాదులఫలంబుం
గూర్చి చెప్పెద నాకర్ణింపుము.

ఓపార్వతీ ! సుగంధజలంబులచే నన్నభిషేకించువాఁ డగ్నిష్టో
మముం గావించినఫలంబు నందఁగలఁడు. సుగంధతైలముచే నన్నభి
షేకించువాని యెడల నేను ప్రసన్నుండనై వానికతిరాత్రియజ్ఞఫలం
బును బ్రసాదింతును. మధువుతో నన్నభిషేకించువానికి వాజపేయ
యజ్ఞఫలంబు సిద్ధించును. అర్చారూపంబున నన్నుఁబూజించువాఁ
డశ్వమేధఫలంబుం గాంచి స్వర్గలోకంబునఁ బూజ్యుఁడగును. ఈవి
శ్వమంతయును లింగమయంబని యెఱింగి యెవ్వఁడు నాలింగస్వరూ
పము నారాధించునో యాతనికంటె నాకతిప్రియు లగువా రెవ్వరును
లేరు. చతుర్దశియందు ఘృతదుగ్ధదధితైలజలంబులచే నన్నభిషేకించు
వారు దేవతుల్యులు, అజరులు, అక్షయులు, అమరులు, విశ్వవిజ
యులు, నాకతిప్రియతములు నై యుందురు. ఏకాగ్రచిత్తముతో, శివ
లింగమును బూజించువారు బ్రహ్మవిష్ణులోకములందును, గోలోక
మునను, అమరలోకంబునందును స్వేచ్ఛావిహారులై యుందురు. శివలిం
గము నారాధించువారిని మహేంద్రుఁడును, సోముఁడును, భగుండును,
పూషుండును, అనిలుండును, అనలుండును, దివాకరప్రభృతిదేవత
లును బూజించుచుందురుగావున మానవులు సర్వదా శివలింగార్చ

సము గావించుచుందురు.

ఓదేవీ! లింగస్వరూపమున నన్నుఁ బూజించువాఁడు గంధర్వులయు, నప్సరస్సుందరులయు గీతవాద్యములచే సేవింపఁబడుచుండును. ప్రతిమారూపమున నన్ను శతవత్సరములపర్యంతము బూజించినఫలము, లింగస్వరూపముచే నన్నొకదినమాత్రము పూజించుటచే లభింపఁగలదు. శివలింగపూజార్థమై యుపహారములను సేకరించువాఁడు గాణపత్యపదప్రాప్తుండై యభిలషితోపహారంబుల ననుభోగించుచుండును. పర్యుషితంబు లగుపుష్పమాల్యాదులను శివలింగమునుండి యపనయించువాఁడు స్వర్గలోకమునందు బహుకాలంబువఱకును సుఖభోగముల ననుభవించుచుండును. శివలింగమున కుపహారంబులను, వివిధములగు పుష్పమాల్యాదులను సమర్పించువారును, దధిక్షీరఘృతాదులచే శివలింగము నభిషేకించువారును, విశుద్ధభావముతో మాటిమాటికి శివలింగమును బూజించువారును మిగులఁ బరిశుద్ధమూర్తులై స్వర్గమునధిగమించి ప్రశంసనీయులై విరాజిల్లుదురు. ఓదేవీ! నేను నీతోఁ గలసి యెట్లువిలాసవిహారముం గావించుచుందునో యట్లే వారును స్వర్గమునందుఁ దమతమభార్యలతో సుఖవిహారముం గావించుచుందురు. లింగశరీరము నారాధించువాఁడు దేవాదిదేవుండ నగునాకుఁ బుత్రస్వరూపుఁడు గాఁగలఁడు.

ఓకాంచనాంగి! లింగార్చనతోషంబున నన్ను సంతుష్టునిం గావించువారికి బ్రాహ్మణత్వమన నెంత? అట్టిపుణ్యపురుషులకుఁ బొందరానిదేదియును లేదు. దేవీ! నీవేవిషయములను వినవలయునని విశేషముగఁ గుతూహలపడుచుంటివో వాని నన్నిటిని సంపూర్ణముగా నెఱింగించితిని. పర్వసమయములయందు బ్రహ్మసభామధ్యంబునఁ బూజాప్రశంసాదులం గావించి వేదపాఠసహితముగా నీయధ్యాయమును

జరించువారు దేహాంతమునందు మత్సాయుజ్యలాభముంగాంచఁగలరు.

—: అష్టషష్టి క్షేత్ర వివరణము. :—

మందరాచలమున సుఖోపవిష్టుండై యున్నమహాదేవుని సందర్శించి బ్రహ్మదేవుండు స్వామీ! నీవేయేక్షేత్రములం దేయేరూపములతో సాక్షాత్కరించుచుందువో యెఱింగింపవలయునని ప్రార్థించుటయు మహేశ్వరుం డిట్లనియె.

ఓవనజాసనా! నేను వారాణసియందు మహాదేవరూపమునను, ప్రయాగయందు మహేశ్వరరూపమునను, నైమిశక్షేత్రమునందు దేవదేవస్వరూపమునను, గయాతీర్థమునందు బ్రపితామహరూపమునను, కురుక్షేత్రమునఁ గాలేశ్వరరూపమునను, ప్రభాసమున శశిభూషణరూపమునను, పుష్కరమునం దయోగంధరూపమునను, విమలేశ్వరమందు విశ్వరూపమునను, అట్టహాసక్షేత్రమునందు మహానాదరూపమునను, మరుత్కోటియందు మహోత్కటరూపమునను, శంకుకర్ణంబున మహాతేజోరూపమునను, గోకర్ణమునందు మహాబలరూపమునను, రుద్రకోటియందు మహాయోగీశ్వరరూపమునను, స్థలేశ్వరమున మహాలింగరూపమునను, అవంతియందు మహాకాలరూపమునను, మధ్యమేశ్వరమున శర్వరూపమునను, కేదారమునం దీశానరూపమునను, హిమాలయమునందు రుద్రరూపమునను, సువర్ణాక్షమునందు సహస్రాక్షరూపమునను, వృషక్షేత్రమునందు వృషభధ్వజరూపమునను, భైరవక్షేత్రమునందు భైరవరూపమునను, భద్రపథమునందు భద్రాకారమునను, కనఖలక్షేత్రమునం దుగ్రాకారమునను, భద్రకర్ణహ్రదంబున శివాకారమునను, దేవదారువనంబున భిన్నాకారమునను, కభిజంగిలంబున చండాకారమునను, పురండక్షేత్రమునందూర్ధ్వకేతుమూర్తితోడను, మంగళాండము

నందు గపర్దిమూర్తితోడను, కృత్తివాసక్షేత్రమునందు వరదాకృతితోడను, ఆమ్రాడికేశ్వరమునందు సూక్ష్మాకృతితోడను, కాలంజరక్షేత్రమున నీలకంఠాకృతితోడను, ధ్యానసిద్ధేశ్వరమున యోగాకృతితోడను, ఉత్తరేశ్వరమున గాయత్ర్యాకృతితోడను, కాశ్మీరమున విజయరూపముతోడను, మరుకేశ్వరమున జయమూర్తితోడను, యమాంగక్షేత్రమున స్థాణుమూర్తితోడను, కరవీరక్షేత్రమున గాపిలమూర్తితోడను, కాయావతారక్షేత్రమున లగుడస్వరూపముతోడను, దేవికాక్షేత్రమునం దుమాపతి, హరిశ్చంద్రేశ్వరరూపములతోడను, పురచందక్షేత్రమున శంకరమూర్తితోడను, కాలేశ్వరమున జటిమూర్తితోడను, కుక్కుటకేశ్వరమున సౌమ్యమూర్తితోడను, సంధ్యాక్షేత్రమున దామ్రమూర్తితోడను, బదరికాక్షేత్రమున త్రిలోచనమూర్తితోడను, జలేశ్వరమున త్రిశూలమూర్తితోడను, శ్రీశైలమున త్రిపురాంతక మూర్తితోడను, లింగక్షేత్రమున బశుపతిమూర్తితోడను, అంగేశ్వరమున దీప్తమూర్తితోడను, గంగాసాగరక్షేత్రమునం దమరమూర్తితోడను, అమరకంటకక్షేత్రమునం దోంకారమూర్తితోడను, సప్తగోదావరీక్షేత్రమున భీమమూర్తితోడను, పాతాళమునందు హాటకేశ్వరాకృతితోడను, కర్ణికారక్షేత్రమున గణాధ్యక్షాకృతితోడను, కైలాసమున త్రిపురాంతకాకృతితోడను, హేమకూటమున విరూపాక్షాకృతితోడను, గంధమాదనమున భూర్భువస్స్వరూపముతోడను, దడేశ్వరమునం దనలస్వరూపముతోడను, స్థలేశ్వరమునందు జ్వలల్లింగస్వరూపముతోడను, భూతేశ్వరమునందు గణాధ్యక్షాకృతితోడను, కిరాతక్షేత్రమునందు గైరాతాకృతితోడను, వింధ్యాచలమునందు దానవవినాశార్థమై వరాహాకృతితోడను, గంగాద్వారంబున హిమస్థానాకృతితోడను, బదరాముఖంబున మాధవాకృతితోడను, తీర్థమునందు త్రైస్థికోటీశ్వరాకృతితోడ

ను, ఇష్టకాపథంబున విశిష్టాకృతితోడను, కుసుమపురంబున బ్రిహాసాకృతితోడను, లంకయందు పలకేశ్వరాకృతితోడను, నివసించి యుందును. ఈవిషయమును మహాత్ముండగు బ్రహ్మయు, సకలపౌరాణికులును గానము చేసియున్నారు. నియమపూర్వకంబుగా విశుద్ధహృదయములో నుభయసంధ్యలయందును దీనిని పారము సేయువాఁ డేకకాలంబున దశాశ్వమేధంబులు గాంచినపుణ్యఫలంబును బడయఁగలఁడు.

## —♦ శివవిభూతిమాహాత్మ్యము. ♦—

నానారత్నవిభూషితంబగు మందరాచలశిఖరమునం దాసీనుఁడై యున్న దేవదేవుం డగుమహేశ్వరుని నందీశ్వరుండు సందర్శించి సకలదేవతాధీశ్వరా! త్రిపురాంతకా! భవదీయం బగువిభూతిం (ఐశ్వర్యము) గూర్చి యనుగ్రహపూర్వకముగా నాకు బోధింపవలయు నని ప్రార్థించుటయు భక్తసులభుండగు మహేశ్వరుం డిట్లనియెను.

నందీశ్వరా! నావిభూతిమాహాత్మ్యముం దెలిపెద నాకర్ణింపుము. నేను నిరంతరము సన్నిపారికారకోటిచే నావృతుండనై యుండి సురాసురగణసమక్షమునఁ జతుస్సముద్రముద్రిత మగునీభూమండలమంతటను నిస్సంశయముగా సంచరించుచుందును. అనావృతంబులగు చత్వరాదిస్థానములయందు యథేచ్ఛముగ నివసించియుందును. మఱియు దేవీసహితుండనై పరమానందముతో నెల్లప్పుడును బర్వతములయందు విహరించుచుందును. అట్టినన్నుద్దేశించి భక్తితోఁ బ్రదక్షిణంబు గావించువాఁడు నూఱుగోదానములు గావించినఫలముం గాంచఁగలుగును. మఱియు నాతఁడు శతసహస్రగోదానఫలప్రాప్తిం గాంచు ననుటకును సందేహము లేదు. నేను చంద్రుఁడను; సూర్యుఁడను; నిరంతరము నీపృథ్వియందు నివసించి యుందును. నేనే దినమును, రాత్రి

యు, సంధ్యలును, గాలమును, మృత్యువునై యుంటిని. ప్రళయకాల మునందైనను నాకు వినాశనంబు లేదు. వేదవాదులు నన్ను ఛంద స్స్వరూపునిగా వ్యవహరించుచుందురు. నేనిందియస్వరూపుఁడనై విషయంబుల నుపభోగించుచుందును. నేను నిత్యానిత్యస్వరూపుఁడ ను; సర్వభూతవిజయుండను, మఱియు వినాశకుండను. దేవతలును దానవులును, పవనుం డును, దహనంబును నాస్వరూపములే. నేను వాయురూపుఁడనై మేఘసంచాలనమూలంబున జలమును వర్షించు చుందును. నేను జలస్వరూపుఁడను. నేను సకలభూతంబులను సృష్టించి ప్రతియుగమునందును సంహరించుచుందును. నామాయాబలంబుచే జీవులు శతసహస్రగర్భంబులఁ బరిభ్రమించుచుందురు. నేను గోపించి నవో ఖేచరు లంతయును భూపతితులై పోవుదురు.

నిశ్వాసపవనమాత్రముననే త్రిభువనములను గంపింపఁజేయుసా మర్థ్యముగలనేను మహాబలుండనై సకలదానవసమూహమును నశిం పఁజేయుచుందును. నిశ్చయంబుగా నేను సకలభూతసంక్షయంబు గా వించుచు మరల సర్వభూతములను యథాస్థానమున నెలకొల్పుచుం దును. వేదపురాణేతిహాసాదులు నానిత్యనివాసంబులై యుండును. నేను లేనిప్రదేశ మేదియును లేదు. నేను సర్వదా నాభక్తగణంబుల యెడలను, నన్నాశ్రయించినభూతగణంబులయెడలను, నిశ్చలచిత్తము తో నన్నారాధించుచుండువారియెడలను బ్రసన్నుండనై వారికి గాణ పత్యపదంబును బ్రసాదించుచుందును. నేను సర్వదా పుష్పితలతల యందును, ఫలవృక్షములయందును, నారీమణులరూపయౌవనముల యందును నివసించియుందును. నే నేకకాలమునందే నియోజ్యనియో జకభావములతో భృత్యుండను, ప్రభుండనుగూడ నై యుందును. అహంకార, దర్ప, దంభ, స్నేహ, తమోగుణస్వరూపుఁడను నేనే.

ఓ నందీశ్వరా! మదీయంబగు నీవిభూతిమాహాత్మ్యమును శ్రద్ధాభక్తులతోఁ బఠించువాఁడు సర్వతీర్థగమనఫలంబును, సకలోపవాసానుష్ఠానఫలంబును గాంచఁగలఁడు. ఆతని కెట్టివ్యాధులును గలుగఁబోవు; ఆతనికిఁ దీరనికోరిక లేవియు నుండవు. బ్రహ్మచారులు, సత్యవాదులు మొదలగువారికి లభించు సకలపుణ్యఫలంబులు నాతనికి సిద్ధింపఁగలవు. మహాత్ముఁ డగునాతఁడు, సర్వజనశ్రేష్ఠుఁడై, జరామరణవివర్జితుఁడై, సకలపాపవిముక్తుఁడై రుద్రలోకమునఁ బూజాభాజనుండు గాఁగలఁడు.

—♦ ధ్యా న ఫ ల క థ న ము ♦—

సనత్కుమారుం డిట్లనియెను. ప్రమథగణసహితుం డగుమహేశ్వరునిం బోలి యెవ్వరాత్మీయజనపరివృతులై శాంతభావముతో సుఖాసీనులై సత్కర్మములనాచరించుచుందురో యట్టివారు తమకర్మప్రభావముచే సకలదానఫలంబులను, సకలశుభములను, సకలశుభలోకనివాససుఖంబులను గాంచఁగలుగుదురు. చండాలురు, శూకరపక్షిపోషకులు, క్రవ్యాదులు, సర్పోపజీవులు మొదలగునట్టినీచవృత్తులైనను శివభక్తులైనచో సర్వపాపవిముక్తులై సర్వోత్తమగతిలాభంబు నందఁగలుగుదురు. వ్యాసమునీంద్రా! మహాదేవునకుఁ బ్రణామం బాచరించి మానవుల కధ్యాత్మధ్యానయోగంబులభించువిధానము నెఱింగించెద నాకర్ణింపుము. తమతమకర్మంబులననుసరించిపోవుచుండు మానవు లీధ్యానయోగము ననుభవపూర్వకముగా గ్రహించునంతవఱకును సంసారచక్రమునఁ బరిభ్రమించుచునేయుందురు. అసురులును, దేవతలును, ఋషులును, పితృదేవతలును, బ్రహ్మాదిదేవగణంబులును ధ్యానప్రభావముచే విరాజిల్లుచుండువిధంబుననే గృహస్థులు, బ్రహ్మచారులు, వానప్రస్థులు, భిక్షుకులు మొదలుగాఁగల మానవులుగూడ ధ్యానయోగబ

లంబున వేదవ్యాసమానులు గాఁగలరు. అట్టివారెంతమాత్రమును గర్మ లిప్తులు గాకుందురు. బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులును, సంకీర్ణజా తులునుగూడ ధ్యానమహిమచేతనే తేజస్సంపన్నులగుదురు. మఱియుఁ జండాలాదులును, నిరంతరపాపకర్మరతు లగునీచజాతులవారునుగూడ ధ్యానప్రభావముచే నుత్తమలోకప్రాప్తులగుదురు. వారిపాపములన్ని యును దగ్ధము లైపోవును. వాగాడంబరవిరహితంబును, బరమగుహ్యం బును, సారభూతంబు నగు నీవక్ష్యమాణప్రబంధమును బఠించి గ్రహిం చినవారు పాపకర్మరతులగువారైనను గూడఁ బరమసిద్ధులు గాఁగలరు.

సాత్యవతేయా! నీయందలి స్నేహముచే మోక్షద్వారస్వరూప మగుధ్యానయోగముంగూర్చి ప్రశంసించెద నాలకింపుము. గురుజనుల నవమానించుమూఢుల కీపవిత్రధ్యానయోగంబు విహితము గానేరదు. ధ్యానయోగమును నవలంబించి మహాపాతకము, బ్రహ్మహత్య, సురాపా నము, గురుతల్పగమనము, బహుజీవజంతుహింసనము, మొదలుగా గలమహాపాపసమూహమును, శుష్కకాష్ఠసంచయమును వైశ్వానరుఁ డునుంబోలె నిమిషములో దహింపఁజేయుటకు సమర్థుం డగును. సువా రీదూషణము, మాతంగగమనము, మొదలగుపాతకములు కేవలధ్యాన మాత్రముననే నశింపఁ గలవు. ప్రదీప్తానలము బంగారము నెట్లు పరిశు ద్ధముగాఁ జేయునో యట్లె ధ్యానయోగియగువాఁడు, అభక్ష్యభక్షణ ము, అపేయపానము మొదలుగాఁగలపాపసమూహమును బరిశుద్ధము గాఁ జేయఁగలుగును. సముద్రమును జేరఁబోవునదులు తమమార్గముల నెట్లు లక్ష్యము సేయకుండునో యట్లే తత్ప్రస్థానము నాశ్రయింపఁదలఁ చుధ్యానయోగులు పాపములను లక్ష్యము సేయకుందురు. ధ్యానయో గవిధుల నెఱింగినవారియ్యును వారనాయాసంబున మోక్షంబును బడయఁ గలరు. వారు బ్రహ్మవిష్ణులోకములనుండిఁగాని, చంద్రసూర్యేంద్రాదిదేవ

పవిత్రుం డగు నొక్కయోగవిదుం డెవ్వనిమఖశాలయందు భుజించి సంతృప్తింగాంచునో యాతనియజ్ఞం బాక్షణమునందే సర్వసంపన్నంబు గాఁగలదు. ధ్యానాసక్తుండు గానివాఁడు పాపరతుండగును. మూఢాత్ముండగువాఁ డెల్లరియొద్దను బ్రతిగ్రహంబు సేయుచుఁ బాపగ్రస్తుం డగుచుండును. ధ్యానియగువాఁ డెవ్వనింగూర్చి కోపించునో యాతనికి శుభంబులు గలుగవు. ఆతఁ డెవ్వనియెడలఁ బ్రీతుండగునో యాతని సద్వంశము పుత్రపౌత్రక్రమంబుగా వర్ధిల్లఁగలదు. ధ్యానయోగినియతుం డగువాఁడు దశదిశలయందును సంచరించుటకు సమర్థుం డగును. ధ్యానులగువారు జ్ఞానప్రదానముచే నితరులను బవిత్రులఁ గావింపఁ గలుగుదురు. వారిని బాపతమఃకల్మషంబు లంటనేరవు. మృగరాజములుపర్వతమునాశ్రయించిసుఖించునట్లుతత్త్వవిశ్వవిదులగుబ్రహ్మజ్ఞులు యోగము నాశ్రయించి యానందించుచుందురు. అనలుండు గ్రామవాటములందలిసకలపదార్థములను దహించియు వానిచే లిప్తుండు గాని విధంబున విశ్వవిదుండగువాఁడు సర్వకర్మంబుల నాచరించియు నిర్లిప్తుండై యుండును.

## యోగాఖ్యానము.

ఎట్టిధ్యానమువలన నుత్తమఫలము లభించునో, యేమంత్రమూలంబున నట్టిధ్యానము సిద్ధించునో, ధ్యాన మెన్నివిధములు గలదియో, అమరులగు బ్రహ్మవిష్ణుమహేశ్వరుల నెట్టిధ్యానముచే నెఱుంగనగునో పరమేశ్వరుం డుపదేశించినవిధంబున నానతీయవలయు నని సనత్కుమారుం డడుగుటయు నందీశ్వరుం డిట్లనియెను.

వామపార్శ్వంబున బ్రహ్మయు, దక్షిణపార్శ్వంబున విష్ణుండును, మధ్యప్రదేశమున రుద్రుండునుగా మువ్వురుపురుషు లు నేకాత్మ

లై యేకశరీరులై యేకీభవించి యుందురు. పూర్వాహ్ణంబున బ్రహ్మ దేవుని, మధ్యాహ్నమునందు విష్ణుదేవుని, సాయాహ్నమునందు రుద్ర దేవుని ధ్యానము గావింపవలయును. కాని యీముప్పురు నేకమూర్తులే. ఈత్రిభువనములయందును రుద్రవిష్ణుపితామహులు దేవదేవుని స్వరూపములు. లోకానుగ్రహంబుకొఱకును, భక్తజనులను బరిపాలించుకొఱకును దేవదేవుఁడు తనశరీరమును మూఁడువిధములుగా విభాగించి యుండెను. ఈమూఁడుమూర్తుల నేకమూర్తిగనే భావించి యెవ్వరు ధ్యానింతురో వారు రుద్రసాయుజ్యముం గాంతురవి మహాదేవుం డగుశివుం డానతిచ్చియుండెను. ఆదేవదేవుని నిర్వ్యాంబును నిర్మలహృదయంబున స్మరించుచుండువారు పాపవిముక్తులై యంతంబున స్వర్గధామముం జేరఁగలుగుదురు.

ధ్యానతత్పరులగువారు 'అ' కారము విష్ణుస్వరూపమనియు, 'ఉ' కారము బ్రహ్మస్వరూపమనియు, 'మ' కారము స్వయముగ రుద్రస్వరూప మనియు నెఱుంగవలయును. ఓంకారప్రయోగసమయమునందు ముందు 'అ'కారమును గొలఁదిగా నుచ్చరించి యనంతరము 'ఉ'కార 'మ'కారములను మాత్రాసహితముగ నుపయోగింపవలయును. అకారము హృదయమునం దుత్పన్నమైనంతనే, ఉకారమును దానితోఁ జేర్చి మకారమును మృదుస్వరముతో నుచ్చరింపవలయును. ఈవర్ణత్రయంబును గలసి ప్రణవరూపముగాఁ బరిణమించుచున్నది. అకారోకారసంయుత మగుమకారము బ్రహ్మజ్ఞానస్వరూప మనిచెప్పంబడియెను. మఱియు అకారోకారములను విడిచి మకారము ప్రత్యేకముగ నిలిచి విరాజిల్లుచుండును. అక్షరత్రయాత్మక మగునీయోంకారమును బరబ్రహ్మస్వరూపముగా భావించి ధ్యానించువానికిఁ బునర్జన్మంబు లేకుండును. యోగవిదుం డగువాఁ డోంకారమును హృదయ

ముందుంచి ధ్యానింపవలయును. ఓంకారనాథుఁ డగువాఁ డోంకారమునుండి బ్రహ్మస్వరూపమును దర్శింపవలయును. ఓంకారయోగముచే మనస్సు సర్వోత్కృష్టంబు గాఁగలదు. ఈవిధముగ సర్వేంద్రియములను నిగ్రహించి హృదయమునం దమ్మహాదేవు నంగుష్ఠమాత్రస్వరూపునిగా భావించుచు ధ్యానము గావింపవలయును.

మఱియు, సాంఖ్యశాస్త్రగుణవిశిష్టుండును, విఖ్యాతుండు నగుపురుషుని భ్రూమధ్యంబునను, అచ్యుతుండును, లోకపావనుండును, చంద్రప్రభుండు నగుపురుషుని లలాటమధ్యంబునను, అవ్యయుండును సూక్ష్మభావుండును ప్రభుండు నగుశివుని మస్తకంబునను భావించి ధ్యానింపవలయును. ప్రాణాయామ యోగము నవలంబించి యోంకారమును బ్రహ్మస్వరూపముగా భావించి ధ్యానింపవలయును. కేవలమాత్ర బ్రహ్మోచ్చారణమూలంబునఁ బ్రాంతబ్రహ్మము ప్రాప్తమగును గావున నట్లు గాకుండునట్లు యుచ్చారణంబు సేయుచుండవలయును. బ్రహ్మాత్రయాత్మకంబును, గుణత్రయాత్మకమును, స్థానత్రియాత్మకమును, అక్షరత్రయాత్మకమును, మాత్రాత్రయాత్మకమును, అర్థమాత్రాత్మకమును నగుబ్రహ్మము ననుభవముచే నెవ్వఁడు తెలిసికొనఁగలుగునో వాఁడే వేదవిదుండు. ఆత్మవిదుం డగువాఁ డట్లుచ్చారణంబు సేయుచున్నను నాత్మసంయమంబు గావించుకొని ప్రాణాయామమూలంబునఁ గాలకాలమువఱకును మాటిమాటికిఁ బ్రాణసంయమనము సేయుచు నిమేషమాత్రకాలమైనను ధ్యానయోగంబు గావింపవలయును. యోగవిదుం డగువాఁ డోంకారసంయోజనంబు గావించి నిత్యమును ధ్యానించుచుండవలయును. అట్టివాఁడు సకలసంసారబంధవిముక్తుఁడై యవ్యయుండగు శివపదంబును బడయఁగలఁడు.

బుధుం డగువాఁడు సుఖపర్వంబులగు తనసర్వేంద్రియములను

గాత్రము తం యంగకములనుం బోలి సంహృతంబులుగాఁ జేసి యాత్మ నునిర్వాతప్రదేశమునందలిదీపకళికవలెఁ బ్రకాశమానముగాఁ జేయవల యును. ధీరుం డగువాఁడు గుహ్యనిలినిస్వనుం డై విశుద్ధం బగునంతరాత్మ చేఁ దైలధారంబోలి యవిచ్ఛిన్నంబుగా నోంకారమును ధ్యానించు చుండును. అప్పు డాతనికి కంపమును, ఉచ్ఛ్వాసంబును, అంగవిక్షే పంబునుగూడ లేకయుండును. ప్రాణాయామముచే వాయువును శక్త్య నుసారముగా స్తంభింపఁజేసి ప్రత్యాహారముం గావింపవలయును. ఇట్లు ప్రాణాయామములచే మనం బునుగూడ స్థిరముగా వశపఱచుకొనవల యును. అకారోకారమకారములనుసిన్న త్రయమునం దొకొక్కటియే ప్రత్యేకముగ మూర్తిత్రయాత్మకములుగాఁ బరిగణింపంబడుచుండును.

అని నందికేశ్వరుం డుపదేశించుటయుఁ దపోధనుండగు సనత్కు మారుండు పరమానందంబునఁ బొంగి నందికేశ్వరుని గౌఁగిలించుకొని యభినందించి పరమేశ్వరుం డగుచంద్రశేఖరు ననేకవిధంబులఁ బ్రస్తుతిసేయ నారం భించెను.

—♦ యోగవిధి. ♦—

శివప్రోక్తంబు లగుసనాతనయోగశాస్త్రములను సవిస్తరముగా నాలకించుచున్న తపోధనుం డగుసనత్కుమారుండు వ్యాసునుద్దేశించి యిట్లనియెను.

వ్యాసమునీంద్రా! ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యాన ము, ధారణము, యోగము నను నివి పంచధర్మములుగాఁ బరిగణింపఁ బడుచుండును. మహాదేవుం డాంతిచ్ఛివినంబున నీపంచధర్మములకు ను బ్రత్యేకభిన్నస్వరూపలక్షణాదులను వర్ణించెను. పంచప్రాణనియ మ నల క్షణంబు ప్రాణాయామ మనియెను. అప్రాణాయామము

మందమును, మధ్యమము, ఉత్తమము అని మూఁడువిధంబులఁబరగుచుం డును. ద్వాదశప్రణవము లుచ్చరించుట కెంతసేపు పట్టునో యంత సేపటివఱకును బహిరవధ్యానమూలంబునఁ బ్రాణాపానాదివాయువుల నిరోధించుటయే ప్రథమం బగుమందప్రాణాయామము. చతుర్వింశతి మాత్రోచ్చారణకాలమువఱకు నట్లాచరించినచో ద్వితీయం బగుమ ధ్యమప్రాణాయామం బగుచున్నది. ముప్పదియాఱక్షరముల నుచ్చ రించునంతకాల మట్లు సాధించునది యుత్తమప్రాణాయామము. ఇది ప్రాణాయామభేదలక్షణంబు.

వనచరంబు లగుగజసింహాదిక్రూరమృగంబులును, జలచరంబు లగుమకరాదిజంతువులును యోగనిష్ఠుం డగుమహాత్ము నెంతమాత్ర మును బాధింపఁజాలవు. అట్టియోగీంద్రుం డెందును దోషలిప్తుండు గా కుండును. అశ్వములు, సింహములు, మదగజములు మొదలగువన జంతువు లుపాయమూలమునఁ గ్రమముగా మానవులకు వశీభూతము లై నిరంతరపరిచితంబులగువానివలెనే సంచరించుచుండునట్లు యోగా భ్యాసముం గావించువారికిఁ గాలక్రమంబునవాయువులు వశీభూతంబు లై పోవును. క్రమముగా నాతనికి వశ్యత్వసిద్ధి లభించును. ప్రాణాయా మాభ్యాసముచే దేహస్థితంబులగుసర్వదోషంబులను నశింపఁజేయు సా మర్థ్యము గలుగఁగలదు. తీర్థసేవనాదులు, నియమములు, వ్రతములు, యజ్ఞములు మొదలగుసత్కర్మములవలన నెట్టిఫలము లభించునో యేక ప్రాణాయామమూలమున నట్టిపుణ్యఫలము సిద్ధించును. ప్రాణాయా మములచే సకలదోషములును, ధారణలచే సకలకిల్బిషములును, ప్ర త్యాహారములచే సకలేంద్రియవృత్తులును, ధ్యానముచే సకలగుణము లును నశింపఁగలవు. కావున యోగతత్పరుఁడగువాఁడు సర్వదా ప్రా ణాయామాచరణంబు గావించుచుండవలయును. అట్లాచరించువాఁడు

సకలపాపవిముక్తుండై బ్రహ్మపదలాభముం గాంచఁగలుగును.

స్వస్తికాసనము, పద్మాసనము, భద్రాసనము అని యాసనములు మూఁడు విధంబులు. ఒకపాదమును రెండవపాదముపై నుంచి పాణితలంబులపై నిల్పియుంచి నిశ్చలచిత్తముతో స్థిరగ్రీవుండై పదములను సంగ్రహించి పాదతలముల నూరుజానుమధ్యంబుల నెలకొల్పి సమగ్రీవమస్తకుండై యున్నచో స్వస్తికాసనం బగును. ఊరుద్వయోపరిభాగమున నుభయపాదతలంబులను సంస్థాపించి వామహస్తముతో దక్షిణాంగుళిని, దక్షిణహస్తముతో వామపాదాంగుళిని గ్రహించియున్నచోఁ బద్మాసనం బగును. ఈయాసనంబువలనఁ బాపరోగభయంబులు నశింపఁగలవు. అండంబులకధోదేశమునందున్న యుభయరేఖలయందు గుల్ఫద్వయమును నిక్షేపించి జానుపార్శ్వద్వయమును బాహుద్వయముచే బంధించి పట్టియుంచినచో భద్రాసనం బగును. ఈభద్రాసనమువలన విషరోగములు వినాశము లగును.

సంవృతాస్యుండును నిమీలితాక్షుండును నై యుండి వాక్సంయమంబు గావించి కాలిమడమలచేతను, శేఫముచేతను అండములను సంవరణంబు గావించి నిరంతరమును రక్షింపవలయును. మొగిము నించుక వంచి దంతములచే దంతములను స్పృశింపకుండ నిశ్చలజిహ్వుండై పాషాణమూర్తింబోలి చలింపకుండవలయును. రజోగుణముచేఁ దమోగుణము నాచ్ఛాదించి సత్వగుణముచే రజోగుణమును నివారింపవలయును. ఇట్లు యోగి యోగబలంబుచే నిశ్చలుండై సమాధి నవలంబించి యింద్రియములను, నింద్రియార్థములను, మనంబును, బంచవాయువులను నిరోధించి కచ్ఛపంబును బోలి సకలాంగములను సంకుచితంబులుగాఁ జేయుచు విషయనివృత్తిసూచకం బగుప్రత్యాహారము నారంభింపవలయును. అనంతరము ద్వాదశసూత్రో

చ్చారణకాలము ప్రాణాయామముం గావింపవలయును. ద్వాదశప్రాణాయామములచే ధారణ నభ్యసింపవలయును. అధ్యాత్మయోగి ప్రతి దినమును పదినుండి యారంభించి క్రమముగాఁ బండ్రెండు, ఇరువది, ఇరువదినాలుగుధారణల నభ్యసింపవలయును. ఈరీతి యోగముచే నెవ్వఁడు దివ్యంబగుపరమాత్మ సాక్షాత్కారముం గాంచునో యాతని కీర్తిఁ బుసగ్జన్మ మెక్కడిది? అట్లు యోగీంద్రుండు శక్త్యనుసారముగా ధారణ నభ్యసించి ప్రత్యాహారమును సాధింప నారంభింపవలయును. సర్వేంద్రియములను మెల్లమెల్లగా వశపఱచుకొనుచు ధ్యానమునకుఁ గడంగవలయును. అజితేంద్రియుఁ డగువాఁ డెంతటి మహాత్ముఁడైనను విషయాకృష్టుఁడై మూఢుం డగునుగావున నెల్లవిధముల నింద్రియంబులను జయింపవలయును.

ప్రాణవాయువుల స్వైరవిహారమును నిరోధించుటయే ప్రాణాయామము. అంతరంగమునందు వాయుధారణ గావించుటయే ధారణ. విషయనివృత్తియే ప్రత్యాహారము. ఈయన్నింటిసహాయమునను యోగలక్షణ సిద్ధించును. ధ్యానయోగి జలంబులందోఁచుచంద్రునింబోలి తనయాత్మయందుఁ బ్రతిబింబించుపరమాత్మను దర్శింపఁగలఁడు. పరమాత్మసాక్షాత్కారముచే మోక్షప్రాప్తి యగును. ఈతత్త్వలక్షణము దేశకాలవిమలకు విజ్ఞేయమైనది. ఇతరుల కిది యతిదుర్లభమైనది.

## ధ్యానమాహాత్మ్యము.

యోగప్రకారము నింకను విస్పష్టముగాఁ దెలుపవలయు నని వ్యాసుం డడుగుటయు సనత్కుమారుం డిట్లనియెను. మునిశ్రేష్ఠా! సుఖాసీనుండై యున్న స్వయంభువగు మహాదేవుని సందర్శించి దుర్వాసుం డిట్లు ప్రశ్నించెను.

పరమేశ్వరా! పాపవృత్తు లగు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులును, సహజపాపులగు శ్వపాకమ్లేచ్ఛచండాలసూకరజీవపక్షిఘాతకులును, బాపాశ్రయులగు లుబ్ధకృతఘ్నులును, హవిఃప్రతిబంధకులును, కన్యాదూషకులును, కులఘ్నులును, నపుంసకులును, మాతృత్యాగులును, పితృత్యాగులును, రాజఘాతకులును, పరద్రవ్యాపహారులును, రణపరాఙ్ముఖులును, పరవృత్తిహరులును, మత్స్యఘాతకులును, అగమ్యాగమనాసక్తులును మొదలగుపాపాత్ములకు ముక్తిలాభము సిద్ధించుటకుపాయ మేమి? ఇట్టివారు పాపగతినుండి యెట్లు నిష్కృతిం గాంచఁగలుగుదురు? ఈనాసంశయమును దీర్పవలయునని ప్రార్థింటయు మహాదేవుం డిట్లనియెను.

మునీంద్రా! పాపపరాయణు లగుమానవు లేజాతివారైనను క్షణమాత్రమున నిశ్చలధ్యానబలంబుచే సకలపాపసమూహమును దగ్ధము సేయఁగలుగుదురు. ధ్యానమూలంబున నాత్మవిదులును విశుద్ధబుద్ధులు నగుయోగులకు మోక్షము లభించును. శుద్ధధ్యానముచే సర్వసిద్ధులును లభించును. ఏకాగ్రచిత్తముతో ధ్యానచింతాతత్పరులగు ధ్యానయోగు లేకధ్యానయోగముచేతనే సకలపాపములను దహింపఁజేయుదురు. పితృభ్రాతృపత్నీగమనము, భగినీగమనము మొదలగు మహాపాపములు ధ్యానబలముచే నశింపఁగలవు. దృఢవ్రతుండై నిత్యాభ్యాసము గావించువారికిఁ బరిశ్రమమూలంబున ధ్యానము సుస్థిరమై ధారణాబలము సిద్ధించును. యతియగువాఁ డతిప్రయత్నముతో ధారణాలాభతత్పరుండై యుండవలయును. ధారణాలాభముచే సర్వసిద్ధులును లభింపఁగలవు. ధ్యానతన్మయుం డగుపురుషునకు మోక్షము మస్తకమునందే చేరియుండును. అతఁడు రుద్రలోకము, సూర్యలోకము, అగ్నిలోకము, ఇంద్రలోకము, విష్ణులోకము మొదలగువానిలో

దేనిని వాంఛించినను, ప్రజాపతిలోకమును, బ్రహ్మత్వమును, మోక్షమును వాంఛించినను దప్పక సిద్ధించును. అతని కప్రాప్యమగునది యేదియు లేదు.

## కాశీవాసనిర్దేశము.

మహాదేవుం డిట్లు బోధించుటయు దుర్వాసుండు వెండియు నిట్లు ప్రార్థించెను. దేవదేవా! ధ్యానమన నెట్టిది? ఎట్టివాఁడు నిత్యమును ధ్యానించుచుండవలయును? ఈసకలవిషయములును నాకు బోధించి నన్నుఁ గృతార్థుని జేయుము అనుటయు మహేశ్వరుండు చెప్పం దొడంగెను.

ధ్యానయోగము మోక్షద్వారవిమోచనోపాయము. యోగం దుండు పరమధ్యానస్వరూపమగు నోంకారము నుపయోగించి గురుగణంబులకు నమస్కారపూర్వకముగా సమ్యంత్రమును ధ్యానించుచు నుపయుక్తాసనమున నుపవిష్టుండై యతిప్రయత్నముతో ప్రాణనియమనంబునకుం యుక్తమగుయోగమును బ్రయోగింపవలయును. పద్మమండలము, స్వస్తికము, రుద్రపీఠము, వజ్రదండోన్నతము మొదలుగాఁగల వివిధాసనవిశేషములును, వానిలక్షణములును, గుణములును శాస్త్రంబులయందు నిర్దిష్టంబులై యున్నవి.

యోగవిదుండు యూసనంబులలో నొకయాసనమును గ్రహించి నియమితాహారుండును, జితక్రోధుండునై నిర్జనస్థానంబున నిరామయభావముతో శిష్టసంసర్గమునుగూడఁ బరిత్యజించి, సాధారణజనదర్శనంబును, వదభిగమనంబును వర్జించి శాస్త్రోపదేశానుసారముగా నిరంతరధ్యానచింతానిమగ్నుండై యుండవలయును. ఈవిధముగా నేకాగ్రచిత్తుం డగుసాధకునకు యమంబు సిద్ధించును. ఉత్పన్నంబైనయీశరీరం

బవశ్యము వినాశంబు గాఁగలదని యేకాగ్రచిత్తముతోఁ జింతించు చుండవలయును. ఈదేహము నెంతమాత్రమును హింసింపరాదు. శుక్రశోణితమూలంబున నిర్మితంబై నయీశరీరముతో నుపయోగ మేమున్నది? అనిత్యం బగునీదేహము మేదోమాంసపరిపూర్ణమైనది. నాడీజాలావృతంబగు నీశరీరరూపనగరము, ఇంద్రియరూపము లగునవ ద్వారములతోఁ గూడియున్నది. శ్లేష్మమూత్రపురీషాదినీచస్థానముల నుండి యుత్పన్నంబులగుదుర్గంధములచేతను, వ్యాధులచేతను, శోకా దులచేతను నతిభయంకరం బగునీశరీరమునందు మూఢుఁడు మమకార ము గలిగియుండును. కాని, యోగవిధుండుమాత్ర మాత్మయొక్కటి యే నిత్యంబనియు, శరీరము కేవలమనిత్యమనియు భావించుచుండును.

ఈశ్వరుఁ డగుమహాదేవుఁడు రుద్రావాసమగుకాశీధామమునం దు విరాజిల్లుచుండును. ప్రాణసమూహము రుద్రస్వరూపము గావున నట్టిరుద్రకావాసంబగునీశరీర మవిముక్తం బని భావింపవలయును. ఇది యభ్యంతరయోగము. ఇఁక లోకహితార్థమై బాహ్యయోగము నభివర్ణించెదను. యోగవేద్యం బగునీపరమయోగము నిత్యశ్రవణ యోగ్యమైనది. త్వక్కు, చక్షుద్వయము, శ్రోత్రద్వయము, జిహ్వ అనునీయైదును, అవ్యక్తము, బుద్ధి, అహంకారము, మనస్సు, చిత్తము ననునీయైదును, పృథివి, జలము, తేజము, వాయువు, ఆకాశము ను నీయైదుభూతములును జ్ఞానస్వరూపములని బ్రహ్మభావార్థము జ్ఞానా భ్యాసముం గావింపవలయును. అవ్యక్తవిచారముకొఱ కారంభింపఁ బడినప్రాణాయామమే ధారణ యగుచున్నది. మేధావి యగువాఁడు సకలేంద్రియసంచాలక మగుమనంబును బ్రాణాయామముచే వశీభూ తంబుగావించుకొని మనోమూలంబునఁ బ్రాణయోగంబు నాచరింప వలయును. మనస్సనుల్లంఘించి యేకర్మమును జేయరాదు. మనమే

సకలంబునకును మూలమైనది. అనంతరము యోగముచే మస్తకము నందు సకలతత్త్వములను వేఱువేఱుగా భావించుట నభ్యసింపవలయును. మనఃప్రాణేంద్రియంబుల నైక్యంబు చేసి యాత్మచే నాత్మను భావించుచు నోంకారమును ధారణగావింపవలయును.

## —♦ వివిధయోగవిధి. ♦—

ఆత్మబలంబుచేఁ బంచవాయువులను నాత్మయందు ధారణగావింపవలయును. నఖములు, అంగుళులు, పర్వసంధులు, పాదములు ఊరువులు, జంఘలు, శేఫము, అండములు, పాయూపస్థలు, కటిస్థానము, బాహువులు, హృదయమధ్యము, పృష్ఠము, లలాటము, జిహ్వాగ్రము, తాలుమధ్యము, చక్షువులు, నాసిక, భ్రూమధ్యము, శ్రోణిభాగము, మూర్ధము ననునీస్థానములయం దీపంచవాయువులును సంచరించుచుండును. మఱియునీశరీరమునందు నాభీమధ్యమున జ్వాలామాలికాసహస్రములచేఁ బ్రజ్వలించుసూర్యమండలము విరాజిల్లుచుండును తన్మధ్యమునందు వెలుంగుచున్న సుందరచంద్రమండలమునందుఁ బరమాత్మ యధిష్ఠించి యుండును. నీల, శ్వేత, రక్త, శ్యామల, పింగళ, లోహిత, శబలాదివర్ణంబు లాపరమాత్మకులేవు. అతఁ డష్టిస్నాయుశిరామాంసవివర్జితుఁడై, దుఃఖాతిరిక్తుఁడై ప్రకాశించుచుండును. విచక్షణులగువా రాపరమాత్మ నాదిత్యవర్ణుండగుపురుషునిగా భావించుచుందురు. చింతనీయుం డగునయ్యాశ్వేరుండు లోకకర్తగాఁ బ్రశంసితుండగుచుండును. శుద్ధస్ఫటికాసంకాశుఁడగునాపురుషునిదివ్యస్వరూపము చక్షుర్గోచరంబు గాదు. సముద్రమును జల మావరించినవిధంబున నాపురుషుండీవిశ్వమంతటను వ్యాపించి యుండును.

అమ్మహాదేవుఁడు విలాసముకొఱకును, విఖ్యాతికొఱకును జగ

త్సృష్టిఁ గావించుచు సకలజీవులను గ్రీడాపరికరములుగాఁ జేసికొని క్రీడించుచుండును. పలాశపత్రమునం దంతటను దంతుసమూహము వ్యాపించియున్నట్లు పరమాత్మ సకలలోకములందును వ్యాపించియుండును. సూర్యరశ్మిసకలతేజములను వహించియున్నట్లు పమాత్మ సకలరూపములను దాల్చి విరాజిల్లుచుండును. ఈవిధముగా జ్ఞానాభ్యాసముంగావించి పరమాత్మస్వరూపమును గ్రహింపవలయును. ఆత్మచే నాత్మయందు సకలభూతంబుల దర్శించుచు నిష్ఠజ్ఞానాభ్యాసబలంబునఁ బరమాత్మస్వరూపమును దర్శింపవలయును.

ప్రాణవహంబు లగుపదినాడులు శరీరస్థితంబులై యుండును. అధఃప్రదేశమునందు నాలుగునాడులును, పార్శ్వములందు రెండునాడులును, ఊర్ధ్వప్రదేశమునందు నాలుగునాడులును గలపి పదినాడులు. ఇంకను శరీరమునందు డెబ్బదిరెండువేలనాడులు గలవని చెప్పుదురు. మాంసముపైఁ దైలమువ్యాపించిన ట్లానాడులు శరీరమునం దంతటను వ్యాపించి యుండును. హృదయప్రదేశమునందు పద్మసంకాశంబగు నొకస్థానము గలదు. అందు సూక్ష్మస్వరూపుఁడును, శుద్ధస్ఫటికతేజుండును, నిర్గుణుండును, నిత్యుండును, ధ్రువుండును, నిరంజనుండును, మద్భక్తపరతంత్రుండును, అక్షరుండును, అవ్యయుండును, బరమాత్మస్వరూపుండు నగుపురుషుండు వెలుంగుచుండును. ఆతఁడే సర్వశరీరస్థితుఁడు, సర్వలోకస్రష్ట, విధాత; ప్రమోక్త; భవకారణుఁడు; సకలలోకకర్త; ప్రవర్తకుఁడు; సృష్టిసంహారకర్త; ఆతఁడే యగ్నిస్వరూపుఁడు; ఆతఁడే యాదిత్యస్వరూపుఁడు:—అని యీవిధముగా విజ్ఞానులగువారు భావించుచు యోగాభ్యాసముం గావించుచుందురు.

—. యోగలక్షణము. ,—

ప్రాణాదివాయువులు నాలుగు నూర్ధ్వగతంబులై యుండును. ఆవాయుసాహాయ్యముచే నెవ్వఁడు పరమాత్మ నాత్మయందు సంచరింపఁజేయఁగలుగునో యట్టిధ్యానపరాయణుఁ డగుపురుషుఁ డాక్షణము నందే యోగీంద్రనామమున కర్హుం డగును. పాపాత్ము లీమార్గమునఁ బరమాత్మను దర్శింపఁజాలకుందురు. నిత్యపాపకర్మరతుం డైనను నిత్యధ్యానపరాయణుండు గాఁగలిగినవో నాతని కెట్టిపాపములును గలుగకుండును. అనలజ్వాలచే నరణ్యకాష్ఠములు దగ్ధములైనవిధంబున ధ్యానానలముచే నఖిలకర్మంబులును దగ్ధములై పోవును. వేదాధ్యయనములు, యజ్ఞములు, జపములు, యోగములు, శౌచములు, మానసారాధనములు, బ్రహ్మచర్యాదినియమములు, మొదలగువానివలనఁగూడఁ బడయరానిపరతత్త్వజ్ఞానము కేవలధ్యానసాగరసేవనమువలన మానవులకనాయాసముగా లభింపఁగలదు. ధ్యానార్ణవమును సేవింపఁజాలనివానికెంతమాత్రమును బరమపదప్రాప్తి గానేరదు. అతనికిఁ బుణ్యనదీజలస్నానము, తీర్థసంసేవనము, దీక్షావిధానము, శిరోముండనము, దేవపూజ, త్రిదండధారణము మొదలగువానివలన నెట్టిప్రయోజనమును లేదు. సర్వత్ర సమదర్శనుఁడై సర్వభూతముల నాత్మస్వరూపములుగా నెంచుచు, సర్వమునాత్మస్థితంబుగా భావించుచుండు మహాత్ముఁడే సిద్ధుఁడు.

—♦ షడంగయోగాదికథనము. ♦—

వెండియు మహాదేవుం డిట్లనియెను. ప్రాణాయామంబును ధ్యానంబును గలసి ధారణాయోగం బగుచున్నది. ప్రాణవాయువులను నిగ్రహించుటయే ప్రాణాయామము. యోగప్రవృత్తుం డగువాఁడు నిగ్ర

స్థానంబున నిశ్చలహృదయముతో నోంకారమును ధ్యానించుచుండ వలయును. ధ్యానమువలననే మహత్వంబు వర్ధిల్లుచుండును. సకలేంద్రియములను, సకలేంద్రియవిషయములను బుద్ధిబలముచే సంకోచింపఁ జేయుటయే ప్రత్యాహారము. దశేంద్రియంబులకు నోంకారసంయోగంబు గావించి జపించుటయే యోగం బనఁబడును. అహింసయు, సత్యభాషణంబును, అస్తేయమును, అకాపట్యమును, బ్రహ్మచర్యము ననునివి యైదును నియమములు. అక్రోధనము, గురుసేవనము, శౌచము, సంతోషము, అ[illegible] యనునివి యైదును నియమంబులు. ఈయైదును శుద్ధవిజ్ఞానమును గలసి షడంగయోగం బగుచున్నది. షడంగయోగసిద్ధునకు నిత్యం బగు పరమపదంబు సిద్ధింపఁగలదు. ప్రథమమునందు నియమసాధనంబున కసమర్థం బగుశరీరము నియమాదులం సిద్ధించి నంతనే సర్వసమర్థంబై యెట్టిభంగంబును లేకయుండును.

సనాతనమును, అవ్యక్తము నగుజ్ఞానమే త్రిగుణాత్మకప్రకృతి యని పండితులు చెప్పుదురు. ద్రష్టయు, స్రష్టయు, పితయు, మంతయు, బోద్ధయు, ధ్యానపరులచేతనే దర్శనీయుండును, నిత్యుండు నగుసూక్ష్మస్వరూపుఁడే పురుషుండని ప్రశంసింపఁబడుచుండును. ఆతని దర్శింపవలయు ననుకుతూహలముతో ననేకవిధంబులగు యోగముల నవలంబించి ప్రయత్నించుచుందురు. యోగసిద్ధు లగువారి కాతనిసాక్షాత్కారము లభింపఁగలదు. ఈశరీరమునందు మనస్సు, బుద్ధి, అహంకారము, అవ్యక్తము, త్రిగుణాత్మికయగుప్రకృతి శాశ్వతుఁడగు పురుషుఁడును సంస్థితులై యుందురు. జీవుండు రజస్తమోగుణంబులచే నష్టదృష్టియై, సదసద్విచారణంబున కసమర్థుండై [illegible] పురుషుఁడే హృదయమునందుండి సత్పురుషగతికిఁ గారణుం డగును. ఎవ్వఁడీపంచవింశతితత్త్వములయుత్పత్తి [illegible] భావాభావములను మహాదేవుని

యందు భావనసేయఁగలుగునో యాతఁ డష్టావింశతిదర్శకుం డగును.

మోక్షమును బ్రమాణాదులచేఁ దెలిసికొనుట యసంభవము. పంచవింశతత్త్వముల నెఱుంగఁజాలినవారు తత్ప్రతిపాద్యుం డగునీశ్వరు నెఱుంగుటకు సమర్థు లగుదురు. సకలంబునకు నూర్ధ్వభాగంబున రుద్రావాసమునందు సంచరించుచుండు నోంకారమును దర్శింపఁగలిగిన పురుషుఁ డవిముక్తుండుగాఁ బ్రశంసితుండు గాఁగలఁడు. దేనిమూలము న మోక్షము లభించునో, దేని నెఱుంగుటవలన మోక్షమార్గము విదితంబగునో గ్రహింపఁగలవిజ్ఞాన మాతనికిఁ గరతలామలకం బగును. పురుషుఁడు పంచవింశతితత్త్వరూపుఁడనియు, షడ్వింశతిస్వరూపుఁడనియు, ఊనవింశతితత్త్వస్వరూపుఁడనియుఁ దత్త్వజ్ఞానియగువాఁ డెఱుంగఁగలఁడు. ఆతఁ డాపురుషుని వింశతితత్త్వాత్మకునిగా నెఱింగి ముక్తిలాభముం గాంచును. సప్తవింశతితత్త్వస్వరూపుఁ డధ్యక్షుఁడనియు, అష్టావింశతితత్త్వాత్మకుఁడు పురుషుం డనియు, త్రింశత్తత్త్వవేద్యుం డగువాఁడు పురుషలోకధరుం డనియు వ్యవహరింపఁబడుదురు.

ఎవ్వఁడు శస్త్రాదులచే నచ్ఛేద్యుఁడై యుండునో, స్వరవ్యంజనాదివర్ణంబులచే నెవ్వనిస్వరూపము నిర్ణీతంబు గాకుండునో, మాత్రాక్షరవిరహితుం డగు నెవ్వనిమూర్తిని యతీంద్రులు నిరంతరమును ధ్యానించుచుందురో, కాశీధామమునం దెవ్వఁడు గౌరీదేవిదక్షిణభాగంబున విరాజిల్లుచుండునో పంచాయతనక్షేత్రస్థంబగునట్టియోంకారశివస్వరూపమే శోకమోహభయవినాశకం బగుపరమేశ్వరస్వరూపము. ఆదేవుని యనుగ్రహంబుచేతనే మానవులు మాయావిరహితు లగుదురు. ఆ యీశ్వరుఁడే నిష్కళుం డని యోగీంద్రులు నిత్యమును ధ్యానించుచుందురు.

అని మహాదేవుం డుపదేశించుటయు దుర్వాసుండు మహాత్మా!

ఆయీశ్వరుండు మాత్రాక్షరవిరహితుండని యానతిచ్చితిరి. అట్టివానిని దెలిసికొనుటయెట్లు? పరమగోప్యం బగునీవిషయమును విస్పష్టంబుగాఁ దెలిపి నన్నుసంతుష్టునింగావింపవలయు నని వేడుకొనియెను. అప్పుడు మహాదేవుండు వెండియు నిట్లు చెప్పందొడంగెను.

ఓంకారమే పరమం బగుబ్రహ్మస్వరూపము. దానికంటె నన్యం బగునది యేదియునులేదు. ఆబ్రహ్మము పంచమాత్రాత్మకంబుగాఁ బ్రకీర్తిత మగుచుండును. ఆతని ప్రథమద్వితీయమూర్తులు స్వరవ్యంజనాత్మకములు. తృతీయమూర్తి యతిసూక్ష్మమైనది. దానిని యోగులు ధ్యానించుచుందురు. అది యతిసూక్ష్మపదార్థంబులకంటెను నర్ధాంశసదృశసూక్ష్మంబును, నిర్గుణంబును, బ్రశాంతంబును, అక్షయం బునై యుండును. దాని నెఱింగినవారు ముక్తులగుదురు. అకారము తేజస్స్వరూపము. ఉకారమక్షరస్వరూపము. మకారముతురీయమును సూక్ష్మమును:—వీనినుండి యోంకార మయ్యెను. అకారము బ్రహ్మస్వరూపమనియు, ఉకారము విష్ణుస్వరూప మనియు, మకారము ఉమాస్వరూపమనియుఁ దెలియందగును. వీనినుండి నిత్యబ్రహ్మస్వరూప మగునోంకార ముత్పన్నం బయ్యెను. ఈయోంకారము నుచ్చరించుచు స్మరించుచు యోగసాధనముం గావించుయోగీంద్రుఁడు సర్వసిద్ధులను బడయఁగలుగును.

## —♦ శరీరనిరూపణము. ♦—

మహేశ్వరుండు దుర్వాసుంగాంచి మఱియు నిట్లనియెను. ఓ మునికులతిలకా! ఈశరీరము సర్వదేవతామయమైనది. ఇందేయేయంగకములం దేయేదేవతలుందురో చెప్పెదను వినుము. పాదములయందు విష్ణుండును, జంఘలయందుఁ బవనుండును, జానువులయం దశ్వినీ

కుమారులును, ఊరువులందు వరుణుండును, పాయుస్థానమునందు మిత్రావరుణులును, గుహ్యాంగమునందు బ్రహ్మయు, కటిప్రదేశమునందు యక్షగణసహితుండగు కుబేరుండును, ఆంత్రములందు సముద్రములును, ఉదరమునందుఁ బంచదేవతలును, హృదయమునందు సావిత్రియు, వక్షస్థలంబునఁ జంద్రుండును, హస్తములయం దింద్రుండును, చర్మమునందు విద్యుత్తును, నఖంబులయందోషధులును, కేశములయందు వనస్పతులును, రోమకూపంబులయందు ధర్ముండును, మూర్ధమునం దాదిత్యులును, సంధులయందు సప్తర్షులును, చరణంబులయందు సూర్యుండును, శ్రోత్రంబులయందు దిక్కులును, ఘ్రాణప్రదేశమునందుఁ బర్వతంబులును, లలాటమునందు వసువులును, మస్తకమునందు స్వయంభువగుశివుండును, నేత్రపార్శ్వములయందు యముండును నవబ్రహ్మలును, పృష్ఠభాగమునందు రాత్రియు, పార్శ్వములయందు దేవతలును, కంఠమునందుఁ బ్రాణగతియగువృషభధ్వజుండును, అహంకారమునందు రుద్రుండును, బుద్ధియందుఁ బ్రపంచపతియగుబ్రహ్మయు నధిష్ఠించి యుందురు. ఈవిధముగా శరీరమంతయు సర్వదేవతామయంబని భావించువారికిఁ బరమగతిలాభంబు గలుగును.

అని చెప్పుటయు దుర్వాసుండు మహాత్మా! ఈదేవతలును మహర్షులును శరీరము నధిష్ఠించియుందురని తెలిపితివి. వీరందఱకును బ్రాహ్మణాహుతు లెట్లు లభించునో విస్పష్టముగా బోధింపవలయు నని ప్రార్థించెను. అంతనమ్మహేశ్వరుండు మరల నిట్లని చెప్పందొడంగెను.

ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము ననునీపంచవాయువులును శరీరమునందు సంచరించుచుండును. బ్రాహ్మణుఁడు ప్రతిప్రభాతమునం దీపంచవాయువులకును స్వాహాకారప్రదానంబు గావింపవలయును. అందుముందుఁ బ్రాణవాయువునకుఁ గాని

చినయాహుతివలన సావిత్రియు, షడంగపదక్రమసహితంబు లగునాలుగువేదములును, ఓషధులును, వనస్పతులును, చంద్రుడును, భాస్కరుడును, వాయుదేవుండును సంతృప్తు లగుదురు. రెండవసారి యపానమునం దాహుతిగావించిన యన్నమువలన నాగగణంబులును, సప్తసముద్రంబులును, సకలనదులును, మహర్షులును, బితృదేవతాగణంబులును, వాయుప్రభృతిదేవతలును సంతృప్తు లగుదురు. తృతీయపర్యాయము సమానవాయువునం దాహుతిగావించిన యన్నమువలన అశ్వినీదేవతలును, మరుద్గణంబులును, విష్ణుదేవుండును, వరుణుండును, యముండును, బ్రజాపతియును, కుబేరప్రభృతిదేవతలును సంతృప్తు లగుదురు. చతుర్థపర్యాయము నుదానవాయువునందు హోమముగావించినయన్నమువలన నేనును, భవుండును, రంగేశ్వరుండును, పార్వతీదేవియు, మనస్సును, ప్రాణసమూహంబును, బ్రహ్మయును సంతుష్టు లగుదురు. మునీంద్రా! ఐదవసారి వ్యానవాయువునందు హోమము గావించినయన్నమువలన నక్షత్రగణంబులును, సప్తద్వీపములును, సప్తలోకములును, భూమండలమును, సకలభూతసహితంబగుబ్రహ్మాండమండలమును, యక్షోరగరాక్షసప్రభృతులును సంతృప్తు లగుదురు.

ఈవిధముగా బ్రాహ్మణులు ప్రణవమంత్రోచ్చారణపూర్వకముగా హోమంబు గావించినచో జండాలాన్నభోజనముచేసైనను పాపలిప్తులు గానేరరు. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులలో నెవ్వారైన నీవిషయమును బౌరముగావించినచో వారు సకలపాపములనుండియు విముక్తులై శ్రద్ధావంతు లగుదురు.— "ఆదిత్యవర్ణుండును, దమోగుణాతీతుండు నగుసమ్మహాపురుషుని నేనెఱుంగుదును. ఆతని నెఱుంగఁ గలిగినచో జన్మమృత్యుపరస్పరానుబంధం బగుసంసారమునుండి ముక్తిలాభంబు గలుగును. మోక్షరూపం బగుసద్గతిం గాంచుట కంతకంటె

వేఱుమార్గంబు లేదు. జీవరక్షగావింపవలయు ననునభిలాష యున్నవో మోక్షప్రాప్తికి సాధనం బగునుపాయము నవలంబింపవలయును. అట్టి వానికి హాలాహలమును బానము చేసినను మృత్యువు గలుగదు." అని యీవిధముగాఁ బరమేశ్వరునిం గూర్చి నిశ్చలహృదయమున భావింపఁ గలిగినవో నవశ్యము ముక్తిలాభంబు గాఁగలదు.

## —♦ నా డీ వి వ ర ణ ము. ♦—

యోగినాడీవిషయంబును, తద్వ్రతవిషయంబును నాకు స్పష్టముగా బోధింపవలయు నని యడుగుటయు సనత్కుమారుం డిట్లు చెప్పందొడంగెను.

అవ్యయుం డగుసకలలోకేశ్వరునకు వినయవినమితమస్తకుండనై ప్రణామంబు లాచరించి నిశ్చలభక్తిపూర్వకంబుగా రుద్రాణియగు కాత్యాయనికి నమస్కారంబులఁ గావించెదను.

హరిహరబ్రహ్మలచే నీయోగశాస్త్రము సముదాహృతంబైనది. ఇది నాడీసంచారసంస్థితం బగుపరబ్రహ్మజ్ఞానము. శ్రీమంతుఁడగువిశ్వమూర్తి దేహస్థుఁడై క్రీడించుచున్నకాలమునం దాతని యనంతతేజోమయూఖములు జగద్దేహప్రసరితంబు లగుచుండును. హృదయస్థితంబులగు యోగనాడులంగూర్చి వర్ణించి యుంటిని. ఇఁక శరీరమునందుఁ బూర్వదక్షిణపశ్చిమోత్తరభాగంబుల నాశ్రయించి యథఃప్రదేశము నందుండు నాడులవర్ణంబుల నభివర్ణించెద నాకర్ణింపుము. ఉత్తరనాడీసమూహము పీతలోహితకృష్ణవర్ణంబు గలిగియుండును. పూర్వభాగస్థితం బగునాడీసముదాయము పాండుపింగళవర్ణంబులతో నొప్పుచుండును. దక్షినాడీసమూహము శ్వేతవర్ణయుతంబును, బశ్చిమనాడీసమూహము కృష్ణపింగళసంకలితంబునై యుండును. ఊర్ధ్వస్థితంబులగునాడు

లన్నియును కృష్ణవర్ణమయంబులై యుండును. హృదయస్థానస్థితంబు లగునాడులతో నీనాడులన్నియును బంచపంచప్రకారములవిరాజిల్లుచుండును. ఏకోత్తరశతనాడులను యోగీంద్రు లుపాసించుచుందురు. ఈ నాడుల నన్నింటిని విడిచి యొక్కబ్రహ్మనాడి నాశ్రయింపవలయును. ప్రభాకరుం డగుసూర్యుం డుదయించి తనతేజోమయకిరణములచే నంధకారసమూహమును వినాశంబు గావించి నభోమండలమును ప్రకాశింపంజేయుచున్నట్లే హృదయస్థితుం డగుపరమాత్మ సకలకలుషసమూహమును దూరీభూతముగాం జేసి సర్వంబును బ్రకాశమానముగాం జేయుచుండును.

అతితరంబు లగుక్రీడామోహాదులు నాభినాడులచే దూరీకృతంబులగును. హృదయస్థానమునందుం దొంబదియాఱువేలనాడు లుండును. పూర్వస్థితంబు లగునైదునాడులును బంచప్రాణములుగాం బరిగణితంబు లగుచుండును. దక్షిణభాగమునందలినాడు లైదును జలనాడులనియు, బశ్చిమభాగమునందలినాడు లైదు నుదాననాడు లనియు, ఉత్తరభాగమునందలినాడు లన్నియు నుత్తరనాడులనియుం బ్రశంసింపం బడుచుండును. మఱియు నధోదేశమునం దున్ననాడులన్నియు సమానస్థనామముచే విఖ్యాతంబులై యుండును. ఊర్ధ్వభాగమునందును అధోభాగమునందును వ్యాపించియుండు నీయుభయనాడీసమూహమును హృదయమధ్యమునం దాశ్రయించి యుండును. ఈవిధముగా నాడీప్రమాణము నిర్దిష్టం బయ్యెను. ఎవ్వనిచే నీవిశ్వమండలమంతయుం బ్రతిష్ఠితం బయ్యెనో యావిశ్వకర్మ యతిసూక్ష్మంబు లగునీనాడుల నన్నిటినిగూడ నధఃప్రదేశమునందలి నాడీచతుష్టయముతోం గూర్చియుండెను. విశుద్ధనాడి హృదయమునందును, మస్తకమునందును లక్షితమగుచుండును. తత్త్వజ్ఞానసిధులగువిజ్ఞానయోగులు దానినే బ్రహ్మ

నాడి యందురు. దానియందు మనంబును సంయోజితంబుగఁ జేసిన వో జ్ఞానేంద్రియసమూహము రక్షితంబుఁ గాఁగలదు. కర్మేంద్రియపంచకంబుతో నింద్రియపంచకము సయుక్తంబై యుండును. యోగబలంబుచే హృదయసంబంధము లగునాడులన్నియును బాదస్థితంబులు గాఁగలవు. సహస్రనాడీసమూహమధ్యమునందును బూర్వాదినాడీచతుష్టయము గుణసంబంధమైనది.

యజ్ఞములును, సకలవేదములును హృదయమునందుఁ బ్రతిష్ఠితంబులై యుండును. దానివలననే యాత్మతత్త్వజ్ఞానము లభించును. మఱియుఁ బ్రాణవాయువలన నూర్ధ్వగతిప్రాప్తి యగును. నాసికారంధ్రములనుండి మస్తకమునందును, మస్తకమును భేదించి యాకాశమునందును వాయుసంచార మగును. శుక్రవాహంబులును, మూత్రవహంబులు నగునాడులు పరస్పరమిశ్రితంబులై యేకీభవించి యుండును. శుక్రనాడులు శుక్రమూలంబున సంతానోత్పాదకంబులై యుండును. మూత్రనాడులు మూత్రనిష్పాదకంబులై యుండును. ముఖమునందుమనోమిళితంబగుబ్రహ్మనాడిని, హృదయమునం దీశ్వరుని సుస్థిరంబుగా నిలిపి యాత్మ నాకాశగతంబుగను, విశ్వవ్యాప్తంబుగను భావించుచు నేకాగ్రచిత్తంబున ధ్యానించువానికి నిర్మలజ్ఞానసిద్ధి యగును. సూక్ష్మముకంటెనునతిసూక్ష్మం బగుతత్త్వ మాతనికిఁ బరిస్ఫుటంబు గాఁగలదు. ఇట్టితత్త్వజ్ఞానలాభమువలన నాతని కిఁక సంసారసంబంధములేకుండఁ బోవును. సోమసూర్యకరసహస్రంబులచేఁ బ్రవిష్టవిలసితమగు సహస్రారకమల మాతనికి వేద్యంబగును. శిరస్థితం బగునాసహస్రారకమలంబునందే యోగీంద్రు లాత్మసంయోజనంబు గావించుచుందురు.

ఆసహస్రారకమలమే సంసారవిమోచనమునకు సాధనమైనది. జ్ఞాన, శాస్త్రసాహాయ్యముచే [illegible] నైనసమ్మతి నిర్మలచిత్తు

దేవభావాదిజన్మములనుండి విముక్తులై, బహుజనప్రశంసితులగుబ్రహ్మవేత్తలాత్మస్వరూపలాభమునకు సమర్థులగుదురు. నాడీసంచారసూచితమగునీపవిత్రయోగశాస్త్రము సనత్కుమారప్రోక్తమైనది. ఇది నిశ్చయముగా మోక్షశాస్త్రము. సునిశ్చితం బగునీయోగశాస్త్రము బ్రహ్మదిసకలర్షిగణంబులచేతను బ్రకీర్తితమైనది. పాపనాశకంబగునీశాస్త్రము పవిత్రశాస్త్రములన్నిటికం టెను బవిత్రమైనది. నాడీముఖచింతకుం డగు వాఁడు సర్వపాపవిముక్తుం డగును.

శుక్లశోణితసంభూతుండు, స్థూలదేహాభిమానియు నగువిశ్వనామకచైతన్యమూర్తి నాడీమధ్యసంస్థాపితుం డైనంతనే నిర్మలుండు గాఁగలఁడు. గోమూత్రినామకనాడీధ్యానమువలన సప్తజన్మార్జితంబగు పాపము నశింపఁగలదు. కావున శ్రద్ధతో నానాడిని శిరోదేశంబునకధోభాగంబున నియోజితంబుగావించి యానాడీమూలముననే యాత్మచింతనంబు గావింపవలయును. అట్లుగావించినచో విశ్వమయంబగు నాత్మస్వరూపము హృదయమునందు సుప్రతిష్ఠితంబగును. పూర్వర్షిగణంబు లిట్లే యాత్మచింతకులు, నాత్మపరాయణులునై యాత్మను హృదయమునందుఁ బ్రతిష్ఠించి ధ్యానించిరి. ఆత్మతత్త్వజ్ఞానము సంపూర్ణముగ లభించువఱకును దృఢభావముతో నిట్లే ధ్యానయోగంబు గావించుట యవశ్యకర్తవ్యము. సూక్ష్మమార్గసంచారంబు లగునాడుల యూర్ధ్వగమన ముత్తరాయణ మనియు, వానియధోగమనము దక్షిణాయన మనియు నీరెండుమార్గములును గలస్నాయుమయంబగుశరీరము సంవత్సరంబనియుఁ బ్రశంసింతురు. ఉత్తరాయణమార్గమునం బోవువారికిఁ బునర్జన్మంబు గలుగదు.

నాభియం దుత్పన్నములైనవి మూఁడువేలనాడులు. తొంబదియాఱువేలనాడులు హృదయమునుండి జనియించినవి. శుభదాయకం

బు లగునానాడులయందు విశ్వమూర్తి సుప్రతిష్ఠితుండై యుండును. ఈనాడుల నన్నిటిని బరిత్యజించి కేవలము బ్రహ్మనాడి నాశ్రయింప వలయును. సముద్రమునుండి తరింపఁజేయునౌకవలె నీబ్రహ్మనాడి తన్నాశ్రయించినవానిని సకలదుఃఖసమూహమునుండియు నుత్తీర్ణునిం గావించును. నిరాలంబ యగునొకనాడి తాలుమధ్యమునుండి మస్తక మువఱకును వ్యాపించియుండును. స్వర్గగామిని యగునానాడి యోగీం ద్రులకు మోక్షప్రదాయకమైనది. శుక్రశోణితంబులవలనరూపొంది మేదోమాంసకఫపిత్తాదులచే నతిదూషితంబైనయీశరీరము ధ్యాన యోగప్రవాహముచే సకలదోషవిముక్తంబు గాఁగలదు. ధ్యానయో గసిద్ధుఁడు మస్తకమునందలియీశ్వరస్థానమునుండి యూర్ధ్వగతింగాంచి సూర్యసమతేజస్సంపన్నుఁడై యాదిత్యాగ్నిలోకంబులకంటెను నూర్ధ్వ స్థితంబగుదివ్యలోకము నధిగమించి శాశ్వతానందసంపన్నుండు గాఁ గలఁడు. ఆతఁడు సకలదేవతలు, మహర్షులు, బ్రహ్మవిష్ణుమహేశ్వరు లు, వాయువు, యముఁడు, అగ్ని, వరుణుఁడు, శశాంకుఁడు మొదలగు వారిని గ్రమముగా దర్శించుచు స్వర్గలోకగమనంబు గావించును. స్వర్గసంస్థితుండగు యోగీంద్రునిం గాంచి దేవతలందఱు నాతనిమాహా త్మ్యము బ్రశంసించుచు స్తవధ్యానగానపూజాదులచే నాతనిసన్మానిం చుచుందురు. ఈవిధముగా గౌరవింపఁబడుచు యోగీంద్రుఁడు పరమ పదం బగునీశ్వరధామమునందుఁ బరమానందముతో విరాజిల్లు చుండును.

## —• అవిముక్తక్షేత్రమాహాత్మ్యము. •—

అవిముక్తక్షేత్రమాహాత్మ్యమును, ఓంకారేశ్వరప్రభావమును దెలుపవలయు నని వ్యాసుండు ప్రశ్నించుటయు సనత్కుమారుం

డిట్లనియెను. వ్యాసమునీంద్రా! ఈయుత్తమయోగము పరమరహస్య మైనది. పరమపదాభిలాషులగు దేవతలకుఁగూడ నీరహస్య మవేద్య మైనది. అవిముక్త క్షేత్రకథాప్రసంగముగూడ నతిదుర్లభ మైనది. ఆసత్యక్షేత్రమునం దెట్టిపాపములును వర్ధిల్లనేరవు. నేనీవిషయంబునఁ బార్వతీపరమేశ్వరసంవాదమును వినియుంటిని. ఎట్లువినియుంటినో యట్లే నీకుఁ జెప్పెదను.

ఒకనాఁడు పార్వతీదేవి మహాదేవుఁ డగుపరమేశ్వరునింగాంచి నాథా! ఉత్తమంబును, బరమరహస్యంబును, బవిత్రంబును నగుముక్తి పదతీర్థముంగూర్చి నాకెఱింగింపవలయు నని ప్రార్థించెను. అప్పుడు మహాదేవుండు బాగుగ నాలోచించి తనకతిప్రియకరంబు లగుపుణ్య క్షేత్రములలోఁ గాశీధామముకంటె నతితరం బగుపవిత్రతీర్థమేదియు లేకుండుట నిశ్చయించి పినాకధారియు, వరదుండును, జగన్నాథుండు నగుశివుండిట్లు చెప్పంబోడంగెను. ఏకారణముచే నాకాయవిముక్త క్షేత్ర మత్యంతసంతోషదాయకమైనదియో చెప్పెదను. ఏకాగ్రచిత్త ముతో నాకర్ణింపుము.

ఓసుందరీ! సకలసిద్ధాంతసారమును, సర్వస్మృతిసారమును, చతుర్దశభువనసారమును, మోక్షప్రాప్తికి ముఖ్యసాధనమును, పరమగుహ్యంబును, స్వయంప్రకాశకంబు నగునాత్మజ్ఞానము శివనగరంబగుకాశీధామమునందు సాక్షాత్కరించి యుండును. ఓసుశ్రోణీ! ఆకారణముచేతనే నేనాక్షేత్రమునందు నిత్యసన్నిహితుఁడనై యుందును. ఆకాశీ వియోగము నాకత్యంతమును మనస్తాపముం గూర్చుచుండును. ఆయవిముక్త క్షేత్రమునందును, పంచాయతనక్షేత్రమునందును నివసించి యోంకారేశ్వరుం డగుమహాదేవుని బూజించుట యవశ్యకర్తవ్యము. అకార, ఉకార, మకారము లామహేశ్వరుని త్రివిధరూపములు.

ఆతఁడు త్రిలోకపాలకుఁడును, త్రిలోకభోక్తయు నై యుండును. ప్రభుం డగునోంకారేశ్వరుఁడు మాయాతీతుఁడు. సంయమీంద్రుల కాతని సాక్షాత్కారము లభించును. అట్టియోంకారేశ్వరు నెఱింగిన దృఢ వ్రతులగు శివభక్తులే యుత్తమోత్తములు. దేవీ! శివభక్తులు నాకుఁ బుత్రసమానులు. అట్టిమద్భక్తశ్రేష్ఠులు రుద్రావాసమును, బరమ పదంబు నగునయ్యవిముక్తక్షేత్రమును భక్తియుక్తులై సర్వదా సంద ర్శించుచుందురు.

ఓంకారము పరమపదార్థ మగుపరబ్రహ్మమని పండితులు ప్ర శంసించుచుందురు. ఆయోంకారేశ్వరుఁడే సద్యోజాతాదిపంచబ్రహ్మ మయుండై విరాజిల్లుచుండును. పంచాయతనసంస్థితుఁడగు పరమేశ్వ రుని సందర్శించువారు మోక్షపదప్రాప్తు లగుదురు. వేదవేదాంతపారంగు లును, పుణ్యకర్ములును, యతీంద్రులును, వేదశాస్త్రపరాయణులగుగృ హస్థులును, వారికంటెనధికులగుత్రికాలోపవాసకులును, ఏకదండధరులును, త్రిదండులును, పరమహంసవ్రతులగుయతులును, శైవులును, పాశు పతులును గాపాలికులునుగూడఁ బరమపదం బగునయ్యవిముక్తక్షేత్ర మునందు శైవశాస్త్రానుసారముగా మానవ్రతము నవలంబించి సర్వ దా నన్నుపాసించుచుందురు. ఇట్లు వివిధరూపంబులచే నన్నారాధించు మద్భక్తగణంబులయెడల నేనతిసంతుష్టుండనై వారివారియభీష్టంబుల ననుసరించి పరమం బగుమోక్షపదంబును బ్రసాదించుచుందును.

అయ్యవిముక్తక్షేత్రమునందు ముక్తిప్రదం బగుశ్మశానము సు ప్రసిద్ధంబైనది. పాశుపతదీక్షితులును, సకలదేవతలును, గంధర్వులును బవిత్రంబగునాక్షేత్రమును సేవించుచుందురు. అందు భక్తార్తినిస్తార కుం డగునవిముక్తేశ్వరుఁడు నిత్యసన్నిహితుఁడై యుండును. దేవీ! నేను నిరంతరమును గాశీధామమునందు నివసించియుండుటచేతనే దానికి జగ

ద్విఖ్యాతం బగుచవిముక్తనామము గలిగినది. ఆదివ్యక్షేత్రమునందు సంసారభీరులకు సకలభయనివారణము గాఁగలదు. అచ్చట వెలసియు న్న శ్రీవిశ్వనాథుని సందర్శించువారికిఁ బునర్జన్మంబు గలుగదు. సిద్ధక్షేత్రమును తపఃక్షేత్రము నగువారాణసి యెట్లు సర్వోత్కృష్టమైనదో, యట్లే యోంకారేశ్వరావిముక్తేశ్వరలింగములును సర్వోత్తమంబులైనవి. భవమోచనుం డగునవిముక్తేశ్వరుని నిత్యమును సంస్మరించుట యావశ్యకర్తవ్యము.

విశ్వేశ్వరునకు సమీపమునందున్న జ్ఞానవాపియందలిదివ్యజలంబును సందర్శించుమానవులు భూమండలంబునఁ గృతార్థు లగుదురు. అమృతోపమానంబు లగునవ్వాపీజలంబులు కలికాలంబున దేవతలకుఁ గూడ నతిదుర్లభములైనవి. ఆపుణ్యోదకంబులు సకలజీవనిస్తారకంబులును, సకలపాపవినాశకంబులునై యుండును. ఆవాపీతీరమునందుఁ బూర్వము జైగీషవ్యుఁడను మునీంద్రుఁడు క్రోధమూర్తియగుమృత్యువును బరాభవించెను. అచ్చట సంధ్యోపాసనంబు గావించినచో నక్షయం బగుబ్రహ్మస్వరూపప్రాప్తి యగును. అందొకసారి సంధ్యోపాసనంబు గావించినచో దశమాసంబులు త్రిసంధ్యలయందు నాచరించిన ఫలంబు లభించును. ఏదివ్యక్షేత్రమునందు దేవదేవుం డగువిశ్వేశ్వరుండును, నదీలలామ యగుగంగాదేవియు, ముక్తిదాయకం బగుమరణంబును సుప్రశస్తంబులై యుండునో యట్టికాశీధామమునందు నివసింపవలయునను సత్సంకల్పము గలుగనివా రెవ్వరుందురు?

## —♦ హరికేశచరిత్రము. ♦—

సనత్కుమారుం డిట్లనియెను. శ్రీమంతుఁడును, బ్రహ్మనిష్ఠుఁడును, ధార్మికుండు నగుహారికేశుం డనునొకయక్షుండుగలఁడు. ఆతఁడు

యక్షగణంబులలోఁ బ్రబలప్రతాపశాలియై యుండెను. ఆతనిజనకుఁడు పూర్ణభద్రుఁడు. ఆహరికేశుఁడు జన్మించినప్పటినుండియు శివప్రీతుఁడై మహాభక్తిసంపన్నుఁడై యుండెను. శివనిష్ఠుఁడును, శివప్రణతుఁడును, శివభక్తుఁడును, శివపరాయణుఁడునగునమ్మహాత్ముఁ డాసన శయన గమనావస్థానానుగమన భోజన ధావనాదిసకలసమయములయందును శివస్వరూపధ్యానతత్పరుఁడై విరాజిల్లుచుండెను.

హరికేశుఁ డిట్లు నిరంతరశివచింతాతత్పరుండై యుండుటం గాంచి యాతనితండ్రియగు పూర్ణభద్రుఁడు, కుమారా ! నీవీరీతి నన్యభావంబున మెలంగుచున్నంతవఱకు నేను నిన్నుఁ బుత్త్రునిగా భావింపఁజాలను. యక్షవంశమున జన్మించినవారి కిట్టిసంకల్ప మనుచితముగాదు. గుహ్యకులు స్వభావముచేతనే క్రోధచిత్తులును హింస్రకులును మాంసభోజనులు నై యుందురు. నీవిప్పు డేధర్మము నవలంబించితివో యది నీకెప్పటికిని యుక్తమైనది గాదు. మహాత్ముల కీవిధాన మనుచితమైన నగుఁగాక ! స్వయంభూవివేచనచే మానవు లెవ్వనిఁ బూజనీయునిగా భావించుచుందురో యాతఁడు యక్షులకును బూజ్యుండు గానేరఁడు. మఱియు నన్యాశ్రమకర్మంబులు గృహస్థుల కుచితంబులు గావు. మే మనేకవిధంబులగు సత్కర్మములం గావించి తత్ప్రభావముచే మనుష్యభావము నతిక్రమించి దేవయోనిత్వరూపంబగు శ్రేష్ఠపదంబును గాంచఁగలిగితిమి. నీవిప్పు డాచరించుచుండుసకలకర్మంబులును మానవభావవిశిష్టులైనవారి కుచితములైనవిగాని మనవంటియక్షులకుఁ దగినవి గావు. నేనట్టిధర్మప్రాప్తిని గోరువాఁడఁ గానని యు నిశ్చయముగా నెఱుంగుము. అని యిట్లు ప్రతాపవంతుండగు పూర్ణభద్రుఁడు తనకుమారుని నిందించుచు నీవతిశీఘ్రముగ నిచ్చటినుండి నీయిచ్చవచ్చినచోటికిఁ బొమ్మని యాజ్ఞాపించెను.

అనంతరము మహాత్ముండగుహరికేశుఁడు తండ్రియానతి ననుస రించి నిజగృహంబునుండి వెలువడి వారాణసీధామమునకుఁ బోయి యచ్చట నతివినిర్మలభావముతోఁ దపంబు సేయఁదొడంగెను. ఆతపస్సమయమునం దాతఁడు స్థాణువువలెను, శుష్కకాష్ఠమువలెను, శిలావిగ్రహమువలెను నిశ్చలుఁడై యుండెను. ఆతఁడు కులమును, జాతిని, వృత్తినిగూడఁ బరిత్యజించియుండెను. ధర్మాత్ముఁ డగుహరికేశుఁడు కాశీధామముం జేరి మహాయోగులందఱిచేతను నిత్యారాధితుం డగుశ్రీగోకర్ణేశ్వరునిదివ్యాలయంబునకు సమీపమున నేకాగ్రంబగుప్రసన్నచిత్తముతో నధివసించియుండి జితేంద్రియుఁడై నిశ్చలభావముతోఁ దపశ్చరణంబు గావించుచుండెను.

ఈరీతిగా వేయిసంవత్సరములు గడచిపోయెను. అప్పటికి మహాదేవుం డాతనియెడల ననురక్తుండయ్యెను. ఆతనిశరీరమంతయును వల్మీకమయమైపోయెను. చీమలు, చెదలు మొదలగునవి యాతనిశరీరమునంతను దొలిచివేయుచుండెను. నిరంతరమహాదేవచింతాపరాయణుఁడై యున్నయాతనిశరీమంతయు నీవిధముగా రక్తమాంసవివర్జితమైపోయెను. అస్థిమాత్రావశిష్టంబగునాతనిదేహము కుందేందుశంఖప్రభాసంపన్నమై విరాజిల్లుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు పార్వతీదేవి యాత్మేశ్వరుం డగుపరమేశ్వరుం గాంచి దేవరయుద్యానవనమును మరలనొకసారి దర్శింపవలయునని నాకతికుతూహలముగానున్నదని ప్రార్థించుటయు, మహేశ్వరుండు తత్క్షణంబ పార్వతీసహితుఁడై బయలుదేఱి పోయి యాదేవి యడిగిన ప్రశ్నంబులకుఁ దగినయుత్తరంబులను బ్రసాదించుచు నుద్యానవనసౌందర్యము నామెకుఁ బ్రదర్శించుచుండెను.

వివిధంబులగుపుష్పితతరులతాగుల్మంబులును, బ్రఫుల్లకుసుమ

సంశోభితంబులగు కేతకవృక్షములును, రమణీయం బగునాయుద్యానవన మునకు శోభాసౌరభసంపాదకములై విలసిల్లుచుండెను. అందందుఁ బరి మళించుచున్న పువ్వులచేఁ జీకటిమ్రాకులగుంపులు, నిండారఁబూచినకొం డగోఁగులు, పొగడలు, అశోకములు, సురపొన్నలు మొదలగువానియం దుఁ దుమ్మెదలుమూఁగి ఝుంఝుమ్మనునొదలచేఁ జెవులపండువు సేయు చుండెను. అందందు వికసించినతామరపూవులనుండి వెలువడుపుప్పొడు లు దిక్కనిచక్కనిఱెక్కలపై బంగరుహారంగులఁ దులుంగలించుచు వివిధసౌరభముల వెదజల్లుచుండ రాయంచలును, జక్కవలు, నతిరమ ణీయంబులగుకలకూజితంబులొనర్చుచుండెను. ఒకచోఁ బక్వజంబూఫల రసపిష్టంబులగు కలవిహంగముల సరళకంఠస్వరము లమృతమధురర సమును గురియించుచుండెను. ఒకచోఁ గలహంసకారండవాదిజల విహంగమకులంబులును, మధుమత్తాళికులంబులును దమయుత్తమా లాపంబులచే నాప్రమోదవనరామణీయకమును ద్విగుణీకృతముఁ గా వించుచుండెను. ఇంకొకచోట నప్రతిమానచారుసౌరభసంపన్నములైన పుష్పంబులచే నిండి యొప్పుచుండిన వృక్షరాజంబులచుట్టును భ్రమ రాంగనాగణంబులు మూఁగుచు నొదసేయుచుండెను. వేఱొకచోటఁ బుష్పవంతంబులైన సహకారవృక్షంబులును, ఫలసూనభారంబున నేల కొఱఁగుచున్న బొట్టుగుచెట్లును కన్నులపండువు గావించుచుండెను. మఱియొకచోట సవిలాసంబుగఁ గిన్నరవీణె మొదల్చుచుఁ బాటలుపాడు చున్నవిద్యాధరచారణగణంబులును, ఆచారుగానంబుల కానందించు చుఁ దదనుసరణంబుగ నృత్యములు సలుపుచున్నయప్సరోగణంబు లును నొప్పారుచుండెను. ఒక్కయెడఁ బరిహృష్టంబు లగునానావిధ పక్షికులంబులు మనోహరకూజితంబు లొనర్చుచుండ, నింకొక్కయెడఁ బ్రమత్తంబు లగుననుపుపిట్టలు చిత్రచిత్రంబుగఁ గూయుచు వీనులకు

విందులు గూర్చుచుండెను. వేఱొక్కయెడ, మృగేంద్రంబు లతిభయకరంబుగ నొనర్చుగర్జారవంబులకు భీతిల్లి మదపుటేనుంగులు పరువులు వాఱుచుండ, మఱియొక్కయెడ నితరమృగంబులు గుంపులుగుంపులుగఁ గూడి యొదిఁగియొదిఁగి డాఁగుకొనుచుండెను. ఒకచోఁ బ్రఫుల్లనానావిధమహోత్పలవనంబులచే మనోజ్ఞంబు లగుచున్న బహువిధకాసారంబు లాయుద్యానవనశోభకు వన్నెవెట్టుచుండెను. వేఱొకచో సాంద్రనిబిడవృక్షపంక్తి తనవినీలకాంతులచే జలధరభ్రాంతిని గూర్చుచుండ నీలకంఠనివహంబులు మనోహరారావంబులు సలుపుచు నృత్యములొనర్చుచుండెను. మఱియొకచోటఁ బ్రమోదమత్త నానావిధ విహంగమంబులు చారునినాదంబులు గావించుచు హాయిఁ గూర్చుచుండెను కుసుమితతరుశాఖలయందు మదమత్తద్విరేఫంబులు వ్రాలి విలీనములగుచు వింతలుగొల్పుచుండ, నవకిసలయయుక్తంబు లగు తరుశాఖలు ప్రాంతభాగంబులకుసముచితము వినూత్నశోభను జేకూర్చుచు నయ్యారామరామణీయకమును బెంపొందించుచుండెను.

రమ్యతరం బగు నయ్యుద్యానవనవాటికయం దొక్కొక్కచోట ద్రాక్షాదిలతాప్రకాండములు మిక్కిలియుఁ బొదిగొని యొండొంటిని ముద్దులుగొనుచున్నవో యనునట్లు దట్టముగా నల్లుకొనియుండ, నొక్కొక్కచోట నానావిధలతామతల్లికలు మనోహరవృక్షరాజంబులను సవిలాసంబుగ నాలింగన మొనర్చుచున్నవో యనునట్లు చుట్టుకొని యలరారుచుండెను. అతివిశాలం బగు నాసుందరోద్యానంబునందు చారువిహారంబు లొనర్చుచు నలసి సొలసి యున్న కిన్నరవిలాసినీమణుల యొయ్యారంపునడకలయొప్పిదంబు లెంతయు నింపులు సంపాదించుచుండెను. అచ్చటచ్చట నాకాశము నొరయుచున్న చారుశృంగములయందు పారావతగణంబులు మురిపంబులు గులుకఁ గలధ్వానంబు

లొనర్చుచు వినోదించుచుండెను. అచ్చటచ్చట జాతి పడియున్న ధవళ ప్రసూనంబులు దేవతోద్యానంబులను హసించుచున్నవో యనునట్లు విలసిల్లుచుండెను. ఆరమణీయవనంబునం గల జలాశయంబులు వికసించుచున్న యుత్పలములచేతను, సారసములచేతను, జలపక్షులచేతను హంసరాజంబులచేతను దేవమార్గంబులను బ్రకాశింపఁజేయుచుండెను. పుష్పమాలాగళితములైన కుసుమనికరంబులు సుందరమందిరంబులకు నలంకారశోభను సమకూర్చుచున్నట్లు పెనఁగొన్న గుల్మములతో నెసంగువృక్షశాఖల్లు విహంగశ్రేణులతో విలసిల్లుచుండెను. పుష్పస్తబకతరళములైన నీలాశోకశాఖాగ్రములు ఝంఝుమ్మని రొదసేయుచున్న మత్తభ్రమర మధురసంగీతములచే శోభిల్లుచుండెను. పుష్పించియున్న బొట్టుగు చెట్లకొమ్మలు రాత్రికాలములయందు ప్రకాశించుచుఁ జంద్రకిరణకాంతులతో సల్లాపములు సలుపుచుండెను. వృక్షచ్ఛాయలయందు నిద్రించుచుండిన హరిణకులంబులు మేల్కాంచి యయ్యుద్యానవనంబునందున్న కుశాంకురాగ్రంబులను బ్రీతిమెయిఁ గొఱుకుచుండెను. విశాలజలాశయంబులయందలి స్వచ్ఛనీరంబులును నీరేజంబులును మరాళకులంబుల పక్షసమీరణంబులచే వికంపితంబు లగుచుండెను. ఆ కాసారతీరంబులం గల కదళీవనంబులయందు మయూరగణంబులు మనోహరంబుగ నృత్యంబులు సేయుచుండెను. మయూరగణంబుల పక్షవిక్షేపప్రవిమలకాంతులు ప్రసరించిన తావు లెల్లఁ జిత్రవిచిత్రశ్రీలచే నెసలారుచుండెను. మఱియు, ననేకస్థలంబులయందు ప్రముదితంబు లగు హారీతపక్షికులంబులు నృత్యంబు లొనర్చుచుండెను. ఒకచోట హరిణనికురంబులు నిర్భయముగ విహరించుచుండెను. మఱియొకచోట విచిత్రవర్ణసహితంబు లగు కుసుమచయంబులు విలసిల్లుచుండెను. ఇంకొకచోటఁ గృష్ణవర్ణశోభిత లగు కిన్నరకామినీమణులు మధుపయు

క్తంబులును మనోహరంబులును నగుపచ్చనిచెట్లనీడల విహరించు చుండిరి. వేఱొకచో మునీంద్రులయాశ్రమములయందున్న పాదపశ్రే ణు లావాసయోగ్యములై విశాలములై శాంతిప్రదములై నయ్యారా మవాటిక నలంకరించుటకు సమ్మిళితములైనట్లు శోభిల్లుచుండెను. ఒక్కెడఁ బ్రఫుల్లములైన మాధవీలతామండపాభ్యంతరంబులయందు సిద్ధగణంబులు పరస్పరము నామోదించుచుండిరి. సిద్ధకామినీమణుల సువ్యక్తమధురప్రియవాక్యములచే నయ్యుద్యానవనభాగము మనోహ రంబగుచుండెను. అచ్చటచ్చటఁ బ్రేంకణపుఁజెట్లపూవుగుత్తులయందు మధుపనివహంబులు గుమిగూడి విలీనములగుచుండెను. మఱియు, నరవిరిసిన కదంబపుష్పంబులు భ్రమరగణసంయోగంబున నుత్ఫుల్లము లగుచుండెను. కుసుమోత్కరశాఖల నూఁచినైచుచున్న సమీరణునిచే సమీపముననున్న వెదురుపొదలు నేలనంటుచుండ నచ్చట డాఁగియు న్న మృగసమూహంబులు బెదరి కొండొకనివాసంబులకుఁ బరువులెత్తు చుండెను. అతివిస్తర మేల? పరమపావనం బగు నయ్యుద్యానభూమి తన్నాశ్రయించియున్న లతావృక్షాదిప్రాణికోటులకునయితము ముక్తిని సంపాదించు ననుట నిశ్చితార్థంబ. చంద్రకిరణోజ్జ్వలంబులగు మనో హరతిలకంబులును, సిందూరకుంకుమకుసుంభసన్నిభాశోకంబులును, సువర్ణవర్ణకర్ణికారంబులును, ఫుల్లారవిందపదచిత్రితంబులగువిశాలవృ క్షంబులును, నప్పవిత్రారామంబున నొప్పారుచుండెను. ఒకచోనింద్ర నీలమణిసన్నిభకృష్ణవర్ణంబులును, నింకొకచో పద్మరాగమణిసంకాశ రక్తవర్ణంబులును, వేఱొకచో మనోహరహీరమణిసదృశశుభ్రవర్ణంబు లును నగు కుసుమరాజంబులచే నయ్యుద్యానంబు విరాజిల్లుచుండెను. పున్నాగవృక్షాగ్రములయందు గూర్చుండి పక్షిగణంబులు కలకూజి తంబు లొనర్చుచుండెను. రక్తాశోకకుసుమస్తబకంబులు సమీరవశం

బునఁ గంపితము లగుచుండెను. శ్రమాపహారుఁ డగు సమీరణుం డారమణీయవనంబున మెల్లఁగ విహరించుచుండెను. వికసితకమలవనంబుల భ్రమరంబులు నృత్యంబులు సేయుచుండెను.

ఆమనోహరసమయంబున మత్తహృష్టప్రాణిపూర్ణంబును, వివిధ విశాలతరుసంపన్నంబును నగునయ్యుద్యానవనంబునకు హిమాలయ శిఖరవాసియు, సకలభువనకర్తయు, లోకనాథుండునునగు మహాదేవుండు కొందఱు గణనాయకులతో పార్వతీదేవీసహితంబుగ విచ్చేసి భవాని నవలోకించి యయ్యారామరామణీయకంబు నామెకుఁ జూపుచు వర్ణించుచుండ, నద్దేవి యమ్మహాదేవున కిట్లనియెను. దేవా! పరమశోభాసంపన్నం బగు నియ్యుద్యానవనంబును బ్రహర్షంబుతో నవలోకించితిని. ఇఁక నవిముక్తక్షేత్రమాహాత్మ్యమును గ్రమ్మఱ వర్ణింపఁగోరెదను. ఈక్షేత్రమాహాత్మ్యము నింతకుమున్న కొంత వినియున్నను దానియందు నాకుఁ బరితృప్తి కలుగలేదు. కావున, నింకను విపులముగ వినఁగోరుచున్నాను. అనుటయు దేవదేవుం డిట్లు చెప్పందొడంగెను.

దేవీ! వారణాసి గుహ్యతరమైన మదీయపుణ్యక్షేత్రము. ఈ క్షేత్రము నిఖిలప్రాణులకు నిరంతరముక్తికి హేతుభూత మైనది. ఈస్థానంబునందు మదీయలోకప్రాప్తి నిచ్ఛగించుసిద్ధగణంబులు శివచిహ్నాధారులై యస్మద్వ్రతావలంబనంబుచే సంయతచిత్తులును, జితేంద్రియులునై సంతతపరమయోగాభ్యాసమును జేయుచుందురు. నానా వృక్షసమాకీర్ణంబును, నానాపక్షివిరాజితంబును, కమలకల్హారాది సుమపరిశోభితసరోవరసంయుతంబును, గంధర్వాప్సరోగణసంసేవితంబును నగు నీక్షేత్రంబునందు నెల్లప్పుడు నేను నివసించియుండుటకుఁ గలకారణంబును వివరించెద నాలింపుము. ఈస్థానంబునం దుండి మామకభక్తుండును, మదర్పితచిత్తుండును, మత్సమర్పితకర్ముండు నగువాఁ డెవ్వఁడై

నను ముక్తిలాభము నందునట్లు మఱియెవ్వఁడైనను వేఱొకచోటనుండి దానిని బొందఁజాలఁడు. ఈనాదివ్యక్షేత్రము గోప్యంబులలో నతిగోప్యమైనది. బ్రహ్మాదిదేవగణంబులు ముముక్షువు లగు సిద్ధగణంబులు మాత్రమే దీని నెఱుంగుదురు. దీనిని నే నెన్నఁడును విడిచియుండకపోవుటచేతనే దీనికి ‘‘అవిముక్తక్షేత్ర’’ మను నామము గలిగినది. నైమిశారణ్యంబునఁగాని, కురుక్షేత్రంబునఁగాని, హారిద్వారంబునఁగాని, పుష్కరతీర్థంబునఁగాని స్నానావాసంబులఁ గావించువారికైనను లభింపని ముక్తిలాభము తప్పక యీక్షేత్రంబువలనఁ జేకూరుచున్నది. ఇందువలననే యిది సర్వోత్కృష్ట మని యెంచఁబడుచున్నది. ముక్తిదాయకమును, మత్పరిగృహీతంబును నగుక్షేత్ర మిదియే. తీర్థరాజం బగు ప్రయాగకంటె నీక్షేత్రమే శ్రేష్ఠమైనది. ఇందుండియే యింద్రియజిగీషువులును, మహాతపస్సంపన్నులును నగువారు పరమసిద్ధిలాభము నందఁగలుగుచున్నారు. మఱియు, నిందు నన్నుఁ జింతించి, నాయందు భక్తి కలిగి మెలంగువాఁడు యోగిజనసాధ్యం బగుజ్ఞానసంపద నందఁగలుగుచున్నాఁడు. అట్టివాఁ డీక్షేత్రంబున నివసించి నిశ్చలచిత్తముతో నన్ను ధ్యానించుచు, యోగబలంబు నంది పరమనిర్వాణపదప్రాప్తుఁ డగుచున్నాఁడు.

దేవదుర్లభంబును, పరమకైవల్యప్రాప్తిభూతంబును నగు నవ్యక్తలింగ మీక్షేత్రమునందే విరాజిల్లుచున్నది. సర్వసిద్ధాంతవేత్త లగు మునీంద్రు లన్యస్థానదుర్లభం బగుముక్తి నిందే పొందఁగలుగుచున్నారు. నేను వారికి సప్రతిమానంబగు యోగైశ్వర్యంబును, నాత్మసాయుజ్యంబును, నభిలషితస్థానంబును నిచ్చుచున్నాను. యక్షాధినాయకుం డగుకుబేరుండు మదర్పితకర్ముండై యీక్షేత్రమున నన్ను భజించినవాఁడై, గణేశ్వరత్వప్రాప్తి నందినవాఁ డయ్యెను. ఓదేవీ!

సంవర్తభావితార్థులను మహర్షులిందుండియే భక్తిశ్రద్ధలతో నన్నారాధించి యథాక్రమముగ సిద్ధిలాభము నందఁగలిగిరి. ఓకమలనేత్రీ! భవిష్యద్ధర్మవక్తయు, వేదశాస్త్రవిభాజకుండును, బరాశరనందనుండును, యోగిపుంగవుండును, మహాత్ముండును, మునిశ్రేష్ఠుండును, నగువ్యాసమహర్షి యీక్షేత్రమునందే సుఖావాసము నందినవాఁడయ్యెను. సువ్రతా! సమస్తర్షిగణంబులును, బ్రహ్మవిష్ణుసూర్యేంద్రాది సకలదేవతలును నిందే నన్నుపాసించుచున్నారు. ఇతరులగు సిద్ధయోగిగణంబులునునీస్థానంబునందేప్రచ్ఛన్నంబుగ మహావ్రతావలంబనంబుఁగావించి యనన్యమనస్కులై నిరంతరము నన్నుధ్యానించుచున్నారు. నాయనుగ్రహంబును గాంచి ముక్తికామిని కలంకారప్రాయమగు నీనగరరాజమునం దధివసింపఁగల మానవుండు తొలుతఁజాతుర్వర్ణ్యసమాకులంబును, జనపదాకీర్ణంబును నగు విశాలరాజ్యము నంది పిదప నాయందు సర్వము నర్పించి నన్నుఁ బొందఁగలుగుచున్నాఁడు.

ఓసుందరీ! ఈక్షేత్రంబున నివసించువాఁడు గృహస్థుండైనను, బ్రహ్మచారియైనను, మద్భక్తుండును, మదర్పితచిత్తుండును నై మదనుగ్రహంబున పరమదుర్లభం బగుముక్తిలాభము నందఁగలుగుచున్నాఁడు. విషయాసక్తచిత్తుండును, ధర్మత్యాగియు నైనమానవుండనయితమిచ్చట మృత్యువును బొందెనేని మరల నెన్నఁడు నిహసంసారమునఁ బ్రవేశింపఁడు. మఱియు, మాయామమతావిహీనుండును, సత్త్వగుణసంశోభితుండును, జితేంద్రియుండును నగువాఁడు విజనప్రదేశంబున నిష్ఠాపరుండై సర్వదా నన్నుఁ జింతించి సంగత్యాగియై మదీయప్రసాదంబున మోక్షపదము నందఁగలుగుచున్నాఁడు. యోగీంద్రులైనవారనేకసహస్రజన్మంబులకైనను బొందఁజాలనిముక్తి యీమహాక్షేత్రంబున మృతిఁజెందుప్రాణికోటికిఁ గరతలామలక మగుచున్నది. దేవీ! పరమర

హాస్యం బగునీక్షేత్రమాహాత్మ్యమును సంగ్రహముగ నీ కనువదించితి ని. ఇది యాశ్రిమగణంబుల కశేషఫలజనకమైనది. దీని కతిరిక్త మైన రహాస్యసిద్ధి యిఁక లేదని యెఱుంగుము. మహాయోగీంద్రులుమాత్ర మే యీరహస్యము నెఱుంగుదురు. ఇదియే పరమజ్ఞానము. ఇదియే పరమకల్యాణజనకము. ఇదియే పరబ్రహ్మస్వరూపము. ఇదియే పరమ పదము. గిరినందనా! ఈవారణాసీనగరము త్రిభువనసారభూతమైనది. పర మరమణీయమైనది. పరమపాపాత్ముఁడు సయితమిందుండి పాపవి మోచనుఁ డగుచున్నాఁడు. సుందరతరులతాగుల్మాదిపరిశోభితంబును నాకతిప్రియంబును నగు నీపుణ్యక్షేత్రము స్మరించు స్వాధ్యాయనియ మశూన్యుఁ డగునజ్ఞానిసయితము పరమపదప్రాప్తి నందుచున్నాఁడు. సందియములేదు. ఇట్లు చెప్పుచు నాసమయమున మహాదేవుఁడు భక్త శ్రేష్ఠుం డగుహరికేశునికి వర మనుగ్రహింపనెంచి పార్వతిం గాంచి మరలనిట్లు వచించెను. ఓవరవర్ణినీ! ఈయక్షకుమారుండు నాకుఁ బరమ భక్తుండు. నిరంతరతపోనియమాదులచే నీతండు పాపవిముక్తుండై యి ప్పుడు మదీయవరప్రసాదంబున కుపయుక్తుండై యున్నాఁడు.

## —♦దండపాణివరప్రదానము.♦—

ఈప్రకారము జగత్పతి యగుపరమేశ్వరుండు పలికి దేవీసహితుం డై హరికేశుని సమీపించెను. శల్యావశిష్టుండై యున్న యాయక్షుండు దేవదేవుం గాంచి భక్తిపూర్వకంబుగఁ బ్రణతుం డయ్యెను. అంతట వృషభధ్వజుం డతనికి దివ్యచక్షువుల ననుగ్రహించుటయుఁ దత్ప్రభా వంబున నయ్యక్షుండు ప్రమథగణాధినాయకుం డగు నప్పరమేశ్వరు నవలోకింపఁ గలిగినవాఁ డయ్యెను. అప్పుడు దేవదేవుం డనుగ్రహ పూర్వకంబుగ నిట్లనియెను—వత్సా! త్రిలోకదుర్లభం బగు వరంబును నీకు నొసంగుచున్నాను. సంపూర్ణసౌందర్యశరీరుండవై నన్ను సమీ

పింపుము—అనుటయు వరదానకలితుం డగు నయ్యక్షుండు పూర్వరీతిఁ బరిపుష్టశరీరుండై పరమేశ్వరుని పాదమూలంబులం బడి ప్రాంజలిబద్ధమస్తకుండై యిట్లు ప్రార్థించెను—ప్రభూ! నీయందు నాకు నెల్లప్పుడు వినిశ్చలమును, వినిర్మలంబును నగు భక్తి యుండునట్లును, నక్షయ్యంబగు గాణపత్యలాభంబు నంది లోకంబున నన్నదాతనై యుండునట్లును, అవిముక్తదుత్తారవనంబున నివసించుచు నిరంతరము నిన్నుఁ జూచుకొనుచుండునట్లునాకు వరముం బ్రసాదింపుము.ఇదియే నాకోరిక. అని వేఁడుటయు నప్పుడు మహాదేవుం డిట్లు పలికెను. కుమారా! నీవు జరామరణాదిసర్వదుఃఖవిహీనుండవై నాగణంబుల కధిపతివి గమ్ము. ఎల్లరకును బూజ్యుండవై వరప్రదాత వగుము. ని న్నెవ్వరును బరాభూతునిఁ జేయఁజాలరు. నీవు యోగబలసంపన్నుండవును, నైశ్వర్యయుక్తుండవును నై లోకంబున నన్నదాతవును, క్షేత్రపాలకుండవును గమ్ము. నీవు మహాబలపరాక్రమవంతుండవై నాకును బ్రహ్మకును బ్రియపాత్రుండ వగుము. యక్షేశ్వరుండవును, దండపాణివియు,మహాయోగివియు నగుదువుగాక ! ఉద్భ్రముఁడు, సంభ్రముఁడు నను ప్రమథు లిరువురును నీకు సేవకులై నీయాజ్ఞను బరిపాలించుచుందురు—ఇట్లనుగ్రహించి మహాదేవుండు రుద్రావాసంబునకుఁ జనియెను.

—♦ ఓంకారేశ్వరవర్ణనము. ♦—

అనంతరము సనత్కుమారుండు వ్యాసమహర్షితో నిట్లు చెప్పెను. ద్విజశ్రేష్ఠా! పూర్వకల్పంబున వారాణసీనగరోత్తరభాగంబునఁ బంచాయతనం బనుతీర్థరాజం బొకండు గలదు. తత్తీర్థవృత్తాంత మత్యంతాశ్చర్యకరం బైనది. దాని నిప్పుడు నీకుఁ జెప్పుచున్నాను. అనన్యస్వాంతుండవై యాకర్ణింపుము—అత్యుత్తమం బగునాపంచాయతనదివ్యతీర్థంబునఁ బూర్వ మొకమండూకి (అఁడుకప్ప),యోంకారేశ్వ

శసన్నిధిని జేరె సుకృతవశంబునఁ దత్స్వామినిర్మాల్యమును భక్షించెను. కొన్నివాళ్ళకుఁ బిదప నామండూకి కాలవశంబునఁ బంచత్వంబుం గాంచి, యనంతరము జాతిస్మరణముతో సుమనసుఁడను నొకరాజునకుఁ గూఁతురై జన్మించెను. కాలక్రమంబున నామె సంప్రాప్తయౌవన యగుటం జేసి, యామెతండ్రి యగు సుమనోమహారాజు తనకూఁతును దగినవరున కిచ్చి వివాహంబుం గావింపఁ బ్రయత్నములు సలిపెను. పూర్వజ్ఞానము గల యారాజకుమారి తనతండ్రియభిప్రాయము నెఱింగి తనకు వివాహంబు వలదని వారించి, వైరాగ్యబుద్ధితో వారాణసీపురంబున కరిగి యచ్చటి పంచాయతనతీర్థవాసి యగు నోంకారేశ్వరమహాదేవుని సందర్శించుచు నచ్చటనే స్థిరనివాసము నేర్పఱచుకొనియెను. అనంతరము కొంతకాలమున కామె కాలమునకు లోనై భౌతికశరీరమును త్యజించి శివసాయుజ్యము నందెను. బ్రాహ్మణోత్తమా! మండూకి (ఆఁడుకప్ప) యయ్యు నప్పంచాయతనతీర్థనివాసమహిమచే నుత్కృష్టపరమపదమును బొందెనో కనుఁగొనుము! పూర్వకాలమున నీస్థానమున జరిగిన యీచిత్రవృత్తాంతమును నీకుఁ జెప్పితిని. ఈదివ్యతీర్థమున ఘటిల్లిన వేఱొకవిశేషమును జెప్పెదను వినుము—

పూర్వము పరమధార్మికుం డగు ప్రతాపముకుటుం డనుమహా రా జొకఁ డుండెను. ఆతనికిఁ గల పుత్త్రులలో జ్యేష్ఠకుమారుఁడు మిక్కిలి ధర్మాత్ముం డగుటయేకాక బ్రహ్మజ్ఞానియు నై యుండెను. కొంతకాల మైనతరువాత మహారాజు తనపుత్త్రునిం గాంచి యిట్లనియెను—పుత్త్రా! వివాహయోగ్యమైన ప్రాయము గలవాఁడ వైతివి గావున దారగ్రహణ మొనరింపుము. అట్లు సేయుదు వేని నీవీసంసారభారమునుండి విముక్తుండవై యత్యంతసౌఖ్యమును గాంచఁగలవు. తండ్రి యిట్లు పలుకఁగాఁ గుమారుఁడు వినతుఁడై „ తండ్రీ! ఈవివ

యమునమాత్రము నేను నీయాజ్ఞను జెల్లింపఁజాల నని చెప్పుటకు మిక్కిలియుఁ జింతించుచున్నాను." అని వాకుృచ్చెను. అప్పుడు రాజు ' వత్సా! నేను నీకు జనకుఁడనే కాక ప్రభువునుగూడ నై యున్నాను. కావున నాయాజ్ఞను బ్రతిపాలింపుము. నీ వవివాహితుఁడవై నాకుల మెల్లఁ జిరకాలనరకనిమగ్న మగునట్లు చేయకుము." అని వచించెను.

జనకునియీయాదేశమును విని బలవంతుఁ డైన యానృప కుమారుఁడు, పూర్వజన్మానుభూతము లైన సాంసారికవైచిత్ర్యము లెల్ల స్మరణకు రాఁగాఁ, దనతండ్రి కిరీతిని విన్నవించెను—పితా! తత్త్వజ్ఞానాత్మకంబులును, సహేతుకంబులును నగు నావాక్యంబులను సావధానచిత్తుండవై యాలింపుము. నేను శతసహస్రజన్మంబులను ధరించితిని. సారెసారెకు జరాదుఃఖము ననుభవించుచు మృత్యుముఖమునఁ జొచ్చుచు నుంటిని. మఱియు శతసహస్రవారంబులు దారపుత్త్రాదులతోడి సంయోగసుఖంబులను వియోగదుఃఖంబులను ననుభవించి యనుభవించి వేసరితిని. తండ్రి! తృణ, గుల్మ, లతా, వృక్ష, సరీసృప, పక్షి, మృగ, పశ్వాది నానాయోనులయందు స్త్రీపురుషాకారంబు లగుజన్మములు నాచేఁ బరిగ్రహింపఁబడినవి. ఇంకను దేవ, కిన్నర, గంధర్వ, విద్యాధర, మహోరగ, యక్ష, రాక్షస, గుహ్యక, దాస, వాప్సరోజన్మంబులను సయిత మెత్తితిని. ఏమిలాభము? ప్రతి సృష్టియందును, సృష్టింపఁబడుచుఁ బ్రతికల్పంబునందును సంహరింపఁబడుచు హద్దులేని జన్మపరంపరలను గాంచుచుంటిని. జనకా! దారపరిగ్రహణము కేవలము విడంబనామాత్రము. కేవలము రాజత్వాభిమానమును విడిచినంతమాత్రమున నెవ్వఁడును ముక్తి కలుగనేరదు. సర్వదా, శరీరాభిమానత్యాగంబే మోక్షకారణం బగుచున్నది. రాజ

త్వాభిమానవిముక్తుండయ్యును, శరీరధర్మముతోడి సుఖంబుల ననుభవించు మానవునిసుఖంబు శతుసుఖంబువంటిసుఖంబుమాత్రమే యగుచున్నది—అనఁగా సౌఖ్యంబని భావింపఁబడుదుఃఖంబే యగుచున్నది. మృత్యువును, నాశనములేనిదియు, ఎల్లప్పుడు నుండునదియు నగు బ్రహ్మమును ద్వ్యక్షరములు.* కావున నోరాజా! బ్రహ్మమృత్యువులు రెండును వ్యవస్థితములే యని నేను భావించుచున్నాను. తండ్రీ! ఇవి యిట్టి వని భూతకోటులచే నెఱుంగంబడనివై వానికి నిత్యత్వ పంచత్వముల నాపాదించుచున్నవి. ఎవ్వఁడు సర్వభూతశరీరభేదనముం గావించియు నహింసను ప్రతిపాదించుచున్నాఁడో, స్థావరజంగమాత్మకం బగు నీసమస్తప్రపంచంబునందును మెలంగుచుండియు దేనియందును మమకారము లేక వర్తించుచున్నాఁడో—అట్లుగాదేని, యెవ్వఁడు వనమధ్యమున సంతతము నివసించుచుఁ గందమూలఫలాదులచే జీవనధారణము నొనర్చుచున్నాఁడో, అట్టివానికి రాజ్యముండుటవలనిప్రయోజనంబేమి? ఇంద్రియంబుల ననుకరించు స్వభావము గలవాఁడై మమత్వమును జెందువాఁడు మృత్యుదేవతకు వశీభూతుం డగుచున్నాఁడు. పరబ్రహ్మసాక్షాత్కారంబునుం గాంచునాతఁడు మృత్యుభయమునుండి పరిరక్షింపఁబడుచున్నాఁడు. కామసంబద్ధుఁ డగువాఁడు కామసంబద్ధమగు లోకముచేఁ బ్రశంసింపఁబడుచుండును. కొందఱు కోరికలను మనంబులం దిడికొని వేదాధ్యయనహోమంబులను, దీర్ఘయాత్రాసంసేవనంబువలనను దపస్సు గావించుచుందురు. మఱికొందఱు మోక్షార్థులై దాని(ముక్తి)కొఱకే యట్టితపంబు నొనరించుచుందురు.

---

*మృత్యు—బ్రహ్మ శబ్దములు రెండును రెండేసి యక్షరములు గలవి గావున ద్వ్యక్షరములని చెప్పంబడుచున్నవి. అందు మృత్యు వనఁగా సంసారము. బ్రహ్మము అక్షరమును, శాశ్వతమును.

కాపునఁ బోయెండిరి! ఉత్తమంబైన పంచాయతనతీర్థంబునే యచ్చటికి యీశ్వరునే నిత్యమును నే నభిలషింతును. పవిత్రమైన యీయవిముక్తమహాక్షేత్రంబున సంవసించు నోంకారేశ్వరునియారాధనంబుకొఱకు నేనిప్పుడు పావనపంచాయతనతీర్థంబునకుఁ బోయి యీదేవదేవుని సంసేవించుచు నచ్చట నివసింతును. పతా! ఇప్పటికిఁ గల నావెనుకటి జన్మంబులను, అందు నా తీర్థరాజంబునఁ దెలియవచ్చిన మాహాత్మ్య విశేషంబులను నీ కిప్పుడు వివరించి చెప్పుచున్నాను వినుము—

బ్రాహ్మణ, గంధర్వ, నాగ, విద్యాధర, ఖగ, కిన్నరాది కులంబులయందు నే ననేకజన్మంబుల నెత్తి యెత్తి పిమ్మట విశుద్ధమైన వైశ్యకులంబునందు పుట్టితిని. ఆజన్మమున మంగళప్రదాయకుండును, సౌఖ్యనిదానుండును, త్రిపురవైరియు నగు మహాదేవునియందు నాకు నచంచలమైన భక్తి గుదిరెను. అంతట నేను వ్రతోపవాసాదినియమంబులచేతను, అనేకవిధస్తోత్రంబులచేతను త్రిశూలధారి యగు నద్దేవదేవుని సంతుష్టస్వాంతునిఁ గావించితిని. అవైశ్యజన్మంబునను నే నొనర్చిన సభక్తికం బగు బహుకాలతీర్థపర్యటనంబునం దొకప్పుడు పుణ్యవశంబున నతిరహస్యం బగు నయ్యవిముక్తక్షేత్రంబునం బ్రవేశించు నదృష్టము నాకు సంప్రాప్తం బయ్యెను. ఆక్షేత్రంబునఁ బంచాయతనతీర్థవాసి యగు నోంకారేశ్వరుని సందర్శించి యీదేవదేవుని యెదుట నున్న రుద్రావాసంబున నుపస్థితుండనై, వైశాఖమాసంబున రాత్రుల యందు జాగరణంబులు సలుపుచు నాస్వామిని భజించితిని. అప్పటి నాసంసేవనంబుల నెల్ల దేవ కిన్నర గంధర్వాదులు పరికించి యాశ్చర్యమగ్నమానసు లగుచుండిరి. జనకా! ఆనాపుణ్యకర్మంబుచేతనే శుభనిధానం బగు భవదీయగేహంబున జనియించు మహాభాగ్యంబు నాకు లభించెను.

తండ్రీ! ఇప్పుడు బద్ధాంజలినై నీయనుమతిని వేఁడుకొనుచున్నాను. శీఘ్రముగా నే నవిముక్తక్షేత్రంబునకుఁ బోవున ట్లనుగ్రహింపుము. ఓంకారదేవదేవునిమహాప్రసాదంబుచేతనే దేవతలకైనను లభింపరాని యీయుత్కృష్టజ్ఞానంబు నాకుఁ బొడమినది. సంసారంబునం దుండినను నేను మాయాతీతుండగు నప్పరమాత్మునియందే దృష్టిగలిగి యుందును. కావున నవిముక్తక్షేత్రంబునం బంచాయతనతీర్థంబున నున్ననిశ్చలబ్రహ్మం బగు నోంకారేశ్వరుని సందర్శింప నిప్పుడ నేఁ బరుగుచున్నాను; ఆపుణ్యక్షేత్రంబున నాస్వామి నొక్కసారి సందర్శించువానికిఁ బునర్జన్మంబు లేదు గావున నేను నచ్చటికిఁ బోయి యామహాదేవుని వీక్షించి జన్మరహితుండ నయ్యెదను.

కుమారుం డిట్లు పలుకఁగా మహారా జిట్లనియెను — పుణ్యాత్ముండ వైన యోపుత్త్రికా! నీవేపుణ్యతీర్థంబునకుఁ బోవుదువో నేను నాతీర్థంబునకే వచ్చెదను. జాతిస్మరణవశంబున నామనంబును నచ్చటికే నేఁగ నుద్విగ్నమగుచున్నది. సంసారమునం దుండినను, పురుషునకు సర్వదా వైరాగ్యంబు సముత్పన్నంబగుచున్నది — వంశానుగతికంబో, జాతిమూలకంబో యైనవృత్తిని బరిత్యజించి ప్రియంబులును, నప్రియంబులును నగువస్తువులు మాయావిశిష్టంబు లని యెఱింగి, వానియందు మమత్వాహంకారంబు లుడిగి సకలకర్మంబుల నుజ్జగించి యాత్మశుద్ధిధారణచేఁ గర్మసన్న్యాసులై పిమ్మట నవిముక్తక్షేత్రంబును జేరఁగలుగుచున్నారు. అమ్మహాక్షేత్రంబునం గరుగువారికి నితరపుణ్యక్షేత్రంబుతోఁ బనిలేదు. అవిముక్తక్షేత్రోపాసకు లాత్మత్యాగం బొనర్చి శాంతి (శమ) దాంతి (దమ) క్షాంతు (క్షమ) లును, నింద్రియజయంబును గలిగి తమయం దాత్మను నిలుపుకొనఁగలుగుటయే కాక, సర్వభూతంబులయందును నోంకారేశ్వరునిఁ, దమ్ములయాత్మలనుగూడ సంద

ర్శింపఁగలుగుదురు. అమ్మహాక్షేత్రంబునందు ' అవ్యక్తలింగు ' లను పేరం బరగు సన్న్యాసులు శతరుద్రీయస్తోత్రంబులచే దేవోపాసనలఁ గావించుచుఁ బరమందు పరమపదంబు నంది యోంకారేశ్వరునియందు ప్రవేశించి లీన మగుచున్నారు. సమస్తవేదంబులు నేమహాపదంబును బోధించుచున్నవో, తపశ్శాలు లేమహాపదంబు నభివర్ణించుచుందురో, బ్రహ్మచర్యవ్రతావలంబు లేమహాపదంబు నభిలషించుచుందురో యట్టిపరమపదం బవిముక్తక్షేత్రంబునందు నిహితంబై యున్నయది.

ఈరీతిం బలికి యమ్మహారాజు నిండుమనంబుతో నోంకారేశ్వరుని సంస్మరించి, కనిష్ఠపుత్త్రుని రాజ్యాభిషిక్తుం గావించి తనపూర్వచారిత్రముం దలపోసి వైరాగ్యంబు నొందినవాఁ డయ్యెను. మఱియు నాతఁడు పంచాయతనసంస్థితుండును, పరబ్రహ్మంబును నగు నోంకారదేవునిఁ బలుమాఱు మనఃపూర్వకంబుగ సంస్మరించి వారాణసీనగరంబునకు నరిగి యచ్చట నోంకారేశ్వరునిఁ బొందినవాఁడయ్యెను.

ఇట్లు చెప్పి సనత్కుమారుండు మరల నిట్లు పలికెను.

వ్యాసమునీంద్రా! ఈరాజు పూర్వజన్మంబున ఖగశ్రేష్ఠంబగు కపోతంబై యుండి పంచాయతనక్షేత్రంబున నివసించుచు నచ్చటి యోంకారేశ్వరునికి నిత్యంబును బ్రదక్షిణంబు లొనర్చుచు నాదేవదేవుని స్తుతులతో సేవించుచుఁ బిమ్మటఁ బంచత్వంబు నొంది యీ జన్మంబున రాజై జనియించెను. ఇప్పుడారాజును, నాతనికుమారుండును దేవదేవుం డైనయోంకారేశ్వరుని సంస్తవాదిరూపంబుల నారాధించి పుణ్యులైరి.

సనత్కుమారుని యీవాక్యంబుల నాకర్ణించి కృష్ణద్వైపాయనుండు విస్మయచిత్తుండై ‹‹మహాభాగా! ఎవ్వనినామోచ్చారణంబుఁ గావించినంతమాత్రంబున నాత్మవికాసంబు గలుగుచున్నదో యూతిరి

శూలధారియైనపరమేశ్వరునియనుగ్రహంబుఁ బొందుట కారాజును, దత్పుత్త్రుండును నేట్టివ్రతం బాచరించిరో యానతిమ్ము." అని యడుగుటయు సనత్కుమారుం డిట్లని చెప్పందొడంగెను.

ఋషిసత్తమా! అతిగోప్యంబు, నుత్తమంబు నగు రహస్యయోగంబు వక్కాణించెదనాకర్ణింపుము—"అవిముక్తక్షేత్రంబున నున్నమృత్యుంజయుండు పరమయోగస్వరూపుండును, శివశబ్దవాచ్యుండును, అనాద్యుండును, అజుండును, అవ్యయుండును నై యున్నాఁడు. ఆతఁడు స్వయంభువు; అనిర్దిష్టస్వరూపుఁడు, సకలకారణుండు; సృష్టిప్రళయస్వభావుండు, అచింత్యుఁడు, అచలుఁడు, మోక్షస్వరూపుఁడు, భయపాపరహితుండు; నిత్యుండు, నిరపేక్షుండు, అనాశ్రయుండు; నిస్తుతి; నిర్నమస్కారుండు, నిస్సంగుండు, నిరుపద్రవుఁడు; నిరంజనుఁడు; నిరుద్భవుండు; నిరాలంబుఁడు, నిర్మలుండు, నిరుపమానుండు; అపవర్గస్వరూపుండు; అవిజ్ఞేయుండు; అనామయుండు; అనిత్యుండు, సర్వకారణుండు, అలగ్నుండు, సర్వతోముఖుండు; అనాసక్తుండు, మహాదేవుండు; విశుద్ధుండు; జ్ఞాననిర్మలుండు; మంగళమూర్తి; అతీంద్రియుండు; ఆచారవివర్జితుండు; కాలాతీతుండు; మోక్షాధారభూతుండు; భయశంకావిరహితుండు; జ్ఞానపతితవిమోచనుండు.

"అమ్మహాత్ముండు స్థావరంబులకంటె భిన్నుండై, యనంతనామంబులు గలిగి చైతన్యతేజస్స్వరూపుండై యొప్పుచున్నాఁడు. ఆతఁడు జీవులశరీరంబులయందు ప్రవేశించి జ్ఞానదీపకుండై వెలుంగుచున్నాఁడు. మఱియు నుపదేశంబులవలన విదితుం డయ్యు నతండు విలుప్తవిగ్రహుండై, యాత్మజ్ఞానంబుచేతనే తెలియఁదగినవాఁ డగుచున్నాఁడు. జ్ఞానమే యాతనిదృష్టియైయున్నది. ఆతనికి సంగము లేదు. ఆతండు వెలుపలను లోపలను నిండియున్నాఁడు, నిత్యావకాశశూన్యుండు;

శ్రోత్రాదిపదార్థంబుల కగోచరుండు, ఏకకాలమునందే యాతండు విస్త
రించి వ్యాపించినవాఁడయ్యెను. అతండు దేవాదిదేవుండు, దేవతాస్వరూ
పుండు. యుక్తిప్రమాణంబులకు నధీనుం డగువాఁడుగాఁడు, ఆతనింగూ
ర్చి మనమెన్నికల్పనలను జేసికొన్నను వానికన్నిటికి నాతఁడు వేఱుపడియే
యుండును. కేవలచింతావ్యాప్తికమాత్రమే నాతండు గోచరుం డగు
చున్నాఁడు. ఆకాశమువలెనే మిక్కిలి విశాలమైనవాఁడు. ఆతనికిఁ గం
పముగాని విషయసుఖదర్శనములుగాని లేవు. ఆతఁడు సమస్తలోకప్ర
సిద్ధమార్గంబులయందును నవస్థితుఁడై విలసిల్లుచుండును. అన్నియుఁ
దానే యై యుండియు నాకారరహితుండై యున్నాఁడు. ఆతఁడు స్వ
భావరూపుండు గావునఁ జింతనలచేతనే గ్రహింపఁదగినవాఁడై యు
న్నాఁడు. జగంబులకెల్ల నతీతుండగు నాతఁడు సలక్షణుండై యొప్పా
చుండును. వాగ్వాదంబుల కాతండు బహిష్కృతుండై యుండును.
పంచభూతములకును నధీనము గాని పరమాత్మ యయ్యు, జ్ఞానగమ్యుఁ
డై, సకలపదార్థములకును ముఖ్యకారణుఁడగుచున్నాఁడు. సమస్తస్థానం
బులయందునిండియుండియు నాతండెవ్వనిచేతను స్పృశింపఁబడనివాఁడై
యున్నాఁడు. మఱియు నాతఁడు శబ్దాదిగుణసమూహమునకుఁ గారణుఁ
డగుటయేకాక శబ్దబ్రహ్మమయుండునై యున్నాఁడు. శమదమాది
సమస్తగుణంబులకు నాశ్రయభూతుండైనవాఁ డాతఁ డొక్కఁడే.
ఆ దేవునిస్వరూపంబు శబ్దంబుల కతిరిక్తం బైనది. నిఖిలజ్ఞానంబులకును
నాతండే యాశ్రయుఁడు. ఆతం డనాది; అచ్యుతుండు; దివ్యుండు;
ప్రమాణంబులకు గోచరుం డగువాఁడు గాఁడు. ఊర్ధ్వాధోభాగంబుల
నెల్ల నాతండు నిండి వర్తించుచున్నాఁడు. నిత్యుండయ్యు నాతండు
జీవస్వరూపుండై యున్నాఁడు. ఆతఁడు హేతుసంస్థితుండై యుండును.
దశేంద్రియమనోహంకారంబుల నడుమ నుపస్థితుం డయ్యు నామహా

త్మ్యంబు సకలేంద్రియంబులకును గ్రహింపరానివాఁడై యున్నాఁడు. ఆతం డాత్మయేయింద్రియములుగాఁ గలవాఁడు. ఆతనియాత్మ నిష్కళంకమైనది. ఆతండు సర్వలోకవిభుండు; స్వరాదివ్యంజనంబు లాతని వర్ణింపనేరవు. శ్వేతరక్తాదులలో నేవర్ణంబును నాతనికి లేదు. అమ్మహేశ్వరుండు వాచామగోచరుండు; ఓంకారమునకునైనఁ దెలియనిరూపము గలవాఁడు. తర్కంబుల కాతఁ డందఁడు. సృష్టికర్తుఁడు—ఉత్పత్తిసమయంబు లాతనికి లేవు.

ఆతఁడు నిశ్శంకుఁడు; నిశ్చలుఁడు; సౌమ్యుఁడు; దేహాతీతుఁడు; పరాత్పరుఁడు. పంచభూతములకును సందరానివాఁ డాతఁడే. సర్వదా నిశ్చలభావముతో నాతఁ డేకాకృతియై యొప్పుచుండును. ఆతం డచింత్యుండు; పరముండు, సూక్ష్మాతిసూక్ష్ముండు. చతుర్వేదములు, నాగమములు నాతనిఁ బ్రతిపాదించుచున్నవి. ఆతఁడు యథార్థజ్ఞానమునకునయిన నందనివాఁడు. ఆతఁ డనంతమ్ములైన నేత్రములతో నెప్పుడును మనలను బరీక్షించుచుండును. ఆతనికి నెన్నఁడును నాశములేదు. ఆతఁడు కామరూపి. సకలభూతంబులయుత్పత్తికిని, సర్వబీజసంభూతికిని గారణభూతుఁ డాతండే. సమస్తబ్రహ్మాండములయందు నాతఁడు వ్యాపించియున్నవాఁడు. ఆతఁడు కామస్వరూపుఁడు; అచ్యుతుఁడు; పరముఁడు. ఆతఁడేమహాత్ము. స్థూలసూక్ష్మవిభాగి యైన యాతఁడే ప్రకృతియుఁ బురుషుండు నై సనాతనుండై యున్నవాఁడు. ఆమహాత్ముఁ డాదిమధ్యాంతరహితుఁడు. ఆతనికి నాదియు, వినాశంబును లేవు. ఆతఁడు భూతస్వరూపుఁడు; మహాకాయుండు; శుభదాయకుండు; మోక్షప్రదాత; యోగక్రియావినిర్ముక్తుండు; మృత్యుంజయుండు; మహేశ్వరుండు; ఉపాధిశూన్యుండు; సూర్యసన్నిభుండు; అవ్యక్తుండు; నిత్యుండు; కేవలుండు; అద్వయుండు. ఆతనికంటె నన్యంబగు తేజం

బు లేదు. అవిముక్తక్షేత్రనివాసుఁడు; సర్వేశ్వరాఖ్యుఁడు; భగవంతుఁడు; ఈశానుఁడు, ఓంకారదేవుఁడు, సర్వమంగళప్రదాయకుఁడు; దేవదేవుఁడు; మహాదేవుఁడు; పంచవక్త్రుఁడు; వృషభధ్వజుఁడు; సదాశివుఁడు; విరూపాక్షుఁడు; త్రిశూలహస్తుఁడు, జటాధరుఁడు—*

ఇత్యాదిమహామహిమలతోడి దివ్యగుణనామంబులు గలమంగళస్వరూపుఁ డగుమహాదేవుని హృత్పద్మకోశమధ్యంబున నిలిపికొని నమస్కరించుచున్నాను. సకలజంతుజాలంబులయుత్పత్తికిని హేతుభూతుండును, వారాణసీనగరసంస్థితుండును, పరమపదుండును నగునోంకారదేవునికిఁ బునఃపునఃప్రణామంబు లాచరించుచున్నాను."

సనత్కుమారుఁడు మరలఁ జెప్పుచున్నాఁడు.

వ్యాసమునీంద్రా! పైప్రకారమోంకారదేవసంస్తవముం గావించి యాస్తోత్రపఠనాంతంబున నాపత్రాంగముకుటమహారాజును ఆతనిపుత్రుఁడును కోటిసూర్యాగ్నిప్రభాభాసమానం బగుదివ్యతేజముం గాంచినవారయిరి. అవిముక్తమహాక్షేత్రంబున సంయతాత్ముండై, యోంకారనిర్దిష్టమైన శంభుస్తవమును బఠించుపుణ్యాత్మునకు దివ్యసిద్ధి (ముక్తి) యెల్లప్పుడు నఱచేతిలో నుండును. ఈస్తవమును శ్రద్ధాభక్తులతో బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రులలో నెవ్వఁడు పఠించునో యాతండు సమస్తపాపంబులనుండియు ముక్తుండై ముక్తిగ్రహణంబు నొనర్చుచున్నాఁడు.

---

* ఈస్తోత్రమునకు మొదటనున్న 'మృత్యుంజయ' శబ్దము మొదలుగ నాదేవదేవుని నామము లెల్ల మూలమున ద్వితీయైకవచనములుగా నున్నవి అయినను, భాషాసంప్రదాయమునుబట్టి పఠనసౌకర్యార్థము వైభగవద్విశేషణంబు లన్నియుఁ బ్రథమైకవచనంబులుగా వ్రాయఁబడియె.

శ్రుతి—“వేదాహ మేతం పురుషం మహాన్త
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్
తమేవ విదిత్వా న భవేన్మృత్యు
ర్నాన్యః పన్థా విద్యతే హి జనానామ్.”

“సూర్యసమతేజోవిరాజితుం డగు మహాపురుషుని నేను దెలిసికొంటిని. ఆమహాత్మునే తెలిసికొన్నయెడల నిఁక సంసారబంధమే లేదు. ఇంతకంటె నీమాయాప్రపంచమునుండి యుద్ధరింపఁబడుటకు మఱియొక యుపాయమును లేదు.”

ఎవ్వఁడు సహస్ర, లక్ష, కోటిముఖంబులు గలిగి ప్రకాశించుచున్నాఁడో, అట్టియోంకారదేవుని వర్ణించుట యెవ్వరికిని సాధ్యంబుగాదు. అయిన నిప్పుడు నాయోపినంతవఱకు నోంకారేశ్వరునిమాహాత్మ్యంబు నభివర్ణించి చెప్పితిని. మునీంద్రా! సహస్రముఖంబులు గలవార లసంఖ్యాకులు చేరియు నామహాదేవునింగూర్చి సులభముగ వచించుటకు శక్యులు గారుసుమా!



శ్రీదేవాయ నమః

# పురాణగ్రంథమాలిక, పిఠాపురము.

మనపూర్వులమహామహిమలు, సత్యచారిత్రములు, భగవన్మహిమలు, ధర్మములు, నీతులు, నీతిబోధకములగు కథలు, దేవతల చరిత్రములు, రాక్షసులచర్యలు, భగవంతునియనుగ్రహము—ఇత్యాదివిషయములతో నిండియున్న యిహపరసాధకంబు లగుమనపురాణోపపురాణములు, ఇతిహాసములు మొదలగునుత్తమగ్రంధములను సులభశైలిని వచనరూపమున నాంధ్రీకరించి యాంధ్రమహాజనులహస్తముల కందించుటకై స్థాపింపఁబడినది. రెండేసినెలల కొక్కొక్కసంపుటము షుమారు 200—250 పుటలవంతున డెమ్మీసైజునఁ బ్రకటింపఁబడుచుండును. ఆంధ్రమహాజను లందఱును మాయుద్యమమునకుఁ దోడ్పడి గీర్వాణభాషయందున్నయీమహాపురాణాదులను మన తెలుఁగువారికిఁ దెలియునట్లుగా నొసఁగుచున్నమాకుఁ బ్రోత్సాహముఁ గలిగింతురు గావుత మని వేఁడికొనుచున్నాము.

నిబంధనలు.

(1) ఇందుఁ జందాదారులగువారు రు 0-4-0 ప్రవేశరుసుము చెల్లింపవలయును.

(2) చందాదారులకు పోస్టేజీ మనీఆర్డరుకర్చులు మేమే భరించి ఒక్కొక్కసంపుట మొకరూపాయకుమాత్రమే పంపుచుందుము. (చందాదారులుకానివారికి పోస్టేజిగాక రు 1-8-0 లు.)

(3) నైజాము ఇలాకాగ్రామములవారికి వి. పి. సౌకర్యములు లేవు కా

పు[illegible]ట్టివారు ప్రవేశరుసుముగా రు 5-4-0 ముందుగాఁ జెల్లించినచో వారికి ఆంధ్రసంపుటములు ప్రకటింపఁబడినప్పుడెల్ల రిజిష్టర్డుబుక్కుపోస్టుగాఁ బంపుచుందుము.

### సహాయులు.

సంవత్సరమునకు ముందుగ రు 10 ల నొసగువారిని సహాయులుగాఁ జేర్చుకొని వారినామములను సహాయులపట్టికలోఁ బ్రకటించుచు వత్సరమున వెలువడు ఆంధ్రసంపుటములను రిజిష్టర్డుపార్సెలుగాఁ బంపుచుందుము.

### పోషకులు.

ఒక్కసారిగ నూటపదియాఱురూప్యములు గ్రంథమాలికకువిరాళముగ నొసగిన భాషాభిమానులను పోషకులుగాఁ జేర్చుకొని వారి నామములను గ్రంథములలోఁ బ్రకటించుచు నీగ్రంథమాలికనుండి వెలువడు గ్రంథములన్నిటిని నెప్పటికప్పుడు అన్‌రిజిష్టర్డుపార్సెలుగాఁ బంపుచుందుము.

### రాజపోషకులు.

ఒక్కసారిగ రెండునూటపదార్లుగాని అంతకుఁబైఁగ వారియుదార్యహృదయమునకుఁ దోఁచునంతటిద్రవ్యముఁగానిదయచేయుశ్రీమంతులను జమీందారులను రాజపోషకులుగాఁజేర్చుకొనియిందుప్రకటింపఁబడుగ్రంథములన్నిటిని రిజిష్టర్డుబుక్కుపోస్టుగా నందించుచుందుము.

| | |
|---|---|
| పురాణగ్రంథమాలిక, పిఠాపురము. తూర్పుగోదావరిజిల్లా. | నడకుదుటి వీరరాజు పంతులు సంపాదకుఁడు. |

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము చందాదారులను, వారుకోరినయెడల, అడ్మిషన్ ఫీ 0-4-0 అక్కఱలేకుండ, చందాదారులుగాఁ జేర్చుకొని మాగ్రంథములు వెడలినప్పుడెల్ల ఒక్కొక్కర్యాపాయను వి. పి. గాఁబంపుదుము.

ముందురాఁబోవు పుస్తకము.

# శివపురాణము.

(నాలుగవ సంపుటము.)

సనత్కుమారసంహిత—చివరభాగము.

వాయవీయసంహిత—పూర్వభాగము.

వాయవీయసంహితలోని కథలు, నీతులు, ధర్మములు మొదలగునవి యద్భుతములు! అపూర్వములు!! శ్రీకృష్ణుఁడు సంతానము కొఱకు శివునిగూర్చి తపస్సుచేయుట; శివుఁడు ప్రత్యక్షమగుట ... .దక్షునియజ్ఞము .వీరభద్రజననము; శుంభనిశుంభవధ కొఱకు పార్వతీదేవి యవతారము. . .మొదలగునవి గలవు. ౧౯-౨౬ సం. మేనెల ౨౦ తేదీని వెలువడును.

చందాదారులకు పోష్టేజిమనీఆర్డరుఖర్చులు సహా రు 1-0-0

ఇతరులకు కర్చులుగాక రు 1-8-0

పురాణగ్రంథమాలికా కార్యస్థానము, పిఠాపురం.

---

## శ్రీ ఆదిశైవ పత్రిక.

శైవసంఘాభివృద్ధికై శివాగమములును, శైవపురాణాదులందు వర్ణింపఁబడిన శైవధర్మములును, ఉపనిషత్సారభూతములయిన శైవరహస్యములును, శివభక్తులచరితములును, సనాతనధర్మములు మొదలగుసద్విషయములు తేటతెల్లముగ ప్రచురించెడి మాసపత్రిక. డెమ్మీసైజున గ్లేజుకాగితములపై చక్కగా ముద్రింపఁబడుచున్నది. ప్రతివారును చందాదారులుగా చేరి శివధర్మోద్ధరణ మొనర్ప ప్రార్థించుచున్నాము. సంవత్సరముచందా రు 3-0-0 లుమాత్రమే.

ఎడిటర్, శ్రీ ఆదిశైవపత్రిక,

గురుకులాశ్రమము,

చిలుమూరు, అంతపవరంపోస్టు, గుంటూరు జిల్లా.